# ఉపోద్ఘాతము

గద్యచక్రవర్తులను బిరుదమునకు తమ గ్రంథరాజములచే నెంతయుఁ బాత్రులయిన బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారి యీ కృతి కుపోద్ఘాతము వ్రాయఁబూనుట సూర్యుఁ జూపించుటకై దివిటీని వెలిగించునట్టిపనియని వేరుగఁ జెప్ప నక్కఱలేదు. కాని, ఈ పుస్తకప్రకాశకులు నన్ను కోరియుండుటచేతను, కాళిదాస మహాకవి సార్వభౌముని వృత్తాంతమును దెలుపు గ్రంథ మగుటచేతను, శ్రీ లక్ష్మీనరసింహముగారి కృతికి పీఠిక వ్రాయుటయే గౌరవదాయకమగుటచేతను నేనీపనికిఁ బూనికొంటిని.

మన పూర్వకవీశ్వరులనుగూర్చిన చరిత్రవిషయములు మన కంతగా కానరాకుండుట చాల విచారకరము. అందును లోకమునంతటిని దమ కవితామృతమున చొక్కింపఁజేసిన కాళిదాసాది మహాకవుల వృత్తాంతము నిశ్చయముగా తెలిసికొనఁగలుగుటకు వలయుసాధనములు లేకుండుట కడుంగడు శోచనీయముగదా.

కాళిదాసే కాలమువాఁడు? అను విషయముం గూర్చి పండితులును చరిత్రప్రియులును తర్కవితర్కములను చేయుచున్నారు. రఘువంశ కావ్యము చివర—

"తం భావాయ ప్రసవసమయాకాంక్షిణీనాం ప్రజానా
మంతర్గూఢం క్షితిరివ నభో భీజముష్టిం దధానా
మాలైః స్సార్థం స్థవిరసచివై ర్హేమసింహాసనస్థా
రాజ్ఞీ రాజ్యం విధివ దశిష ద్భర్తురవ్యాహతాజ్ఞా

అనిప్రాయుచు కాళిదాసు అగ్నివర్ణుని భార్య గర్భమందుండిన శిశువుతో రఘుకులమునఁ దాను జెప్పఁదలచిన రాజులపేళ్లను పరిసమా

మొందించినందున నీ మహాకవి యగ్నివర్ణునికి సమకాలికుఁడై యుండ వచ్చుననియు, నగ్నివర్ణుఁడు క్రీస్తుపూర్వ మెనిమిదవ శతాబ్దమువాఁడు గావున కాళిదాసుకూడ క్రీ॥ పూ॥ ఎనిమిదవ శతాబ్దమువాఁడై యుండు ననియు నొకరనిరి. కాళిదాసు మాళవశకము నారంభించిన విక్రమార్కుని యాస్థానమువాఁడని నవరత్నములను వివరించు శ్లోకమువలన దెలియ వచ్చుచున్నది. కావునను, మాళవశకము క్రీ॥ పూ॥ 56 సం॥ ప్రారంభ మగుటను కాళిదాసు క్రీ॥ పూ॥ 56 సంవత్సరముల ప్రాంతములవాఁడని యింకొకరనిరి. 56 వ సం॥రమున విక్రమార్కుఁడను రాజే లేఁడనియు, శాకులను కోరూరుయుద్ధములో జయించిన విక్రమాదిత్యుఁడే కాళిదాసు ప్రభువగు విక్రమార్కుఁడనియు, ఈ యుద్ధము క్రీ॥ శ॥ 544 సం॥రములో జరిగియుండుటచేత కాళిదాసు క్రీ॥ శ॥ ఆఱవశతాబ్దమువాఁడనియు మఱియొకరనిరి. కాళిదాసు భోజమహారాజు నాస్థానములోనివాఁడను ప్రతీతి ననుసరించి కొందఱాతఁడు క్రీ॥ శ॥ పదునొకండవ శతాబ్దమువాఁ డని వ్రాసిరి ఇంకను నిట్లే యితరు లితరోపపత్తులఁ దెలిపి యితర కాలములను నిరూపించియున్నారు. ఈ రీతిగా గాళిదాసు క్రీస్తు పూర్వము ఎనిమిదవశతాబ్దమునుండి క్రీస్తుతరువాత పదునొకండవ శతాబ్దమువఱకును గల పదునెనిమిదిశతాబ్దముల మధ్యకాలములో నుండినట్లుమాత్రము గుడికిబారెడు దూరముగా నొక నిర్ధారణ చేయ వలసియేయున్నదిగాని మఱియొకదారి కానరానట్లుతోచుచున్నది. కాని, యీ మహాకవి యొకకాలమువాఁడు కాడనియే చెప్పవలెను. కాళిదా సెప్పుడు జన్మించినను ఆతనియందార్యసాంప్రదాయములును, ఆర్యుల మానససౌందర్యమును మూర్తీభవించియుండుటచే నార్యజాతియెన్నఁడు ప్రభవించినదో యప్పుడే యీ కవి జననమొందెననియు, ఆతఁడు ఏ పదు నొకండవశతాబ్దముననో యంతరించలేదనియు, ఆర్యజాతి భూమిపై నిలిచి యున్నన్నాళ్లు, ఆతని శాకుంతలాదిమహాగ్రంథములఁజదివి యానందింపఁ

గల యొక్కడైనను ప్రపంచమున మిగిలియున్నంతవఱకును నాతఁడు తన యశఃకాయముతో జీవించియే యుండుననియు మన మనుకొనకతప్పదు.

ఇఁక కాళిదాసు స్వప్రాంతమువాఁడను విషయమున మనమొక నిర్ధారణము చేసితిమేని, దేశములోని వివిధరాష్ట్రములవారికిని, జాతుల వారికిని ఎడతెగని వైరముఁ గల్పించినవారమగుదుము. గౌడదేశీయులు గడుసువారగుటచే తొలుతనే కాళిదాసు తమవారని నిశ్చయించిరి. మహారాష్ట్రులు ఘోరావరీమనుష్యులగుటచేత మహాకవి తమవాఁడేయని నిశ్చయించిరి. కాశ్మీరదేశస్థులు జబర్దస్తీపురుషులగుటచే కాళిదాసును తాము లాగికొనఁ బ్రయత్నించిరి. అరవవారును కేరళులును చాపక్రింది నీటివలె చల్లచల్లగా కాళిదాసు మావాఁడే యన మొదలిడుచున్నారు ఆంధ్రులుమాత్రము వెనుకఁబడుదురా ? కాళిదాసు దిఙ్నాగునికి ప్రతిస్పర్థియైనయెడల, దిఙ్నాగుడు వేఁగీ విశ్వవిద్యాలయమున కధ్యక్షుఁడుగా నుండినవాఁడను చారిత్రకవిషయము చీనాదేశపు బౌద్ధగ్రంథముల వలనఁ దేటపడుచుండుటచేఁ గాళిదాసు ఆంధ్రుఁడే యైయుండవలెను. ఆంధ్రులీవిషయమై తగినకృషి చేయకపోరని నా నమ్మకము. కాళిదాసు భారతవర్షీయుఁడని మాత్రము చెప్పినంతవఱకును మన మేమియు ననరాదు. కాని, భారతవర్షమున స్వప్రాంతమువాఁడను ప్రశ్న వచ్చి నప్పుడుమాత్రము ఆంధ్రులు తమ సహజోత్సాహమునుజూపి వారికి సైజమగు కేవలోత్సాహముతోఁ దృప్తిజెందక, ఆ మహాకవికృతకావ్య నాటకములఁ జదివి యందలి యానందమును గ్రహించి వానిరసమునాని, కాళిదాసు కేవలాంధ్రుఁడగుట యటుండ, ఆతఁడు మా జిల్లావాఁడు, మా తాలూకావాఁడు, మా గ్రామమువాఁడు, అనుస్పర్థనహింతురుగాక యని కోరుచున్నాను.

కాళిదాసొక్కఁడుకాఁడు. ఆ పేరుగలవారు పెక్కురున్నారని కొందఱు పండితులు ఋజువుచేయుచున్నారు. ఎందఱెంతమందియున్నను, ప్రజలహృదయపరివర్తియగు కాళిదాసొక్కఁడే. అతనివిషయమైనగాథలే

యీ గ్రంథమునందు క్రోడీకరింపఁబడియున్నవి. కాళిదాసుని కవిత్వ సంపదను పండితులు మెచ్చుకొనుచుందురు ఆ మహామహునికథలను చెప్పికొనుచు పండితపామరులందఱును నానందించుచుందురు. ఈ కథలు దేశ దేశములందును గలవు. భిన్నభిన్నములుగాఁ గలవు. ఆంధ్ర దేశములో నాతనిఁగూర్చి పండితసంప్రదాయములో వచ్చుచున్న కథలనన్నిటి నొకచోఁ జేర్చి శ్రీ లక్ష్మీనరసింహము పంతులుగారు మహోపకార మొనర్చిరి. ఈ కథలు నానాఁటికి దేశమున విస్మరింపఁబడుచున్నవి. వానిని గ్రంథరూపముఁ జేర్పకుండిన నవియన్నియు నంతరింపఁగలవు. వాని స్థానమున పాశ్చాత్త్యులకథ లల్లుకొనఁగలవు. కావున, ఆంధ్రులీ గ్రంథమందలి కథలనుజదివి, యింటింటను వీనిని స్త్రీలకును బాల బాలికలకును వినుపింపవలయును. ఇంగ్లీషువారి పూర్వకవులఁగూర్చి కూడ నింతకంటె చరిత్రాధారములుగల కథలు లేవు. అయినను వారు తమ పూర్వుల కథల నత్యుత్సాహముతోఁ జదివి, పిల్లలకు చిన్నతనము నుండియు నేర్పుచుందురు. ఇందుచే దేశాభిమానము వెలయును. తమ పూర్వుల యౌన్నత్యముఁగూర్చి గొప్ప యభిప్రాయములు కుదురు కొనును. జాతీయత యనునదిట్టి కథాసంప్రదాయములవలననే యల్లు కొనును. కావున ఆంధ్రులుకూడ భారతజాతీయతాస్థిరత్వమునకుఁ బోడ్పడ నెంచినచో విద్యావిధానమున నిట్టి కథలను పఠించుటగూడ నొక యంగముగా గ్రహింపవలయును.

చక్కని శైలితో, సులభవచనముగ, రసవత్తరముగ నీగ్రంథమును రచించిన శ్రీ లక్ష్మీనరసింహముగారియెడల నాంధ్రులు కృతజ్ఞులై యుందురుగాక !


చిలుకూరి నారాయణరావు, M. A. L. T.

Lecturer in Telugu and Sanskrit, and Superintendent of Vernaculars, Govt. Arts College, Rajahmundry.

ం

# విషయసూచిక

# కాళిదాస చరిత్ర

## కాలనిర్ణయము

శ్లో॥ ధన్వంతరిక్షపణకామరసింహశంకు
భేతాళభట్టఘటకర్పర కాళిదాసాః,
ఖ్యాతో వరాహమిహిరో నృపతేస్సభాయాం
రత్నాని వరరుచి ర్నవవిక్రమస్య.

అని యొక పురాతన శ్లోకము కలదు. దీని యర్థ మేమనఁగా 1. ధన్వంతరి, 2. క్షపణకుఁడు, 3. అమరసింహుఁడు, 4. శంకుఁడు, 5. భేతాళభట్టు, 6. ఘటకర్పరుఁడు, 7. కాళిదాసు, 8. వరాహమిహిరుఁడు, 9. వరరుచి. ఈ తొమ్మండుగురును విక్రమార్క మహారాజుయొక్క సభలో నవరత్నములని చెప్పఁబడుచు వచ్చిరి. ఇందు ధన్వంతరి వైద్యశాస్త్ర పండితుఁడు. క్షపణకుఁడు ఁడేగ్రంథము రచియించెనో తెలియదు. అమరమని పేరుతో దేశమందంతట మిక్కిలి ప్రఖ్యాతి జెందిన నామలింగానుశాసన మీయమరసింహుఁడు రచించినదే. శంకుఁ డెవరో తెలియదు. భేతాళభట్టు రచించిన గ్రంథములు కానఁబడవు. ఘటకర్పరుఁడు ప్రాకృతభాషలోఁ గొన్ని గ్రంథములను రచించెనని

చెప్పఁదురు. ఇఁకఁ గాళిదాసునిమాట చెప్పనక్కఱలేదు. రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము నను మూఁడు మహాకావ్యములను, అభిజ్ఞాన శాకుంతలము, విక్రమోర్వశీయము, మాళవికాగ్నిమిత్రము నను మూఁడు నాటకములను సంస్కృతములో రచించి మృతజీవుఁ డయ్యెను. వరాహమిహిరుఁడు జ్యోతిశ్శాస్త్రమునందు గొప్ప పండితుఁడై బృహత్సంహిత, బృహజ్జాతకము నను రెండు మహా గ్రంథములను రచియించెను. వరరుచి వ్యాకరణశాస్త్రము వ్రాసెను. ఈ తొమ్మండుగురు నిజముగా నవరత్నములే యని చెప్పవచ్చును. ఈ నవరత్నహారములో నిజముగాఁ గాళిదాసు నాయకమణి యని చెప్పవచ్చును ఇతనికి వచ్చినంతపేరు మఱియెవ్వరికిని రాలేదు. శ్లోకములో నితఁడు విక్రమార్క సభయం దున్నవాఁడని స్పష్టముగాఁ జెప్పఁబడినను అధారానగర మేలిన భోజరాజునకును గాళిదాసునకును సంబంధ మెక్కువ యుండినట్లు లోకములో ననేకకథలుకలవు. కాళిదాసు వంటి మహాకవి ప్రపంచమున లేఁడు. " ఉపమా కాళిదాసస్య " అనఁగా నుపమాలంకారము కాళిదాసునిదే యని యర్థము. పోలిక పోల్చినఁ గాళిదాసే పోల్చవలెను. ఆ విషయమున నాతఁడు నిరుపమానుఁడు. " కవికులగురుః కాళిదాసో విలాసః " అని జయదేవమహాత్ముఁడు చెప్పినాఁడు. అనఁగా గవితాకన్యకకు " కవికులగురువైన కాళిదాసే చక్కదనము " అని దీని యభిప్రాయము.

శ్లో॥ పురా కవీనాంగణనా ప్రసంగే కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా,
అద్యాపి తత్తుల్యకవే రభావాత్ అనామికా సార్థవతీ బభూవ॥

తాత్పర్యము: పూర్వకాలము కవులను లెక్క జూచునపుడు కాళిదాసుని పేరు కనిష్ఠికముమీఁద (అనఁగాఁ జిటికెనవ్రేలిమీఁద) నిలచినది అది మొదలుకొని నేఁటివఱకు వానితో సమానుఁడైన కవీశ్వరుఁడు

మరల జన్మింపకపోవుటచేతఁ జిటికెన వ్రేలి తరువాత వ్రేలికి 'అనామిక' యను పేరు కలిగినది.

ఈ విధముగా సమస్తకవులు, సమస్త పండితులు మెచ్చుకొనఁ దగినట్టి మహాకవిత్వముగల మహాకవి కాళిదాసుయొక్క చరిత్రము మనకుఁ దెలియకపోవుట మిక్కిలి విచారకరము. దేశచరిత్రలు మనలో లేక పోవుటచేత నిటువంటి ప్రసిద్ధ మహాకవుల వృత్తాంతములు మనకుఁ దెలియకపోవుట సంభవించెను. కాళిదాసుని గురించి యిప్పుడు చెప్పుకొనుచున్న కథలు, వ్రాయబడుచున్నకథలు, కేవలము పుక్కిటిపురాణములే కాని నిజమైనవి కావు. కాని, యవి మనోహరములుగ నుండుటచే జనసామాన్యముచేత నాదరింపఁబడుచున్నవి. అందుచేత జనులు చెప్పుకొనుచున్న కథలను బట్టి కాళిదాసచరిత్రము వ్రాయవలయును.

కాళిదాసుఁడు విక్రమార్కుని సభలోనివాఁడైన పక్షమున విక్రమార్కశకము క్రీస్తుకుముందు 56వ సంవత్సరమునఁ బ్రారంభమైనది గనుక కాళిదాసుఁ డిప్పటికి రెండువేల సంవత్సరములక్రిందటివాఁడై యుండవలెను. కొందఱు పండితులు గుప్తవంశమునందలి ప్రథమ చక్రవర్తియైన చంద్రగుప్త విక్రమాదిత్యుని యాస్థానము నందుఁ గాలిదాసుఁడు కవియై యుండెనని వ్రాయుచున్నారు. అట్లైన నతఁడు క్రీస్తుతరువాత 350 వ సంవత్సర ప్రాంతముల నుండవలెను. అనఁగా నిప్పటికి 1600 సంవత్సరములక్రింద నుండియుండవలయును. లోకులు చెప్పుకొనునట్లు కాళిదాసుఁడు భోజరాజు నాస్థానమునసే యుండిన పక్షమున భోజరాజు క్రీస్తుతరువాత 1000 సం॥రముు మొదలుకొని రమారమి 1050 వఱకు మాళవదేశమును బరిపాలించెను. గావునఁ గాళిదాస మహాకవి యిప్పటి కించుమించుగా 900 ఏండ్లక్రింద నుండియుండవలెను. ఇద్దఱు కాళిదాసు లున్నారని కొందఱు పండితుల

యభిప్రాయము. అట్లయిన విక్రమార్కుని యాస్థానమున నొకరు, భోజుని యాస్థానమున నొకరు నుండిరేమో? అతని కాలనిర్ణయము సరిగా నింతవఱకుఁ జేయఁబడలేదు, ఇతఁడు గౌడదేశస్థుఁడనియు, కౌండిన్యసగోత్రుఁడనియు గొందఱనుచున్నారు. ఇట్లనుట కాధారము లేవియుఁ గానఁబడవు

## మతము

కాళిదాసుఁడు
శివభక్తుఁడు.

ఇందుకు నిదర్శనము లనేకములు కలవు. కుమారసంభవమను శైవ కావ్యము నితఁడు రచియించెను. అందు శివుఁడు పార్వతిని వివాహమాడుటయు, నామెవలనఁ గుమారస్వామిని గనుటయు, నతనిచేతఁ ద్రిలోక కంటకుఁడై-యింద్రాది దేవతలను హింసించిన తారకాసురునిఁ జంపించుటయు, మొదలగు వృత్తాంత మతిమనోహరముగా వర్ణింపఁబడియున్నది. ఇదిగాక యమ్మహాకవి తాను రచించిన రఘువంశ కావ్యమునందు,

శ్లో॥ వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే,
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ.

తా॥ మాటయు దాని యర్థము నెట్లు కలిసియుండునో యట్లు కలసియున్నట్టియు, జగములకుఁ దల్లిదండ్రులైనట్టియుఁ బార్వతీ పరమేశ్వరులను వాక్యార్థ సిద్ధికొఱకు నమస్కరించుచున్నాఁడను.

అని మొట్టమొదట నిష్టదేవతా ప్రార్థనము జేసియున్నాఁడు. నాటకరాజమని జగత్ప్రసిద్ధిఁజెందిన యభిజ్ఞానశాకుంతల నాటకమునందుఁ గాళిదాసుఁడు నాందీరూపకమైన యీ క్రింది శ్లోకముచేత శివునే స్తుతించియున్నాఁడు.

శ్లో॥ యాస్సృష్టిః స్రష్టురాద్యా వహతివిధిహుతం యాహవిర్యాచహోత్రీ
యేద్వేకాలం విధత్తః శ్రుతివిషయగుణాయా స్థితావ్యాప్య విశ్వం
యామాహుః సర్వబీజప్రకృతిరితి యయా ప్రాణినఃప్రాణవన్తః
ప్రత్యక్షాభిః ప్రపన్న స్తనుభిరవతు వస్తాభిరష్టాభి రీశః

తా॥ బ్రహ్మయొక్క మొదటిసృష్టి యేదియో, విధిప్రకారము హోమముచేయఁబడిన హవిస్సు నేదితాల్చునో, యేది హోతృరూపమో యే రెండు కాలవిభాగ మిచ్చుచున్నవో, శృతివిషయగుణము గలదై విశ్వమంతయు వ్యాపించి యేది యున్నదో, సర్వభూతములకుఁ బ్రకృతి యని దేనిం జెప్పుదురో, దేనిచేత జంతువులు ప్రాణవంతము లగుచున్నవో, ప్రత్యక్షముగానున్న యా యెనిమిది మూర్తులచేత నీశ్వరుఁడు ప్రసన్నుఁడై మిమ్ము రక్షించుఁగాక !

మఱియు నీకవి రచించిన విక్రమోర్వశీయ నాటకమునందలి నాందిచేతఁగూడ శివస్తుతియే యిట్లు చేసినాఁడు.

శ్లో॥ వేదాంతేషు యమాహు రేకపురుషం వ్యాప్య స్థితం రోదసీ
యస్మిన్నీశ్వర ఇత్యనన్యవిషయః శబ్దో యథార్థాక్షరః
అంతర్యశ్చ ముముక్షుభిర్నియమిత ప్రాణాదిభి ర్మృగ్యతే
స స్థాణుః స్థిరభక్తి యోగసులభో నిశ్శ్రేయసాయాస్తునః.

తా॥ వేదాంతములయం దెవ్వనిని విశ్వమంతయు వ్యాపించి యున్నట్టి యేకపురుషునిగాఁ జెప్పుచున్నారో, యన్యులకెవ్వరికిఁ జెందని యీశ్వరశబ్ద మెవనియందు సార్థకమైనదో, ప్రాణాయామవిద్యయందుఁ బ్రవీణులైన ముముక్షువు లెవ్వని వెదకుచుందురో, స్థిరభక్తి యోగ సులభుఁడైన యాస్థాణుఁడు మీకు మోక్షసుఖము లిచ్చుఁగాక !

మాళవికాగ్నిమిత్ర నాటకమందుఁగూడ నితఁ డీవిధముగానే శంకరస్తుతి జేసినాఁడు.

శ్లో॥ ఏకైశ్వర్యే స్థితోపి ప్రణతబహుఫలే యః స్వయం కృత్తివాసాః
కాంతాసమ్మిశ్రదేహోప్యవిషయమనసాం యః పరస్తాద్యతీనాం
అష్టాభిర్యస్య కృత్స్నం జగదపి తనుభిః బిభ్రతో నాభిమానః
సన్మార్గాలోకనాయ వ్యపనయతు స వస్తామసీంవృత్తిమీశః.

తా॥ ఎవ్వఁడు మహైశ్వర్యముఁ గలిగియుఁ దాను తోలు దాల్చి భయభక్తులకు బహుఫలము లిచ్చుచుండునో, యర్ధనారీశ్వరుఁ డయ్యు జితేంద్రియులైన యతులకుఁగూడ నతీతుఁడయ్యెనో, తన యష్టమూర్తులచేత జగత్తును భరించుచున్నవాఁడయ్యు నభిమానము లేకయున్నవాఁడో, యట్టి యీశుఁడు సన్మార్గదర్శనముకొఱకై మీ తామసవృత్తి నడఁచుఁగాక.

## గ్రంథరచనలో నొక చమత్కారము

కాళిదాసుఁడు తన కావ్యరచనలో నొక చిత్రమైనపక్కి ననలంబించెనని చెప్పెదరు. వివాహమైన తరువాత నతఁడు గదిలోఁ బండుకొనియున్నప్పుడు భార్య యతని యరసికతఁజూచి "అస్తి కశ్చిద్వాగ్విశేషః" యని ప్రశ్న మడిగె ననియు, దానియర్థముఁ దెలియకతఁడు భార్య ననాదరణము జేసె ననియుఁ జెప్పెదరు. వాగ్విశేష మేమైనఁగలదా యనియర్థము. అనఁగా నేమైన పాండిత్యము మీకుఁ గలదా యని దానిభావము. తరువాత నతఁడు కాళికావరప్రసాదముబడసి భార్యను వీడుకొని దేశాంతరములకుఁ బోయి భార్యవలననే తనకట్టి విద్యావిశేషము గలిగినదని యామెయెడల విశ్వాసముగలిగి మొట్టమొదటఁ దన్నామె యడిగిన యా ప్రశ్నములో నున్న 'అస్తి, కశ్చిత్, వాక్, విశేషః' యను నాలుగు మాటలను నాలుగుకావ్యములలో మొదటిమాటలుగాఁజేసి గ్రంథరచనము చేసెనని

యాఖ్యలు వక్కాణింతురు. 'అస్తి' యనుమాట కుమారసంభవములో మొదటి శ్లోకములోఁ గలదు. "అస్త్యుత్తరస్యాందిశి దేవతాత్మా" యని కుమారసంభవములోని మొదటిశ్లోకములో మొదటిపాదము. 'కశ్చిత్ ' అనునది మేఘసందేశకావ్యములో మొట్టమొదటి మాట. "కశ్చిత్కాంతావిరహగురుణా స్వాధికారాత్ప్రమత్తః" అనునది యా కావ్యములోని మొదటిశ్లోకములోని మొదటి పాదము. 'వాక్' అనునది రఘువంశములో మొట్టమొదట నున్నది. "వాగర్థా వివ సంపృక్తౌ" అనునది యా కావ్యములోని మొదటి శ్లోకములో మొదటి పాదము, 'విశేషః' యను పద మేకావ్యమునందు మొదటఁ బ్రయోగించెనో తెలియదు.

## కాళిదాసుని యితర గ్రంథములు

ఇదివఱ కుదాహరించిన మూఁడు నాటకములు, మూఁడు కావ్యములుఁ గాక కాళిదాసుఁడు ఋతుసంహార మను నొక కావ్యమును రచియించెను. ఒక సంవత్సరమునందలి యాఱు ఋతువులు మిక్కిలి రసవంతముగా నీ కావ్యమున వర్ణింపఁబడినవి. అతని కల్పనా చమత్కృతి యంతయు దీనిలోఁ గనఁబడుచున్నది. ఇవిగాక రోలంబరాజీయ మను వైద్య శాస్త్రమును, చంద్రలోక మను నలంకారశాస్త్రమును, వృత్తరత్నావళి యను ఛందశ్శాస్త్రమును, తారావళి యను జ్యోతిశ్శాస్త్రమును, ప్రాభాకర వ్యాకరణంబునఁ దనపేర నొక ఘట్టమును రచియించినట్లు లోకమున వాడుక గలదు. కాని, మూఁడు నాటకములు, ఋతు సంహారముతోఁగూడ నాలుగుకావ్యములు నీతఁడు వ్రాసెనని పండితు

లందఱు నైకకంఠ్యముగ నొప్పుకొనుచున్నారు కాని, ద్రోణుబ రాజీయము మొదలగు నితర గ్రంథములు మఱియొక కాళిదాసుఁడు రచియించెనుగాని యీ కాళిదాసునివిగావని వారి యభిప్రాయము నలోదయముగూడ కాళిదాస మహాకవిరచితమేయని యొక ప్రతీతి కలదు. గాని దానింగూర్చి చెప్పఁబడు విచిత్రకథనుబట్టియే కాళిదాసుఁడు దానిని రచింపలేదని స్పష్టపడుచున్నది కథ చమత్కారముగా నుండుటచే నిందుదాహరింపఁబడుచున్నది.

కాళిదాసుకవిత్వము మిక్కిలిసరసమై, సులభమై, ద్రాక్షపండ్లవలె నుండుటంజేసి యీర్ష్యాగ్రహస్తులైన కొందఱు పండితులు వాని కవిత్వము యమకములు, శ్లేషలు మొదలగునవి లేక పేలవముగా నుండునని దోషారోపణసేయఁజొచ్చిరి. అటువంటికవిత్వము సహజముగా నతని కిష్టములేకపోయినను మూర్ఖులు తనయందారోపించిన దోషమును బాపుకొనుటకును, యమకశ్లేషలతోఁగూడిన చిత్రకవిత్వముఁగూడ జెప్పఁగల సామర్థ్యము తనకుఁగలదని లోకమునకుఁ దెలియఁజేయుటకును నతఁడట్టికావ్యము జేయఁ బ్రయత్నము సేయుచుండ నంతలో వేశ్యా హస్తమున నతనికి బలవన్మరణము గలిగెను.

మరణానంతరమున నతఁడు పాంచాలదేశమున నొక బ్రాహ్మణునకుఁ గుమారుఁడై పుట్టి చిన్ననాఁటనే విద్యాభ్యాసము చేయఁ దొడఁగెను పూర్వజన్మ సంస్కారవిశేషమున విద్యలు తనకు ననాయాసముగాఁ బట్టువడెను. అతని తండ్రియు విద్వాంసుఁడే. అతఁ డాదేశపురాజునింట ననుదినముఁ బురాణము జెప్పుచుండెను. ఒకనాఁ డాబ్రాహ్మణుఁడు కార్యాంతర ప్రసక్తిచేత రాజుగారితో మనవిసేయకయే గ్రామాంతరమునకుఁ బోయెను. పురాణము జెప్పునట్టివేళకు మరల రావచ్చునని యతని సంకల్పము. అనుకొన్నప్రకారము జరుగలేదు. ఆనాఁడు భయంకరమైన

జంఝామారుతము వీవఁదొడఁగెను. గొప్ప గాలివాన వచ్చెను. పిడుగులు పడఁ గొచ్చెను. అందుచేత నా మహీసురుఁడు స్వగ్రామము నకు రాలేకపోయెను. పురాణము చెప్పుటకు వేళయగుటచే రాజు బ్రాహ్మణునింటికి వర్తమాన మంపెను. ఏమి ప్రమాదము వచ్చెనో యని బ్రాహ్మణుభార్య భయపడఁ దొచ్చెను. అప్పుడు బాలుఁడు "అమ్మా! నేను పోయి రాజుగృహమునఁ బురాణము జెప్పివచ్చెద" నని పలుక "వెఱ్ఱివాఁడా! అది నీకెట్లు సాధ్యమగు" నని తల్లి మాన్పించెను. ఆ మాటలు వినక రాజసేవకునివెంట నా బిడ్డఁడు పోయి రాజసందర్శనము చేసి "మా నాయనగారు గ్రామాంతరము వెళ్లి రాలేకపోయిరి. పురాణము నేఁజెప్పెదను. ఏ గ్రంథము జెప్ప వలయునో సెలవిండు" అనియడిగెను. రాజు వానిమాటలు విని నవ్వి పరిహాసార్థముగా "మహాభారతములోని నలచరిత్రము నేఁడు పురాణము చెప్పవలయును. చెప్పగలవేని జెప్పుము" అని పలికెను. అప్పుడా బాలకుఁడు వెల్లెయని "దేవా! ఒకరు చెప్పిన గ్రంథము చదివి నేను పురాణము చెప్పను. గ్రంథముఁగూడ నేనే రచించి పురాణము జెప్పెద చిత్తగింపుఁడు" అని యాశుధారగా **నలోదయ** మని పేరుపెట్టి నలచరిత్రము నవరసములతోడను, గంభీరభావములతోడను, శ్లేషల తోడను, చిత్రకల్పనలతోడను, బహుయమకములతోడను జెప్పెను. రాజతని కవిత్వము విని యట్టి పసిబాలుఁడట్టి మహాకవిత్వము జెప్పినందుకు మిక్కిలి యాశ్చర్యమునొంది గొప్ప బహుమానము జేసెను. ఇవన్నియుఁ గల్పితకథలని తెలియుచునేయున్నది. మొత్తము మీఁదఁ గాళిదాసుపేర మూఁడు నాటకములు నాలుగు కావ్యములు మాత్రమే ప్రచారముగలిగియున్నవి.

## కాళిదాసు జన్మ వృత్తాంతము

పూర్వకాలమున మాళవదేశమున నొక గొప్ప తపోవనము కలదు. అది సకల ఫలవృక్షములతోను, పుష్పభరిత లతలతోడను, మిక్కిలి సుందరము లగు పక్షివిశేషములతోడను, నానావిధ మృగసంతతితోడను, నిండి యతి మనోహరమై మహాప్రభావ సంపన్నులగు మహర్షులతోడను నిండి యుండెను. ఆ తపోవన ప్రభావము వర్ణింపఁదరముకాదు. అక్కడి ఋషుల ప్రభావముచేతఁ బిల్లులు నెలుకలు వైరములేక చర్లాటలాడుచుండును. నెమళ్లు వేసవికాలమం దెండఁబడి పాములను దమ పింఛముల నీడలకుఁ జేర్చి తాపశాంతి జేయును. ఆవులు పులిపిల్లలకుఁ బాలిచ్చును. పులుల గుహాలలో జింకలు నిద్రించును. చిలుకలు, గోరువంకలు మహర్షులు వల్లించునపుడు విని స్వాధ్యాయము జదువుటయేగాక ఋషికుమారుల కప్పుడప్పుడు దప్పుల దిద్దుచుండును. భక్తి లేనివారికైన నా యాశ్రమముఁ బ్రవేశించినపుడు విశేషమైన భక్తిజ్ఞానవైరాగ్యములు గుదురు చుండును. ఆ యాశ్రమము పవిత్రతకుఁ దావలంబై శాంతికి స్థానంబై జ్ఞానమునకు నిధియై భక్తికిఁ బరమావధియై వైరాగ్యమునకుఁ బుట్టినిల్లై నిష్టకు నిలయంబై విరాజిల్లుచుండును. వెండియు నా యాశ్రమంబు నిర్మల స్వాదుజలపూరితము లగు సరోవరంబులును, సరోవరంబున కలంకారంబులై విలసిల్లు తామరపువ్వులును, పువ్వులయందలి మకరందరసములఁ ద్రావుచు జుమ్మని ఝుంకారమ్ములుచేయు తుమ్మెదలును, తుమ్మెద ఝుంకారమ్ముల కనుగుణమ్ముగా నెలుఁగెత్తికూయు శుకపికశారికా

సమూహములును గలిగి కన్నులపండువును జెవులకు విందును జేయుచు నతి రమణీయంబై యుండును.

ఆ యాశ్రమమున మహానుభావుండైన చిరంతపుఁడను నొకముని దీర్ఘకాలమునుండి తపము చేయుచుండెను. అతఁడు కొంతకాలము ధూమపాయియై యనఁగా పొగబీల్చి బ్రదుకుచు, మఱికొంతకాలము గాలిఁదిని జీవించుచు, మఱికొంతకాలము జలభక్షణముచేత నుదరము నిండించుకొనుచు, మఱికొంతకాలమాకులు, దుంపలు, గాయలు, పండ్లు మెక్కి పొట్ట బోసికొనుచు, మఱికొంతకాలము నిరాహారుఁడగుచు, మండు వేసవి కాలమునఁ బంచాగ్నిమధ్యముననను, వర్షాకాలమున నింగికి నేలకు నేకధారగా నాకసము చిల్లులువడునట్లు వానలు గురియునప్పుడు బట్టబయటను, జగమునంతయు గడగడ వడకించునట్టి శీతకాలమున నహోరాత్రములుఁ బ్రదేశ్యనలెనుండు చన్నీరుగల తటాకములయందును నిలిచి కొన్నాళ్ళూర్ధ్వబాహుఁడై, కొన్నాళ్లొంటికాలిమీఁద నిలిచి యుగ్రతపము జేసెను. ఆతని ఘోరతపముఁ గాంచి మానులు కిమ్మనక యూరకుండిరి వేల్పులు వెఱగొందిరి, విద్యాధరులు విన్నఁబోయిరి, సిద్ధులు సిగ్గుపడిరి, పన్నగులు పాఱిపోయిరి, గరుడులు గడగడవడంకిరి, పదునాల్గులోకములు పల్లటిల్లెను అష్టదిక్పాలకులు తమతమ స్థానంబుల నితఁడు తపోవైభవంబున నాక్రమించుకొనునని దిగులుజెంది యింద్రునితో మొఱవెట్టుకొనిరి. ఇంద్రునకు నట్టిభయమే గలుగుటం జేసి తన యాస్థాన వేశ్యలగు రంభాదులను రావించి గారవించి యిట్లనియె—"సుందరులారా! మీవలన నాకొక్క ప్రయోజనము కలదు. అయ్యది మీరు తప్పక చేయవలయును. భూలోకంబున నొక మహర్షి చిరంతపుఁ డనువాఁడు మహోగ్రతపము చేయుచున్నవాఁడు. ఇంతవఱకు దేవదానవరాక్షసమనుష్యుల తపంబులఁ జూచితిమి గాని యింత లోకభయంకరముగఁ జేయు ఘోరతపము జేయువాఁ

డెనఁడుఁ గనఁబడఁడు. వాఁడు తన దారుణతపముచే దిక్పాలకుఁ దమ తమ పదవులనుండి దిగఁద్రోచి వాటిని దా నాక్రమించుకొనవలె నని చూచుచున్నట్లు కనఁబడుచున్నది. ఈ మహావిపత్తునుండి మీరు మమ్ముఁ దప్పింపవలయును, ఈ స్వర్గసామ్రాజ్యమునకు రాక్షసులవలన భయము, మహర్షులవలన భయముసుగూడ కలదు. రాక్షసభయమును శ్రీమన్నారాయణుఁడు పెక్కుసారులు నివారించెను. ఈపని బ్రహ్మవిష్ణుమహేశ్వరుల వలనఁ గాదు. మన్మథుఁడు చేయవలెను. మన్మథుని చెలికత్తెలైన మీవంటి మితారులు చేయవలెను. మీరు నాయాజ్ఞ దాఁటని బోటులగుటచే నా పని తప్పక నెరవేర్తురని నమ్మికతో మన్మథునిఁ బిలువనంపలేదు. మీ చేష్టలముందు వారినిష్ఠలు నిలుచునే? మీ గానంబుల ముందు వారి మానంబులు మాయముగాకుండునే? మీ చిఱునవ్వులఁ జూచిన వారి నియమములు దవ్వుల కరుగవే? మీ రూపంబు జూచిన వారు మదనతాపంబు పాలుగాకుందురే? మీ కరారవిందస్పర్శనమైనప్పుడు పులకింపకుండుటకు వారి మేనులు దేహములుగాక లోహములా? కావున మీ రీక్షణంబ యరిగి నా కార్యసిద్ధి చేయుఁడు. మీకు మంగళమగుఁగాక!" అని వీడుకొల్పిన నామెలఁతలు "మనమా మహాముని మనస్సు కలఁపఁగలమా? ఆ మహాత్ముని కోపముచే నందఱము శాపముపాలగుదుమే మోకదా!" యని శంకించుచు మన మింత మాత్రపుపని చేయఁజాలమాయని ధైర్యముఁ దెచ్చుకొని తలపంకించుచు స్వర్గమును బాసి దుర్గమమగు నా యాశ్రమమును నశ్రమమునఁ జొచ్చి మూర్తీభవించిన బ్రహ్మతేజంబుపగిది నాకారంబు ధరియించిన శాంతరసముభాతి, నంగంబులు దాల్చిన తపోదేవతవలె వ్యాఘ్రచర్మోత్తరీయుఁడై రుద్రాక్షమాలాలంకృతుఁడై హృదయపద్మప్రణిహితశివుఁడై బద్ధపద్మాసనస్థుఁడై చిరకాలసముపార్జిత తపోధనుఁడై ఘనుఁ

పై యున్న యా మహామునిని సందర్శించి భయసంభ్రమంబులచేత నించుక నడకి యెట్టకేలకు ధైర్యముఁ దెచ్చుకొని మెల్లమెల్లన నాతనిఁ జేరి పూజకు నానావిధ పుష్పములఁ దెచ్చియిచ్చియు, నగ్నిహోత్రములకు సమిధలందిచ్చియు, నారబట్టలఁ దడిపి యుదికి యారవైచియు, పర్ణశాల శుభ్రముగా నూడ్చియు, నతనికిఁ గొంతకాలము శుశ్రూష జేసిరి. పిమ్మట నతఁడు కొంత చనవిచ్చుటయు, నతనిమన సానంద సముద్రమున నోలలాడునట్లు కిన్నరులవంటి కంఠములెత్తి యొకమాఱు గానము సేయుదురు, ఒకమాఱు మందహాసము చేయుదురు. ఒకసారి వికవిక నవ్వుదురు. ఒకసారి భయవినయంబులతో నమస్కరింతురు. ఇట్లనేక విలాసంబులఁ జూపి యాతనిం దమ వలలో వైచికొని కొట్టకొనకుఁ దమదాసునిం జేసికొనిరి. అంతట నా ముని హోమాగ్నిని విడిచి కామాగ్నిపాలయ్యెను. యోగంబుపోయి రాగంబు వాని నాశ్రయించెను. చిట్టచివర కాతఁడు నిష్ఠవిడచి, నియమమువిడిచి, జపము విడచి, ధ్యానము విడచి, మానము విడచి నిరంతర స్త్రీలోలుఁడై భోగపరాయణుఁడై పరలోకంబు మఱచి కామినీలోకంబు నమ్ముకొని వారి కటాక్షవీక్షణములె రక్షణములుగ, వారి చరణంబులె శరణంబులుగ సిగ్గువిడిచి విహరింపఁజొచ్చెను.

అహాహా! కాముకులకు సిగ్గుశరము లుండునా? భయభక్తు లుండునా? యుక్తాయుక్తము లుండునా? అటులుండ నొకనాఁడు సనకసనందనులు, వాలఖిల్యులు, మొదలగు మహర్షులు తన్మార్గంబునం బోవుచు నా యాశ్రమంబుఁ బ్రవేశించి చిరంతపుఁడు మహోగ్రతపము చేయుచున్నాఁ డనుకొని యాతని సందర్శింపవలెనని యతఁడున్న చోటికేఁగఁజనిరి. వారనుకొనిన ట్లతఁడు తపోవ్యాపారములయందు నిమగ్నుఁడుగాక, కామవ్యాపారములయందు నిమగ్నుఁడై యుండుటఁజూచి

మిక్కిలి యక్కజపడి వాని కించుక బుద్ధిచెప్పిరి. కాని, మూర్ఖుల మనసు మంచిమార్గమున ద్రిప్ప నెవరితరము! అతఁడు వారి హితోపదేశంబుల సరకుగొనక వారి నెగతాళిజేసి తిరస్కరించి యాడసాగెను. అంతట వారు కోపోద్దీపితులై కనులెఱ్ఱజేసి "దురాత్మా? సదాచారంబు విడచి మునిజనవిరుద్ధమైన మార్గమున నీవు సంచరించుచుంటివి. గావున నీవుత్తరజన్మంబున నొక కిరాతుఁడవై యుందువుగాక!" యని శపించిరి. శాపాక్షరములు వారినోట వెలువడినంతనే చిరంతపుఁడు భయాక్రాంతచిత్తుఁడై పశ్చాత్తప్తమనస్కుఁడై శ్రీమన్నారాయణ చరణారవిందసేవకులగు నమ్మునిసత్తముల పాదములపైఁబడి యనుగ్రహింపుఁడని వేఁడుకొనెను. నవనీత హృదయులగు నమ్మునిచంద్రులు సదయులై "ఓయీ! యిచ్చినశాపము సంపూర్తిగా మఱల్పఁజాలము. కాని, కొంతమార్పు చేసెదము. నీవు మొదట బ్రాహ్మణ గర్భంబునంబుట్టి విద్యావినయశూన్యుండవై కిరాతులంగలసి సంచరించెదవు. అనంతరము దేవీప్రసాదంబున మరల బ్రాహ్మణుఁడవై జగత్ప్రసిద్ధిఁ గాంచెదవు" అని శాపంబు కొంత త్రిప్పి యథేచ్ఛంజనిరి. కాలక్రమంబున వాని తపంబు భంగంబుగావించి యచ్చరలు నిజచ్చర లోకంబునకుం జనిరి. చిరంతపుఁడు కడు వృద్ధుఁడై భోగవిముఖుఁడై యన్నివిధంబుల జెడి మృతినొందెను.

## బాల్యము

ఉత్తర

జన్మమున

గౌడదేశమున సంతానవిహీనుఁడై బిడ్డలకై తపించునట్టి యొకానొక బ్రాహ్మణునకు నందనుఁడై రూపరేఖా విలాసంబుల నెల్లర కానందము

గలిగించుచు నల్లారుముద్దుగాఁ బెరుగుచుండెను. కాలక్రమమున నక్షరాభ్యాసము, నుపనయనము మొదలగు కర్మలు జరిగెను. గాని చదువు సంధ్యలు వాని కొంతయు నంటలేదు. సహవాసము దుష్టులతోడనే జేయుచు నిరంతర మాటపాటలయం దాసక్తి గలిగి భోజనమునకు మాత్రమె గృహంబునకుఁ బోవుచుఁ గ్రమక్రమంబున దుండగీఁడై నూర్వారినందఱిని నిందించుచు, దూషించుచు, మందలించినవారిని గొట్టుచుఁ దిట్టుచుండెను. గ్రామస్తులు తలిదండ్రులకడకుఁ బోయి వాని యాగడంబులు బాధకరములుగ నున్నవని మొఱవెట్టుకొనిరి. తలిదండ్రులు మందలించినప్పుడు వారింగూడ దిరస్కరించెను. వా రేమియుం జేయఁజాలక గ్రామవాసులతో నిష్టమువచ్చినట్లు చేసికొమ్మని చెప్పిరి. అంతట గ్రామీణులందఱు దుస్సహములైన వాని చేష్టల కోర్వఁజాలక, కుక్కను గొట్టినట్లు కొట్టి, గ్రామమునుండి తరిమి యడవులపాలు చేసిరి. అంతట వాఁడొక కిరాతులుండు పల్లెకుంజని తన బుద్ధులకుఁ జేష్టలకుఁ దగిన సహకారులు లభించుటచేత నా కిరాతులతోఁ గలసి మెలసి జంతువులను వేటాడుచు, మత్స్యమాంసంబుల భక్షించుచు, సురాపానంబు సేయుచు, దారులుగొట్టుచు, నిదియది యనక యెల్ల ఘాతుకకృత్యంబులం జేయుచు యథేచ్ఛగా విహరించుచుండెను. అధమస్థితినుండి యుత్తమ స్థితికిఁ బోవుట దుర్లభముగాని యుత్తమపదవినుండి భ్రష్టుఁడగుట సులభము. దుస్సహవాసములవలన దుర్వినయంమువలన, దురాచార ములవలన, నెట్టి యనర్థము వాటిల్లునో చూడుఁడు! వేదాధ్యయన సంపన్నుఁడైన బ్రాహ్మణుని యింటఁ బుట్టిన యీ బాలుఁడు స్వల్ప కాలములోఁ గిరాతుఁడై పోయెను. కావున సర్వవిధముల దుస్సహవాసము వర్జింపవలయును.

## వివాహము

శ్రీవనంబునకు సమీపమున నొక దేశము కలదు. ఆ దేశమునేలు రాజునకు సర్వాంగసుందరియైన సర్వమంగళ యను పుత్రిక కలదు. ఆమె యమేయ రూపలావణ్య సమేతయై తలిదండ్రులకేగాక బంధుమిత్రులకు, నగరవాసులకు నయనోత్సవము జేయుచుండెను. రూపమునకుఁదోడు వినయసంపత్తి కలదు. సకలశాస్త్రపారంగతుఁడైన యొకానొక బ్రాహ్మణుని రావించి యా రాజు విద్యాబుద్ధులు గఱపుమని తన గారాబుకూఁతును వానికప్పగించెను. బాలిక మిక్కిలి శ్రద్ధతో గ్రహించి గురుభక్తి గలిగి యయ్యవారు చెప్పిన దంతయు సూక్ష్మబుద్ధితో గ్రహించినదానిని మఱునాఁటికి కుశాగ్రబుద్ధిశాలిని యని పేరుదెచ్చుకొని క్రమక్రమముగ విద్యలన్నియు నేర్చుకొనెను. విద్యాపూర్తియైనపిదప రాజు గురువునకు గురుదక్షిణ నిమ్మని చీని చీనాంబరములు వెలలేని యాభరణంబులు మొదలగునవి యిచ్చి గురువునకు సమర్పింపుమని పుత్రికనంపెను. గురువు వయోవృద్ధుఁడయ్యు, జ్ఞానసంపన్నుఁడయ్యు, గుణవిహీనుఁ డగుటచే నా బాలిక యొక్క నవయౌవనప్రాదుర్భావముంచూచి మోహావిష్టుఁడై పరవశత్వము జెంది బాలికతో నిట్లనియె—"లతాంగీ! నీ గురుభక్తికిజాల మెచ్చితి. నాకీ యాభరణంబులేల? ఈ కాంచనవస్త్రంబులేల? నీ నిరుపమాన లావణ్యతారుణ్యంబులఁ జూచినది మొదలు నిన్నొక్కసారి బిగియారఁ గౌఁగిటంజేర్చి ముద్దాడవలయునను కోరిక పుట్టినది. నాయందు నీకు నిజముగా భక్తికలదేని నా కోరికఁదీర్పుము. అదియే గురుభక్తి. అదియె గురుదక్షిణ, అదియే శుశ్రూష" యనిపలికి లేచి పయోముఖవిషకుంభము వంటి యా యుపాధ్యాయాధముఁడు బాలిక హస్తము బట్టుకొనఁబోవ

నామె యాశ్చర్య సంభ్రమంబులు పెనఁగొన "ఛీ! నీవు గోముఖ వ్యాఘ్రుంబవు. పాముకడ రత్నమున్నట్లే నీకడ విద్యయున్నది. నీకు నేను బుత్రికాతుల్యను. మంచిచెడ్డలులేక పాపపుణ్యము బరికింపక వావివరుసల నరయక గొంకుజంకులేక యిట్టికాఱులఱచిన నిన్ను నా తండ్రితోఁజెప్పి యిప్పుడే శిరచ్ఛేదంబు చేయింపఁగలనుగాని గురువధామహాపాతకము నాకు సంక్రమించునను భయమున నీ ప్రాణములు రక్షించితి. జాగ్రత్తగా నుండుము" అని విసవిస నడచి యంతఃపురమునకుంబోయెను. గురువు తాను గావించిన మహాపరాధంబునకు మనంబున లేశ మైనఁ బశ్చాత్తాపంబు నొందక యా మెలంత పలుకులు విని తలపంకించి. "కాని! నీపని పట్టెదనులే. నిన్నొక్క కిరాతునికిచ్చి పెండ్లి చేయింప కున్నచో నాపేరు మాఱుపేరు పెట్టుము" అని తన కసిదీర్చుకొనుటకై సమయము నిమిత్త మెదురు చూచుచుండెను.

అంతట నా రాజపుత్రిక సంప్రాప్తయౌవనయయ్యెను. దుష్ట నక్షత్రమందు రజస్వలయయ్యెను. గురువు జ్యోతిశ్శాస్త్రమందుఁగూడ నపారప్రజ్ఞ గలవాఁడగుటచే రాజు వానిని రావించి దుష్టనక్షత్రమునం దీడేరుటవలనఁ గలిగిన యరిష్టమును బాపుకొనుటకై యేమిశాంతి జేయ వలెనని యడిగెను, గురువు తన పగదీర్చుకొనుటకుఁ దగిన యదను సమీపించెనని మనంబున సంతసించి యొక్క మూహూర్తమాలోచించి యిట్లనియె. "రాజేంద్రా! ఈ నక్షత్రమతిదుష్టమైనది. ఇది గ్రహశాంతి తోడను, హోమములతోడను, బ్రాహ్మణ సంతర్పణములతోడను శమించునట్టి కీడుకాదు. బాలికనే పరిత్యజింపవలయును. పూర్వము చంద్రమతీదేవి యీ విధముగానే దుష్టనక్షత్రమందు రజస్వలయగుటచే జనకుఁడామెను పరిత్యజించెను. మీరు కన్నకూఁతును కారడవులకంపి పరిత్యజింపలేరు కావున ధర్మశాస్త్రములబట్టి మీ కుపాయాంతరముఁ జెప్పెదను. ఈమెను సుక్షత్రియునకు గాక చదువురాని యొక మోటవాని

కిచ్చి వివాహము చేయుము. దానిచే నాపద నివారణమగును. అట్లు చేయకపోయెదవేని మీకు రాజ్యనష్టి గలుగు. వంశనాశన మగును” అనవుడు రాజు మిక్కిలి విచారించి, యెట్టకేల కొడంబడి, విద్యాగంధ మెఱుఁగని యనాగరకుఁడగు మోటవాని నొకనిఁ దోడి తెమ్మని సేవకులం బంపెను.

ఆహా! చూచితిరా! దురాత్ముఁడైన యీ గురువు బాలిక కెట్టియిక్కట్టు తెచ్చిపెట్టెనో? దుర్జనులు పాపభీతి గలిగియుండరు. చదువుకొనినంతమాత్రముచేత మనుష్యుఁ డెప్పుడును బూజ్యుఁడు కాఁడు. చదువుకన్న సద్గుణమే ప్రధానము. సకలశాస్త్రవేత్తయైనను, గుణ విహీనుఁడైన మనుష్యుఁడు వర్జింపఁదగినవాఁడే. శిరస్సున మాణిక్యము ధరించియున్నను, త్రాఁచుపాము బరిత్యజింపఁదగినదేగాని ముద్దుపెట్టు కొనఁ దగినది కాదుగదా!

సేవకులు నానాప్రదేశములు సంచరించి యెట్టకేలకు బ్రాహ్మణ కిరాతుఁడున్న యడవికిఁబోయి వాఁడే తగినవాఁడని వానిం బ్రతిమాలి “నీకు మహావైభవము పట్టఁగలదు రారా!” యని వానిం దోడ్కొని పోయి రాజునకు గురువునకుఁ జూపిరి. గురువు వానింజూచి “శహబాస్! తగినవాఁడే కావలెనురా” యని మెచ్చెను. రాజు వానిఁగనుఁగొని కుసుమ కోమలియై బంగారుబొమ్మవలె నున్న తనకూఁతును, మానికంబును మసిపాతనుగట్టినట్లు విద్యావిహీనుఁడు, రూపవిహీనుఁడు, గుణవిహీనుఁడు నగు కటికవానికిచ్చి వివాహము చేయవలసివచ్చినందులకు విచారాక్రాంత మనస్కుఁడై విధినియోగముదాఁట శక్యముగాదని గుండె ఱాయి జేసికొని కూఁతు నాతనికే యిచ్చి వివాహముసేయ నిశ్చయించి ముహూర్త నిర్ణయము జేయించి, విశేషవైభవము లేకుండ సామాన్యముగ వివాహ కార్యము జరిగించెను. పితృవాక్యపరిపాలనమే ప్రధానముగాఁగల యీ బాలిక తండ్రి యానతిచొప్పున వానిని వివాహమాడెను.

ఆహా! మూఢవిశ్వాస మెట్టియాపదలఁ దెచ్చునో చూచితిరా? రాజు యుక్తాయుక్త వివేచనాజ్ఞానము లేక గురువుయొక్క స్వభావ మెఱుంగక వానిమాటలయందే విశ్వాసముంచుటచేతఁ దన ప్రియపుత్రిక కిట్టిపాట్లు సంప్రాప్తించెను.

వివాహమంగళవిధి సలక్షణముగా జరిగినపిదప రాజు పుత్రికకుఁ బునస్సంధాన మహోత్సవము చేయించెను. బాలిక చెలికత్తెలు కొందఱు కమ్మకసంపంగినూనెతోఁ దలయంటి పన్నీట జలకమాడించి హొంబట్టు దువ్వలువలు గట్టఁబెట్టి నవరత్నఖచితములైన సువర్ణభూషణములు పెట్టి సింగారించిరి. మఱికొందఱు నాఁటి ప్రాతఃకాలము మొదలుకొని పడకగదిఁ బలువిధముల నలంకరించిరి. అదివఱకే గోడలమీఁద వ్రాయఁబడిన చిత్తరువులతోడను, చిత్రచిత్రముగా బల్లలమీఁద నమర్పఁబడిన బొమ్మలతోడను మెత్తనిమెత్తలు, హంసతూలికాతల్పము ముత్యాలజాలరు, దోమతెర మేలుమేలుపట్టు మొదలగు పరికరములతో నలరారు పందిరిమంచముతోడను, వెండిదీపస్తంభములమీఁద బంగారు ప్రమిదలలో నత్తరు చమురుతో వెలుఁగుచున్న దీపములతోడను, గది యతి రమణీయంబై మన్మథుని కొలువుకూటమువలె వర్ణింపరాని సౌందర్యము గలిగి విరాజిల్లుచుండెను. సాయంకాలము భోజనమైనతోడనే పెండ్లికొడుకు ముందు గదిలోఁ బ్రవేశించి బల్లమీఁది బంగారు పళ్లెరములలో దంపతుల నిమిత్తమై యమర్పఁబడిన పండ్లను, భక్ష్యములను, గసపాలు మెక్కి కఠినశిలలమీఁదఁ బండుకొనుటచే మిక్కిలి కర్కశమైన తన మోటమేను రాజపురుషోచితమైన యా హంసతూలికాతల్పముపైఁ జేర్చి క్షణములో నిద్రపోయెను. సఖీజనులు రాజపుత్రికను మెల్లమెల్లగా శయనాగారముఁ జేర్చి బుజ్జగించి తలుపులువైచి యావలకుఁ జనిరి. జగన్మోహనాకారము గలిగి త్రైలోక్య రాజ్యలక్ష్మి వలెను, మన్మథుని యైదవ బాణము వలెను, గాలు చేతులు మొదలగు

నవయవములుదాల్చిన క్రొక్కారుమెఱుఁగువలెను. చైతన్యము గలిగిన పసిఁడిబొమ్మవలెను, దళుకుతళుకున మెఱయుచున్న దీపముల కాంతి నడుమ దేదీప్యమాన ప్రభలతో వెలయుచున్న యా మత్తకాశినీమ తల్లికయొక్క యైశ్వర్యము, లావణ్యము, తారుణ్యము జూచు భాగ్యములేక యా నిర్భాగ్యుఁడు బావురుపిల్లులు పోరాడునట్లు పెద్ద గుఱ్ఱుపెట్టి కుంభకర్ణుని తమ్ముఁడో యనునట్లు గాఢనిద్ర పోవుచుండెను. ప్రాణేశ్వరుఁడు వివాహమందలి నిరంతర వైదికవిధులచేత నలసిసొలసి యుండుటచేతఁగాఁబోలు నించుక కునుకుపట్టి యుండునని తలంచి యా రాజనందన యొకమూలఁ గొంతసేపు నిలువంబడి యెంతసేపటికి నాతనికి మెలకువరామి నొక పీఠముపైఁ గూరుచుండి వీణాగానముచేత నతనికి మెలఁకువ వచ్చునేమో యని వీణం జేకొని హాయిగా వాయింపఁజొచ్చెను. పెండ్లికుమారుఁడు నిద్రలో నడుమ నడుమ "ఓరి! గంగులు పందిపిల్లపోయె పందిపిల్లపోయె, కొట్టుకొట్టు పట్టుపట్టు" మని యొకసారియు "గంజిపిల్ల గంజిపిల్ల" అని యొక మాఱును బలవరించెను. ఆ పలవరించుటవిని బాలిక "ఏమిది! ఇట్లు పలవరించుచున్నాఁడేమి!"యని భయము, నాశ్చర్యము మల్లడిగొన నేదో యాలోచించుచు మనసు మనసులో లేక వీణ మఱింతగట్టిగా వాయించెను. అడవిలో బెబ్బులులయొక్కయు, సింగములయొక్కయు, బొబ్బరింతలకు మెలకువరాని యా పురుషునకు వీణాగాన మొక లెక్కయా? కుక్కలమొఱుగులేగాని భైరవిరాగ మెన్నఁ డాతని చెవిని బడియుండలేదు. నిద్రలో శంకరాభరణములవలె బుసకొట్టుటేగాని శంకరాభరణము వాని కర్ణగోచరముకాలేదు. "పశుర్వేత్తి శిశుర్వేత్తి వేత్తి గానరసం ఫణిః" అనఁగా: శిశువు, పశువు, పామునుగూడ గానరసమును గ్రహించును. గానము పశువుల కానందము కలిగించును. గానము పరశువుల కానందము గలిగించునా? అంత మనోహరముగా

నామె పాడుచున్నను వాఁడు చెక్కుచెదరక నిద్రపోవుచుండెను. అంతట నామె చారక్రాంతయై మెల్ల మెల్లగా జీవితేశ్వరుని మంచముకడ కేగి మెలఁకువ వచ్చునేమో యని యించుక పన్నీరు వాని మేనిపైఁ జిలికెను. అది కాలుచున్నపోతుమీఁద వర్షము కురిసినట్లు వానియెడఁ బ్రయోజనకారి కాదయ్యెను. అంతట నామె మెల్లగా మీఁదఁ జేయివైచి సన్నసన్నముగాఁ దన కంఠమెత్తి గానము చేసెను. అతఁ డొకసారి కన్నెత్తిచూచి "ఓసే, గుయిగుయిలాడక తొంగోసి" యని యామె చేయి దీసివైచి మరల నిద్రపోయెను. అప్పుడామె భయసంశయాకులాత్మయై యీ వైచిత్ర్యమేమో కనుఁగొనఁదలఁచి క్షణకాల మూరక కూర్చుండి మరల నాతనిమీఁదఁ జేయివైచి తట్టి లేపెను. అతఁడు మెలకువ దెచ్చుకొని "యెందుకు లేపినా" వని బిగ్గఱగా నడిగెను. అందు కామె ధైర్యముఁ దెచ్చుకొని "మీ రెవ్వరు? మి మ్మిక్కడికి దోడితెచ్చినవా రెవ్వరు? మీ వృత్తాంత మేమి?" యని యడిగెను. అప్పుడతఁడు తన చరిత్రమంతయు మోటమాటలతో నెంతో రసహీనముగా నామెతోఁ జెప్పెను. ఆ వృత్తాంతమువిన నామె మొగము చిన్నవోయెను. నెమ్మేను జలదరించెను. మనస్సు క్రుంగిపోయెను రాజపుత్రి యగుటచే నెట్టకేలకు ధైర్యము దెచ్చుకొని తన మనసులో నిట్లని విచారించెను.

"ఆహాహా! దైవమా! నా లేఁబ్రాయము, నా జవ్వనము, నా చక్కదనము బూడిదఁబోసిన పన్నీరు తెఱంగున నడవిఁగాచిన వెన్నెల వడువున, జవిటినేలఁ గురిసిన వానపోలిక, నిరర్థకమయ్యెఁగదా! సుక్షత్రియుఁడై, సత్కులజాతుఁడై, సౌభాగ్యనిధియై, విద్యావినయ వివేక సంపన్నుఁడై, యీడుజోడైయుండు ప్రాణనాథుని చెట్టబట్టి సౌఖ్యసాగర మందుఁ దేలునట్టి భాగ్యము నాకుఁ గలుగదయ్యెఁగదా! కొఱనోములు నోచి యధికఫలము గావలెనన్న నెట్లువచ్చు? ప్రాణనాథుఁడు మెచ్చని

సౌభాగ్యసౌందర్యంబులేటికి కాల్పనా? ది పరమదురాత్ముండైన నా గురువుచేసిన యుపకారము. పరమమూర్ఖుండైన నా తండ్రి, తేనె బూసిన కత్తివలెనున్న యీ వృద్ధపండితుని మాటల నమ్మి తనకుఁ గీడు గలుగు నని శంకించి తనయాపద నివారించుకొనుటకై తెగీతెగని బండకత్తితో నా గొంతుగోసినాఁడు. ఒకరిని నిందింపనేల? 'అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభ' మ్మను నార్యోక్తి కలదుగదా! చేసికొన్నది శుభమైన నశుభమైన ననుభవింపకతప్పదుగదా! నేఁజేసిన కర్మమొక్క ఫలము నే ననుభవింపవలెనుగాని పరులనుభవింతురా? గతించినదానికై విచారించిన ఫలము లేదని పెద్దలు చెప్పుదురుగదా! కాఁబట్టి విచారించుట మాని దీనికిఁ దగిన ప్రతిక్రియ చేసికోవలయు" నని క్షణమాలోచించి మగనిఁజూచి యిట్లనియె. "మహాత్మా! మీరుజాతముచేత బ్రాహ్మణులు. కర్మచేతఁ గిరాతులైనను బ్రహ్మతేజమునుండి మీ రుద్భవించిరి గావున సహజములైన తెలివితేటలు మీయందు గూఢముగా నుండును దుస్సహవాసములచేత నీవఱకుఁ జేసిన దురాచారముల విడచి మీరు విద్యావంతులై సాధువులై గౌరవనీయులగుటకు నొక్క యుపాయము జెప్పెద వినుండు. వినెదరా?" అనవుడు నా బ్రాహ్మణకిరాతుఁడు "సెప్పుసెప్పు యింటాయింటా" యని యనుటయుఁ దన మగఁడు దారికి వచ్చుచున్నాఁడని యాకల్యాణి లోలోనసంతసించి వెండియు నిట్లనియె, "స్వామీ! ఈ యూరిబైటఁ గాళికాదేవి యాలయము కలదు. ఆమె భక్తవత్సలురాలు. రాత్రులయందామె తన యాలయము విడచి లోకసంచారార్థమై యరుగును. తెల్లవాఱుజామున నామె మరల నన గుడిఁ జొచ్చును. ఇప్పుడు రెండుజాముల రాత్రికన్న నెక్కువకాలేదు ఈ క్షణమె మీ రక్కడికరిగి యాలయముఁ బ్రవేశించి తలుపులు లోపల గడియవైచికొని మేలుకొనికూర్చుండుఁడు. భగవతికాత్యాయని లోకసంచారము సమాప్తముచేసి నాలవజామున నాలయముఁ

ప్రవేశించుటకై వచ్చును. అప్పుడు తలుపులు దీయుమని యడుగును. అప్పుడు మీరు భయపడక కొండవలె నిశ్చలుఁడవై 'నాకు విద్యాదానము చేసిన గుడి తలుపులు దీసెద, లేనిచోఁ దీయ' నని కంఠమెత్తి పలుకుఁడు. అనతలఁ దెల్లవారుచున్నదను భయముచే దేవి తత్తఱపడి గుడిలోఁ బ్రవేశింపలెనను కోరికతో మీరు కోరిన వరములిచ్చి లోపలఁ బ్రవేశించును. అప్పుడు మీరు విద్యావంతులగుదురు. ఆ విధముచే మీరు విద్యావంతులు కావలెనుగాని యిప్పు డక్షరములు నేర్చికొని పుస్తకముబట్టి పండితులగుట యసంభవము. విద్యావంతులైతిరా సమస్త వైభవములు గలుగును. విద్య వినయ మొసఁగును- భాగ్య మొసఁగును. ఇహాపరసౌఖ్య మొసఁగును—గౌరవ మొసఁగును. వేయేల! విద్య కల్పవృక్షము. కాఁబట్టి నా మనవిం జేకొని, పరమేశ్వరియైన కాళిని నాశ్రయింపుఁడు" అని భార్య హితోపదేశము జేయ భర్త మంచిదని యామె చెప్పినచొప్పునఁ జేయఁదలఁచి పడకటిల్లు విడచి పెరటిదారిని వీధిలోఁ బ్రవేశించి నాయర్ధరాత్రమున నిర్భయముగా నామె చెప్పిన మానవాళ్లంబట్టి కాళికాలయమున కరిగి గుడిజొచ్చి తలుపులుమూసి గడియవైచుకొని లోపల గూర్చుండెను.

## కాళికా ప్రత్యక్షము

కాళికయు యథేచ్ఛముగా లోకసంచారము జేసి కడపటి జామునఁ దన యాలయముకడకు వచ్చి తలుపులు మూయబడి యుండుటకు మిక్కిలి యక్కజమంది భయంకరముగా నిట్లనియె, "ఓరీ! యెవఁడురా! నా యాలయమునఁ గవాటముబంధించి కూర్చున్న వాఁడు!

నీకు మృత్యువాసన్నమైనదా యేమి ? కండకావరమున నోడలెఱుంగక ముప్పదిమూఁడుకోట్ల దేవతలను బలుబాములఁబెట్టిన మహిషాసురుని మర్దించిన మహాకాళిని నన్నెఱుంగవుకాఁబోలు ! దేవాంతక నరాంతకులైన దైత్యదానవయక్షరాక్షస ప్రముఖులే నా యెదుట నిలువలేరు. నీవెంత? బ్రతుకఁదలఁచితివేని తక్షణముతలుపు దీయుము " అని జంకించుటయు, నా బ్రాహ్మణకిరాతుఁడు నదరుబెదురు లేక "తల్లి! నాకు బిడ్డెనిమ్ము. తలుపుదీసెదను " అని బదులుచెప్పెను. " బిడ్డెలేదు. నీ మొగములేదు. తలుపుదీయు " మని యా దేవి మరల గంభీరముగఁ బలికెను. " బిడ్డె యిచ్చినఁగాని తలుపుఁదీయ " నని యతఁడు ప్రత్యుత్తర మిచ్చెను. అంతలో జాముకోడికూసెను. తెల్లవాఱునట్లు చిన్నెలగుపడుచుండెను. ప్రయాణము చేయఁదలచువారు, పొలములకుఁ బోదలఁచువారును, నిద్రమేలుకాంచి బైలుదేఱుచుండిరి. నిజమూర్తి జనులకుఁ గనఁబడకుండఁ బెందలకడ నాలయముఁ బ్రవేశింపవలెనని తలంచి కాళి " ఓరీ ! బిడ్డె యిచ్చెద. తలుపుసందునుండి నీ నాలుక చాపుము " అని కుంచెకోలతో వాని నాలుకపై సకల విద్యాబీజంబులగు నక్షరంబుల వ్రాసెను. అంతట నతఁడు తలుపులు దీసెను మహాకాళియు నిజమందిరము బ్రవేశించి కోపాగ్నిచే రవులుచున్న కొలిముల యనునట్లు నెఱ్ఱగానున్న కన్నులతో వానింజూచి " పాపాత్మా ! పలుగాకి ! యెవడవురా నీవు ? నా మందిరద్వారమునూసి బలవంతముగా నా చేత వరములు బడయఁదలఁచితివా ? ఇదిగో చూడు ! నిమేషకాలమాత్రమున మహిషాసురప్రముఖులు పోయిన మార్గమున నిన్నుఁ బంపెద " నని వాని నెత్తి నణచుటకు దనహస్త మెత్తెను. దేవి బీజాక్షరములు జిహ్వాగ్రమున వ్రాసినతోడనే యాతని మౌఢ్యమంతయు నాశనమయ్యెను. కుబుసము విడిచిన పామువలె నాతనిమనస్సు నవనవవికాసముబొందెను. సకలశాస్త్రములు వానికిఁ గరతలామలకమయ్యెను.

చతుర్దశవిద్యలు వానికి విధేయము లయ్యెను శారదాదేవి కాతఁడు ప్రియపుత్రుఁ డయ్యెను. హిమవత్పర్వతమునుండి భూమిమీఁదికిఁ బ్రవహించు గంగానదివలెఁ గవితారస మాతని నోటనుండి వెల్లి విరియఁజొచ్చెను. అట్లగుటచేత నాతఁడు నిర్భయముగాఁ దన నెత్తియెడఁ బ్రాదుమన్న దేవికిఁ బ్రదక్షిణముజేసి సాష్టాంగ నమస్కారపురస్సరముగ నామె చరణములు బట్టుకొని యిట్లు స్తుతియించెను.

## స్తవము

శ్లో॥ మాణిక్యవీణా ముపలాలయంతీం
మదాలసాం మంజులవాగ్విలాసాం,
మాహేంద్రనీలద్యుతికోమలాంగీం
మాతంగకన్యాం మనసా స్మరామి॥

శ్లో॥ చతుర్భుజే చంద్రకళావతంసే కుచోన్నతే కుంకుమరాగశోణే
పుండ్రేక్షుపాశాంకుశపుష్పబాణహస్తే నమస్తే జగదేకమాతః.

శ్లో॥ మాతా మరకతశ్యామా మాతంగీ మధుశాలినీ
కుర్యాత్కటాక్షం కల్యాణీ కదంబవనవాసిని,

శ్లో॥ జయ మాతంగతనయే జయ నీలోత్పలద్యుతే
జయ సంగీతరసికే జయ లీలాశుకప్రియే.

అని శ్లోకచతుష్టయముతో నుతియించి కవిత్వ మప్రయత్న పూర్వముగా వెడలుచుండుటంజేసియు నపరిమితభక్తిచేఁ బరవశత్వము నొందియుండుటంచేసియు నంత నిలువక దేవీ మనోమండలము వికాసము జెందునట్లు దండక మొక్కటాని నామధారగా రచియించి యిట్లు నుతించె.

## దండకము

జయ! జననీ!
సుధాసముద్రాంత!

హృద్యన్మణిద్వీప । సంరూఢ బిల్వాటవీమధ్య । కల్పద్రుమాకల్ప । కాదంబకాంతారవాస ప్రియే । కృత్తివాసప్రియే, సాదరారబ్ధ సంగీత సంభావనా సంభ్రమాలోల । నీపస్రగాబద్ధచూళీసనాథత్రికే । సానుమత్పుత్రికే । శేఖరీభూత శీతాంశురేఖామయూఖావళీబద్ధసుస్నిగ్ధ నీలాలక శ్రేణీ శృంగారితే । లోకసంభావితే, కామలీలా ధనుస్సన్నిభ భ్రూలతా । పుష్పసందేహకృ చ్చారుగోరోచనా పంక కేళీలలామాభిరామే సురామే రమే, ప్రోల్లసద్వాలికా మౌక్తిక శ్రేణికా । చంద్రికామండలోద్భాసి గండస్థల న్యస్త కస్తూరికాపత్ర రేఖాసముద్భూత । సౌరభ్య సంభ్రాంత । భృంగాంగనాగీత సాంద్రీభవన్మంద్ర తంత్రీస్వరే, భాస్వరే, వల్లకీవాదనప్రక్రియాలోల తాళీదళాబద్ధ తాటంకభూషావిశేషాన్వితే సిద్ధసమ్మానితే, దివ్యహాలామదో । ద్వేల హేలాల సచ్చక్షురాందోళన । శ్రీసమాక్షిప్తకర్ణైకనీలోత్పలే నిస్తులే, స్వేదబిందూల్లసత్ఫాలలావణ్య నిష్యందసందోహ సందేహకృన్నాసికామౌక్తికే సర్వమంత్రాత్మికే । కుందమందస్మితోదారవక్త్రస్ఫుర । త్పూగ కర్పూర తాంబూల ఖండోత్కరే । శ్రీకరే, కుందపుష్పద్యుతిస్నిగ్ధదంతావళీ । నిర్మలాలోల కల్లోలసమ్మేళన । స్మేరశోణాధరే । చారువీణాధరే, సులలిత నవయౌవనారంభ చంద్రోదయోద్వేల । లావణ్యదుగ్ధార్ణవావిర్భవత్కంబు బిబ్బోకహృత్కంధరే । మంథరే, బంధురచ్ఛన్నవీరాదిభూషాసముద్ద్యోతమానా నవద్యాంగశోభే శుభే రత్నకేయూరరశ్మిచ్ఛటాపల్లవ ప్రోల్లసద్దోర్లతా రాజితే । యోగిభిఃపూజితే, విశ్వదిఙ్మండలవ్యాపి మాణిక్యతేజస్ఫురత్కంకణాలంకృతే । సాధుసంసత్కృతే. సంగరారంభ వేళాసముజ్జృంభమాణారవింద ప్రతిచ్ఛంద పాణిద్వయే । సంతతోద్య

ద్దయే, దివ్యరత్నోర్మికాదీధితిస్తోమ సంధ్యాయమానాంగుళీపల్లవోద్య
న్నఖేందు ప్రభామండలే। ప్రోల్లసత్కుండలే, తారకారాజినీకాశహారా
వళిస్మేరచారుస్తనాభోగభారానమన్మధ్యవల్లీకళీచ్ఛేద వీచీ సముల్లాస
సందర్శితాకార సౌందర్యరత్నాకరే। శ్రీకరే, హేమకుంభోపమో
త్తుంగవక్షోజభారావనమ్రే। త్రిలోకావనమ్రే, లసద్వృత్త గంభీర
నాభీసరిత్తీరశైవాలశంకాకరశ్యామరోమావళీభూషణే। మంజుసంభా
షణే, చారుశింజత్కటీసూత్రనిర్భర్త్సితానంగలీలా ధనుశ్శింజినీడంబరే
దివ్యరత్నాంబరే, పద్మరాగోల్లసన్మేఖలాభాస్వరశ్రోణిశోభాజిత స్వర్ణ
భూభృత్తలే। చంద్రికాశీతలే, వికసితనవకింశుకాతామ్రదివ్యాంశుక
చ్ఛన్నచారూరుశోభాపరాభూతసింధూరశోణాయమానేంద్ర మాతంగ
హస్తార్గళే। శ్యామలే, కోమలస్నిగ్ధనీలోత్పలోత్పాదితానంగ తూ
ణీరశంకాకరోదారజంఘాలతే చారులీలాగతే నమ్రదిక్పాలసీమంతినీ
కుంతలస్నిగ్ధనీలప్రభాపుంజసంజాతదూర్వాంకురాశంకసారంగసంయో
గరింఖన్నఖేందూజ్జ్వలే। ప్రోజ్జ్వలే, దేవి దేవేశ దైత్యేశయక్షేశ
భూతేశవాగీశకోణేశవాయ్వగ్ని మాణిక్యసంఘృష్ట బాలాతపోద్దామ
లాక్షారసారుణ్యలక్ష్మీగృహీతాంఘ్రిపద్మద్వయే, అద్వయే, సురుచిర
నవరత్నపీఠస్థితే। సుస్థితే, శంఖపద్మద్వయోపాశ్రితే ఆశ్రితే, దేవి
దుర్గావటుక్షేత్రపాలైర్యుతే మత్తమాతంగకన్యాసమూహాన్వితే భైర
వైరష్టభిర్వేష్టితే దేవివామాదిభిస్సంశ్రితేలక్ష్మ్యాది శక్త్యష్టకాత్సే
వితే। భైరవీసంవృతే, పంచబాణేన। రత్నాచసంభావితే। ప్రీతిశక్త్యా
వసంతేన। చానందితే। భక్తిభాజాంపరంశ్రేయసే। కల్పసే। ఛంద
సామోజసా భ్రాజసే। యోగినాంమానసేధ్యాయసే। గీతవిద్యాది
యోగాతితృష్ణేనకృష్ణేన। సంపూజ్యసే। భక్తి మచ్చేతసావేధసాస్తూ
యసే। విశ్వహృద్యేనవిద్యాధరైర్గీయసే। యక్షగంధర్వసిద్ధాంగనా
మండలైర్మండితే। సర్వసౌభాగ్యవాంఛావతీభి। ర్వధూభిస్సురాణాం

సమారాధ్యసే। సర్వవిద్యావిశేషాన్వితం। చాటుగాథాసముచ్చారణం కంఠమూలోల్లసద్వర్ణరేఖాన్వితం। కోమల శ్యామలోదారపక్షద్వయం తుండశోభాతి। దూరీభవత్కింశుకాభాం। శుకం లాలయంతీ। పరిక్రీడసే। పాణిపద్మద్వయేనా పరేణాక్షమాలాగుణం। స్ఫాటికం జ్ఞానసారాత్మకం పుస్తకంబిభ్రతీ। యేనసంచింత్యసే। చేతసాతస్యవక్త్రాంతరాద్గద్య పద్యాత్మికా భారతీనిస్సరే। ద్యేనవాయావకాభాకృతిర్భావ్యసే సోపిలక్ష్మీసహస్రైః పరిక్రీడతే। కింనసిద్ధ్యేద్వపు శ్శ్యామలం। కోమలం తావకంచంద్రచూడాన్వితం। ధ్యాయత స్తస్య లీలాసరో వారిధి స్తస్య కేళీవనం। నందనం। తస్యభద్రాసనం భూతలం। తస్య గీర్దేవతా కింకరీ తస్యచాజ్ఞకరీశ్రీస్స్వయం। సర్వయంత్రాత్మికే సర్వతంత్రాత్మికే। సర్వముద్రాత్మికే సర్వశక్త్యాత్మికే। సర్వచక్రాత్మికే। సర్వవర్ణాత్మికే సర్వరూపే। జగన్మాతృకే। పాహిమాం। పాహిమాం। పాహి॥

నవనవశబ్దంబను, విపులార్థంబును—విమలరసంబును, గంభీరభావంబును, ద్రాక్షాపాకంబును, మధురశయ్యలను గల యామహాదండకమును వినుచు నా కాళికాదేవి యమందానందవికసితహృదయపద్మయై యుప్పొంగి పాయసంబున ద్రాక్షపండ్లు మేళవించినట్లు నడుమ నడుమ నొక్కొక్కపదము తానుగూడ జేర్చి యా మహాకవికిఁ దోషమునిడి సంహారింపఁదలఁచిన తన ప్రయత్న ముపసంహారించి వాని నాశీర్వదించి వరములిచ్చి పంపెను. కాళికాదేవికి దాసుఁడగుటచేత నతఁడప్పటినుండి కాళిదాసుండను నామముతో వ్యవహరింపఁబడుచుండెను. అట్లు దేవి వరప్రసాదముఁబడసి కాళిదాసు తెల్లవాఱకముందే రాజమందిరము ప్రవేశించి తన రాకకై యెంతో యాత్రముతో వేచియున్న భార్యం జూచి యామె పాదములపైఁబడి "ఓకల్యాణీ! నీవు నాకు భార్యవుగావు. మంచి యుపదేశముచేసి విద్యావంతునిఁ జేసితివి కావున నాకుఁ దల్లివి. కన్నతల్లి తల్లిగాదు. నీవే తల్లివి. నేను నిన్నిఁకను భార్యాదృష్టితో

జూచితేను. ఆ భావము నా కెన్నడును లేదు. ఇంక నాకు సెలవిమ్ము. పోయివచ్చెద" అని పలుక, నామె యాశ్చర్యము, విషాదము, కోపము హృదయంబున గ్రమ్ముకొనఁ గన్నీరు వెట్టుకొనుచు గద్గదకంఠంబున నిట్లనియె—"మహాత్మా! నా తండ్రియు, గురువును జేసిన మహాపకారమునకు నేనెంతో కుందుచుండ మీరు గోరుచుట్టుపై రోఁకటిపోటు చందమున నన్ను మఱింత బాధింపఁజొచ్చిరి. దేవీ వరప్రసాదమున మీరు విద్యావంతులై, రసికాగ్రగణ్యులై, నా ప్రాణనాథులై, మీ సరసవచోగుంభనలచేత నన్నాదరింపఁ జేయుదురనియు, నా కాపురము సరిగా నడచుననియు, నేను పుట్టెడాస పెట్టుకొని మీ రాక కెదురు చూచుచుంటిని. నన్నిట్లుచేయుట న్యాయముకాదు. అగ్నిసాక్షిగా వివాహమైన పడఁతిని విసర్జించిపోవుట మానవధర్మముకాదు. కావున నన్ను రక్షించి నన్నేలుకొనుఁడు" అని పాదములపై బడి ప్రార్థించెను. కాళిదాసామెమాట సరకుసేయఁడయ్యె. పట్టినపట్టు విడువఁడయ్యె. అంతట నామె మొగము జేవురింపఁ గనులెఱ్ఱజేసి "నా జన్మము మీరు వ్యర్థముచేసితిరిగావున నా యుసురు మీకుఁ దగులకపోదు. మీకు నీచ స్త్రీచేత మరణము గలుగుఁగాక" యని శపించి వెక్కి-వెక్కి యేడువఁ జొచ్చెను. కాళిదాసు దక్షిణామె యా స్థానము విడిచి పోయెను. అపరమంగళ దేవతవలెనున్న సర్వమంగళ నిరర్థకమైన తన జీవితమును దపోనియమంబునం గడుపఁదలఁచి, సకలాభరణంబులం దీసివైచి, నారచీరెలుగట్టి, దుంపలు, పండ్లు, గాయలు దినుచు, విరాగిణియై యనేక వత్సరములు తపంబుజేసి మరణించి పరమపతివ్రతాశిరోమణు లందఁదగిన యుత్తమగతి నందెను.

## కాళిదాసుని వృత్తాంతమును గుఱించిన రెండవకథ

మాళవదేశమున వైజయంతమను పట్టణము కలదు. ఆ నగర సమీపమున నొక్క మహారణ్యము గలదు. ఆ వనమధ్యంబున నొక పుణ్యాశ్రమంబుగలదు. ఆ యాశ్రమంబున మహానుభావుఁడగు త్రికాలవేది యను ముని ఘోరతపంబు జేయుచుండెను. అతని తపం బసాధారణంబు. అతని నియమం బలోకసామాన్యంబు. అతని ప్రభావ మప్రమేయము. అతఁడు భూతభవిష్యద్వర్తమానముల నిజతపోమహత్త్వమున నెఱుఁగుటచేత నతనికిఁ ద్రికాలవేదియను సార్థకనామముగలిగెను. అతని యుగ్రతపమునకు భయపడి మహేంద్రుఁడు మేనక మొదలగు నప్సరసలను రావించి భూలోకంబునకరిగి వాని తపోవిఘ్నంబు గావింపు మని యానతిచ్చెను. ముని తపోవిఘ్నమునందు దేవవేశ్యలు మిక్కిలి యారితేరినవారయ్యు, నా మహాముని ప్రభావంబును, స్వభావంబును, దఱచుగా వినియుండుటంజేసి వానిని సమీపింప నెఱచిరి. వారిలోఁ జక్కదనంపుటిక్కయు, నెఱజాణయు, నిండుజవ్వనియు నైన మనోరమయను నచ్చరవెలంది తన చెలిమికత్తెలగు రంభా మేనకాదులం గనుంగొని వారి పిఱికితనంబు నధిక్షేపించి "మీ రా మునిచంద్రునకు భయపడితి రేని నిలువుఁడు. నేను మీ సహాయము లేకయే మహీమండలమున కరిగి యా మునిసత్తము చిత్తము గరగించి తపోభ్రష్టుని గావించెద. ఇట్లు చేయనైతినేని నన్నీ పేరం బిలువఁబోకుఁడు." అని దేవతాసన్నిధానమున గాఢప్రతిజ్ఞచేసి, యింద్రునిమెప్పు వడసి, యాతనిచేత ననేకాభరణంబులు బహుమానంబుగాఁ బడసి, వానికడ సెలవుగైకొని, భూలోకంబున కరిగి, యయ్యాశ్రమంబుజొచ్చి, మండుచున్న యగ్నివలె మహాతేజశ్శాలియైన త్రికాలవేదిం గనుంగొని, మెల్లమెల్లగ నాతని యనుగ్రహంబు వడసి, నాతనికి జలంబులు ఫలంబులు దెచ్చియిచ్చుచు

దన నవ్వులవంటి పువ్వులు పూజార్థ మర్పించుచుఁ గ్రమక్రమంబున నతనిమనస్సు గరిగించి కామాయత్తునింజేసి తనవలలో వైచికొనియె. మనోరమ యను సార్థక నామధేయముదాల్చిన మనోరమనుఁగూడి యమ్మహాముని సర్వనియమంబులఁబరిత్యజించి భోగియై యా కాంతవలన నొక కుమారునిఁగనియెను. కుమారుఁడు కలిగినపిదప నతని కెక్కడలేని పశ్చాత్తాపము కలిగెను. దేవవేశ్య వాని వ్రతభంగముజేసి కృతకృత్యురాలై భూలోకంబు విడచి నాకంబునకరిగెను.

'లంజకు పిల్ల తెగులన్న' సామెత నిజమయ్యెగదా! కన్నకొడుకను ప్రేమగాని, కనులు తెఱువని గ్రుడ్డుగదా యను జాలిగాని, లోకు లేమనుకొందురో యను శంకగాని, పాపభీతిగాని లేక యా వేశ్య యెంతపని చేసెనో చూచితిరా? సకలవిద్యాపారంగతుఁడై, భూతదయాపరుఁడైన ముని మాత్ర మేమిచేసెను. స్త్రీదక్షత లేని బిడ్డను పెంచుట దుస్సాధ్యమని మాంజడదారి బిడ్డ నొక పొదరింటఁ బువ్వులపానుపుమీఁదఁ బండుకొనఁబెట్టి తనదారింబోయెను. పసిపాపఁడు కావుకావుమని యేడ్చుచుండెఁ జూచువారుగాని, యుగ్గువెట్టువారుగాని, చన్నిచ్చి పాలుగుడుపువారుగాని లేరైరి. 'ఎవరికిఁబుట్టిన బిడ్డరా వెక్కి వెక్కి యేడ్చుచున్నాఁడు' అన్న సామెత నిజమయ్యెను. అక్కడికి దగ్గఱగా నొక కొండక్రింద నొకపల్లె యుండెను. ఆ పల్లియలో దొమ్మరివాండ్రు కాపురముండిరి. ఎక్కడనో యాటలాడి దొమ్మరివాండ్రు కొందఱు తమ సామానులతోఁగూడ మరల దమయూరికిఁ బోవుచు, మార్గమధ్యమున నట్టడవిని పొదరింట కావుకావుమను యేడ్పు వినఁబడఁ జెచ్చెర నచ్చోటికిఁబోయి లావణ్యపుంజమగు నా శిశువుం గనుంగొని యెత్తుకొని ముద్దాడి వానిం బెంచుకొనందలఁచి తోడ్కొనిపోయిరి. నాఁటనుండి యబ్బాలుఁడు తలిదండ్రులలోపంబున దొమ్మరివారిబిడ్డఁడై విద్యావిహీనుఁడై క్రమక్రమంబునం బెరిగి బూడిదలోఁ బొరలుచు గాడిదల

గాయుచు పందులమందలం దోలుచుఁ బెంపుడు తల్లిదండ్రుల విద్యయగు దొమ్మరివిద్య నేర్చుకొని గడలెక్కి యాడుచుఁ గాలక్షేపము సేయుచుండెను.

ఆ కాలంబునఁ బాంచాల దేశంబును ధర్మవర్ధనుఁడను మహారాజు పాలించుచుండెను. అతనికి శారదయను నొకపుత్రిక కలదు. ఆ బాలిక మేధాశాలిని యగుటచే జనకుఁడు శాస్త్రవిద్యాపారంగతురాలిం జేయఁ దలఁచి సార్థకనామధేయుఁడగు మేధానిధియను బ్రాహ్మణునిం బిలిపించి యామెకు విద్య సెప్పుమని నియోగించెను. ఆ విద్యానిధి చెప్పిన దంతయు నందిపుచ్చుకొనినట్లు రాజపుత్రిక క్షణమాత్రములో నేర్చి, సహజపాండిత్య మామెకు భగవంతుఁడు ప్రసాదించెనోయనునట్లు స్వల్ప కాలములోనే పాండిత్యము సంపాదించెను. పదమూఁడేండ్లు వచ్చు నప్పటికి శారద విద్యావిశారదయై, సంగీతసాహిత్యములయందు నిరుపమాన ప్రజ్ఞ కలదియై, రూపముచేత నేత్రములకు, ఘనపాండిత్యముచేత మనస్సునకు, గానవిద్యాప్రౌఢిమచేత శ్రవణంబులకుఁ బండువుచేయుచు, బంధుమిత్రుల కానందము గలిగించుచుండెను. నవయౌవనంబు ప్రాపించుచున్న కూఁతుంజూచి రాజు విద్యాభ్యాసము మానిపింపఁ దగిన సమయము వచ్చినదని, గురువునకు దక్షిణనొసంగి సెలవుగైకొని రమ్మని ధనకనక వస్తువాహనంబులిచ్చి కూఁతును మేధానిధికడకుఁ బంపెను. రాజపుత్రికయుఁ దాను దెచ్చిన సమస్తవస్తువుల నర్పించి, నమస్కరించి పోవుటకు సెలవిమ్మని యడుగ నాతఁడు నెఱజవ్వనియగు నమ్ముద్దియం జూచి మోహపరవశుఁడై, కామబాణపీడితుఁడై, మనంబు బట్టఁజాలక, మహారాజపుత్రికయని సందేహింపక, "నాకు నగలెందుకు? నాణము లెందుకు? వస్త్రములెందుకు వాహనము లెందుకు? నీ యౌవనంబె నాకు గురుదక్షిణగ నిమ్ము. నిన్నుఁ గౌగిలించుటయె నాకు త్రైలోక్య సామ్రాజ్యము, నిన్ను ముద్దాడుటయే నాకు మోక్షము, నీ సాన్నిధ్యమే

స్వర్గము. నాయందు భక్తిగలదేని యయ్యది నాకు లభింపఁజేయుము" అని యడిగెను. రాజపుత్రిక సువర్ణచ్ఛాయగల తనమొగము జేవురింప నేత్రము లెఱ్ఱజేసి "ఛీఛీ! నీవు బ్రాహ్మణుఁడవుకావు. ఛండాలుడవుఁ. నీ మొగము చూడరాదు" అని కోపించిన యాఁడు మేనుఁగువలె నతి త్వరితగమనంబున నంతఃపురంబు ప్రవేశించెను. మేధానిధి భగ్నమనోరథుండై, రాజపుత్రికకు సమయమువచ్చినప్పు డపకారము చేయవలెనని పగబట్టియుండెను. 'కానిమాట కప్పిపుచ్చవలె' నను లోకోక్తిప్రకారము శారద యాబ్రాహ్మణాధముఁ డాడిన మాటలను దలిదండ్రుల కెఱిఁగింపకపోయెను. అంత గొన్నినాళ్లకు శారద సంప్రాప్తయౌవనయయ్యెను, వివాహము నిమిత్తము తండ్రి కొన్ని సంబంధములు వెదకి తన కుమార్తెకు మంచిపండితుని, రూపవంతునిఁ దెచ్చి పెండ్లి చేయవలెనని నిశ్చయించి తనకాప్తుఁడైన మేధానిధింబిలిచి చక్కదనము గలిగి, సౌకుమార్యముగలిగి, నవయౌవనముగలిగి, విశేషించి పాండిత్యముగల యొక పెండ్లికొమారుని దెమ్మని చెప్పెను. తనపగ దీర్చుకొనుటకవకాశము గలిగినదికదాయని మేధానిధి మిగుల సంతసించి ప్రయాణవ్యయములకుఁగాను కొంత ద్రవ్యము సేకరించి, నానా దేశములు సంచరించి, బహు పట్టణంబులు, పలు పల్లియలు జూచి యందు దనకు నచ్చిన మూఢాగ్రేసరుఁడు లభింపమి నిరంతర ప్రయాణంబులఁజేసి దైవవశమున దొమ్మరి పల్లియకుఁ బోయి త్రికాలవేది పుత్రుండైన యా బాలునిఁజూచి వీఁడే తగినవాఁడని నిశ్చయించి, యా దొమ్మరులకు గొంతద్రవ్యమిచ్చి వానిం దనవశము జేసికొని, మాటపశువును మెల్లగాదువ్వి సాధువుజేసికొనునట్లు వానిని మంచిమాటలచేత మెత్తపఱిచి వాని మెడలో జందెములువైచి యిట్లనియె "ఓరీ! నీ పుణ్యము పుచ్చినది. నీ రొట్టె నేతిలోఁబడినది. నీ భాగ్యము పండినది. నీకొక మహారాజకుమార్తెను వివాహము చేయించెదను.

నీ వెవఁడవన్న రాచకొడుకువని చెప్పుము. రాజపుత్రికను నీవు చూచి నప్పుడు 'త్రిపీడా పరిహారోస్తు' అని దీవింపుము" అని యుపదేశించి యా మాటల నాలుమారులు వల్లింపఁజేసి వానిని దనవెంటఁ బెట్టుకొని ధర్మవర్ధనునికడ కరిగి యాతనిం జూపెను. దొమ్మరి కుఱ్ఱవాఁడు లేఁబ్రాయమం దుండుటచేతను, యజ్ఞోపవీతములు ధరించుటచేతను, మేధానిధియిచ్చిన మంచివస్త్రములు గట్టుకొనుటచేతను, సన్యాసిని కడుపున బుట్టినందున, సహజముగా స్ఫురద్రూపి యగుటచేతను, రాజు వానిం జూచి సంతసించి యేయేశాస్త్రంబుల నితఁ డభ్యసించెనని మేధానిధి నడిగెను. అడుగుటయు మేధానిధి "రాజా! ఇతని వృత్తాంత మంతయు నెఱింగించెద వినుఁడు. ఇతఁడు సుక్షత్రియుఁడు. తల్లిదండ్రులు చిన్ననాఁటనే మృతిఁ బొందిరి. ఈతఁడు కొండఱు బ్రాహ్మణోత్తములకు శుశ్రూష జేసి చతుశ్శాస్త్రములయందు మేరలేని పాండిత్యము సంపాదించెను. సకల పుణ్యక్షేత్రముల సేవించి, స్నాతకవ్రతముచేసికొని, వివాహమునకు సిద్ధముగ నున్నాఁడు. కాని, వివాహమగువఱకు నెవ్వరితోడను మాటలాడనని మౌనవ్రతదీక్ష బూనియున్నవాఁడు. తనకుఁ దోచినప్పు డెప్పుడైన నొక్కొకమాటాడుచుండును" అని విన్నవించెను. రాజు వాని పాండిత్య మెట్టిదో తెలిసికొనవలెనని కోరెనుగాని మౌనవ్రత మతని కడ్డువచ్చెను. అంతలో నా పెండ్లికొడుకు సభాభవనమునఁ గట్టఁబడిన యొక బొమ్మలోనున్న రావణ విగ్రహమును జూచి "రాభణుఁడా" యనెను. ఆ పలుకులువిని సభాసదులు రాజును మిక్కిలి యాశ్చర్యమొంది "చతుశ్శాస్త్రపండితుఁడేమి యిట్లు పలుకుటేమి" యని తమలోఁ దాము వితర్కించుకొనిరి. అది గ్రహించి మేధానిధి "ప్రమాదము సంభవించినదిగదా! ఈ మాటముండాకొడుకు నోరు మూసికొని యూరకుండఁడు. కుక్కతోకవలె వీనిమనస్సెంత సరిచేసినను సరిగా నుండదు. అయినను నేను దీనిని సమర్థింపఁజాలనా!" యని

సభాసదులంజూచి "మీరీ మహాపండితుని మాటల కర్థము తెలియక తెల్లబోవుచున్నారు. 'విద్యానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమం' అన్నారు గదా! విద్వాంసునిభావము విద్వాంసుఁడే యెఱుఁగును. నేఁజెప్పెద వినుండు.

శ్లో॥ కుంభకర్ణే భకారోఽస్తి భకారోఽస్తి విభీషణే,
రాక్షసానాం కులశ్రేష్ఠో రాభణో నతు రావణః,

తా॥ కుంభకర్ణుని పేరులో భకారముగలదు. విభీషణుని పేరులోను భకారము కలదు. అతని తమ్ములైన కుఱ్ఱగుంటలకే భకారముండఁగా రాక్షసకులశ్రేష్ఠుఁడైన రావణునకు భకార ముండఁగూడదా యని చమత్కారముకొఱకై యీ విద్వాంసుఁడు రాభణుఁడనిపలికెను గాని మాటలు రాకను, పాండిత్యములేకను గాదుసుఁడీ!" యని సమర్థించెను. సభవారందఱు వాని సమాధానము విని పెండ్లికొడుకు యొక్క పాండిత్యమునకు, రసికతకు మిక్కిలి సంతసించిరి.

అనంతరము రాజు శారదను రావించి పెండ్లికొమారునింజూపి యతనికి నమస్కరింపుమని యానతిచ్చెను ఆమె సిగ్గునం దలవంచుకొని హస్తపద్మములు మొగిడ్చి వానికభివాదముసేయ నా మోట పెండ్లికొడుకు "త్రిపీడా పరిహారోస్తు" అని మేధానిధి నూఱుసార్లు వల్లింపఁజేసినమాటలు మఱచిపోయి "త్రిపీడాస్తు" అని దీవించెను. మూఁడుపీడలు కలుగుఁగాక యని దీని యభిప్రాయము. పీడలు పరిహారమగుఁగాక యని దీవించుటకుమాఱు పీడలు కలుగుఁగాక యని యాశీర్వాదము చేయుటచేత సభాసదులు మరల విస్మితులై యొండొరుల మొగంబులు చూచుకొనిరి. అప్పుడు మేధానిధి యయ్యవారు చేసిన ననర్థము లన్నియు దిద్దుకొనవలసినవ్రాఁత తనకుఁబట్టినది గావున లేచి సభ వారి కిట్లనియె-" ఈ మహానుభావుని గంభీరభావములు సామాన్యులకుఁ దెలియవు. యోగిమహిమ పరమయోగి యెఱుఁగునన్నట్లీయన

భావము నే నెఱుఁగుదును. "త్రిపీడాస్తు" అన్న యాశీర్వచనము సరిగా నున్నది. ఎట్లన్న వినుఁడు.

శ్లో॥ ఆసనే పుత్రపీడా చ బంధుపీడా చ భోజనే,
శయనే భర్తృపీడా చ త్రిపీడాస్తు సదా తవ.

తా॥ కూర్చున్నప్పుడు తొడచకుండ బిడ్డలుపీడ, భోజన సమయమందు బంధుపీడ, పానుపుమీఁద భర్తృపీడయును, నీ మూఁడుపీడలును నీమె కుండవలెనని యీ మహాత్ముని యాశయము. అనఁగా నామె యిల్లు బిడ్డలతోడను—బంధువులతోడను, నిండియుండవలె ననియు, భార్యాభర్త లనుకూలదాంపత్యముగలిగి మెలఁగవలయుననియు దీని తాత్పర్యము. ఇందేమితప్పున్నదో చూడుఁడు" అప్పలుకులు విని ధర్మవర్ధనుఁడును సభాసదులును పెండ్లికుమారుని బుద్ధికుశలతకు మెచ్చి మహానందపరవశులైరి.

అనంతరము రాజు మంచిముహూర్తము పెట్టించి మహా వైభవముతో వివాహముచేసెను. యథావిధిగ వివాహమైనపిదప ఫలసస్సంధాన ముహూర్తము నిశ్చయింపఁబడెను. పెండ్లికుమారుఁడు పడకగదిలోనికిఁ బోయి మెడ లెఱుంగక నిదురబోయెను. శారద వాని యరసికభావమునకు రోసి ప్రాణము నిసక చేతితోఁదట్టి లేపి "అస్తి కశ్చిత్ వాగ్విశేషః" అనగా నేమైన కొంచెము పాండిత్యమున్న దాయనియడిగెను. "అస్తి లేదు గిస్తిలేదు నోరుమూసికొని తొంగోసీ" యని యతఁడు మోటుఁగా జెప్పి మరల కన్నులమూసి నిద్రపోయెను. అంతట నామె కత్తి చేతఁబట్టుకొని భర్తను గాఢనిద్రనుండి లేపి యా ఖడ్గము ఝుళిపించి "నీ వెవ్వఁడవు? నిన్నిక్కడకు దోడ్కొనివచ్చినవా రెవ్వరు? నీ వృత్తాంతమంతయుఁ జెప్పు" మని రాజపుత్రిక నసాధారణ సాహసము చేసి యడిగెను. అతఁడు గడగడ వడఁకుచు దాను దొమ్మరివాఁడై దిమ్మరీఁడగుటయు, మేధానిధి తనవారికి ద్రవ్యమిచ్చి తన్నుఁగొనుటయు,

దనకుఁ గొన్నిబుద్ధు లుపదేశించుటయు నాదిగాఁగల వృత్తాంతము పూసగుచ్చినట్లుజెప్పెను. అదివిని రాజపుత్రిక వానివలన దోషమేమియు లేదని ఖడ్గ మావలఁ బడవైచి యదియంతయు మేధానిధి చేసిన వంచనముగా గ్రహించి తన పురాకృతకర్మఫలమేయని భర్తకు విద్యోపదేశము చేయింపవలెనని తలపోసి యాతని కెన్నోబుద్ధులుచెప్పి కాళికాలయము నకుఁబోవ నొడంబఱచి పంపెను.

## కాళికాదేవి వరములిచ్చుట

ఆమె చెప్పినచొప్పున నతఁడు దేవీసద్మమునకరిగి తలుపులు మూసికొని కూర్చుండి యామె వచ్చినప్పుడు "కళ్ళీఁ దెద్దఁ కిళ్ళీఁ బిద్ద" యని యడిగి యామె యనుగ్రహమునకుఁ బాత్రుఁడై తక్షణమె సకలవిద్యలు కవిత్వము నేర్చినవాఁడై యఖండపాండిత్యము మెఱయ నామెను శ్లోకములచేతను, దండకముచేతను, స్తవము చేసెను. ఆ స్తవమున కానందమొంది యా దేవి పండితవాదములలో నతఁడే గెలుచునట్లును, రాజసభాంతరముల గౌరవము గలుగునట్లును, సమస్యాపూరణములయం దప్రతిమానప్రజ్ఞ గలుగునట్లును, నంతఃపురరహస్యములనైన నవలీలగాఁ దెలిసికొనునట్లును, నిఖిలశాస్త్రములలో నిరుపమపాండిత్యము గలుగునట్లును, గవిత్వమునం దద్వితీయుఁడగునట్లును, వరములిచ్చి పంపెను. తరువాత నతఁడు భార్యాంతఃపురమున కరిగి భార్యను మాతృదేవతగా భావించి నామెచేత శాపగ్రస్తుఁడయ్యెను. రాజపుత్రిక యోగినియై యోగముచేఁ బ్రాణత్యాగము చేసెను. అతఁడు కాళిదాసను పేరుగలిగి కొంతకాల మాపురంబుననే యుండి. ధేమియు నేఱనివానివలెఁ దిరుగు చుండెను.

# కాళిదాసుని జన్మవృత్తాంతము

## మూఁడవ కథ

అమృతము సంపాదింపవలెనని దేవతలు రాక్షసులుగలసి పాలసముద్రమును మథింపఁదలఁచిరి. అందు నిమిత్తము వారు మందర పర్వతము కవ్వముజేసి, యాదిశేషునిఁ గవ్వపు త్రాడుగాఁజేసి, యొక ప్రక్క దేవతలు, మఱియొకప్రక్క రాక్షసులు పాము త్రాడు పట్టుకొని తఱచనారంభించిరి. అప్పుడాపర్వతము సముద్రములోఁ గ్రుంగిపోయెను. అప్పుడు దేవదానవులు శ్రీమహావిష్ణుని వేఁడుకొనఁగా నతఁడు కూర్మావతారమెత్తి క్రుంగిపోయిన కొండక్రిందనిలిచి వారికి సాయముచేసెను. అప్పుడు పాలసముద్రములో హాలాహలవిషము పొడమెను. అది లోకములం గాల్చుచుండ దేవదానవులు భయపడి శివునిం బ్రార్థించిరి. భక్తవత్సలుఁడగు పరమేశ్వరుఁ డా హాలాహల విషమును మ్రింగి తన కంఠమునఁ బెట్టుకొనెను. తరువాత క్షీరసాగరములో దేవదానవులు కోరినట్లు చావులేకుండఁజేయునట్టి యమృతముపుట్టెను. ఆ యమృతము సమానముగాఁ బంచుకొనుటకై పాళ్లు తెగక దేవ దానవులు పోరాడిరి. అప్పుడు శ్రీమన్నారాయణుఁడు జగన్మోహినీ రూపము దాల్చి యా యమృతము బంచిపెట్టెను. ఆ జగన్మోహినీ రతీదేవికన్న, భారతీదేవికన్న, నుమాదేవికన్న, రమాదేవికన్న నెక్కువ చక్కనిరూపము గలిగి సురాసురులను భ్రమింపఁజేసెను. అనేక సంవత్సరములు జితేంద్రియుఁడై, మన్మథుని సంహరించి, మృత్యువును గెలిచి, లోకైకపూజ్యుఁడైన శంకరుఁడు విష్ణుమాయలోఁబడి జగన్మోహినీ రూపమునుజూచి మోహించి యొడలుతెలియక యామె వెంటఁబడి యెట్టకేలకు నామెతోఁ గొంతకాలము విహరించెను. అప్పుడు వారికిఁ గాలభైరవుఁడు జన్మించెను.

ఈ కథ భరతమహాముని నాటకముగాఁజేసి స్వర్గలోకములో దేవేంద్రుని కొలువులో నాడించెను. భరతమహాముని మొట్టమొదట నాట్యశాస్త్రము, నభినయశాస్త్రము, సంగీతశాస్త్రము రచియించిన మహానుభావుఁడు. ఆయన దేవతల ప్రీతికై యనేకనాటకములు రచియించెనని వాడుకకలదు. అందులో నీ జగన్మోహినీనాటక మొకటి. ఈ నాటకమును జూచుటకై దేవేంద్రుని కోరికమీఁద బ్రహ్మ విష్ణు మహేశ్వరులు కుటుంబములతో వచ్చిరి. వసిష్ఠ విశ్వామిత్ర భరద్వాజ కాశ్యపాంగీరస దుర్వాసప్రముఖులైన మహర్షులు దయచేసిరి. సిద్ధ సాధ్యవిద్యాధరకిన్నరకింపురుషాదులు సయితము ప్రేక్షకులైరి. రంభోర్వశీ మేనకాదులైన యచ్చరమచ్చెకంటులును విచ్చేసిరి. ఆనాటకములో జగన్మోహినీ వేషమును 'పుంజికస్థల' యను నప్సరసతాల్చెను. శంకరుని వేషము పుంజికస్థలకు మిక్కిలి ప్రియుఁడైన హంసుఁడను గంధర్వుఁడు దాల్చెను. భరతమహాముని నాటకకర్తయఁట! అచ్చరపడఁతి స్త్రీ వేషము దాల్చెనట! గంధర్వుఁడైన హంసుఁడు పురుషవేషము దాల్చెనఁట. ఇఁక రక్తివిషయమై చెప్పవలసినదేమున్నది? జగన్మోహినీరూపముఁ ధాల్చిన పుంజికస్థలయొక్క యభినయము, నాట్యము, గానవైఖరి, భావప్రకాశము, రూపలావణ్యవిశేషములు వర్ణనాతీతములై యుండెను. శంకరవేషముదాల్చిన హంసుని యభినయముకూడ దాని కనుగుణము గానే యుండెను. కవి చాతుర్యము, నటకుల ప్రయోగకౌశలము, ప్రేక్షకుల మహారసికత యను మూఁడు నొకచోటఁ గూడియున్నప్పుడు చెప్పవలసినదేమున్నది? ప్రేక్షకులు నిశ్చేష్టులైరి. దేవతలు ఱెప్పవాల్పక చూచుటచేఁ వారికి నిలింపశబ్దము సార్థకమయ్యెను. రంభాదులైన యచ్చరలు పుంజికస్థలయొక్క నృత్యగానాభినయపద్యలను జూచి సిగ్గుపడి తలవంచుకొనిరి. అది నాటకముగాఁ దలంపక సభాసదులు, నిజముగా శంకరుఁడు జగన్మోహినిని దమ కన్నులయెదుట వలచి

పైఁబడుచున్నాఁడని భావించిరి. ఆ సభలోనున్న దుర్వాసమహాముని పుంజికస్థలయొక్క హొయలు, హావభావములు జూచి మనోవికారము గలిగి సభాస్థారులు నవ్వునట్లు కొంతసేపు వికృతపు చేష్టలు చేసిచేసి యెట్టకేలకు మనస్సు పట్టఁజాలక బ్రహ్మవిష్ణుమహేశ్వరు లచ్చట సాక్షాత్కరించియుండిరని సందియములేక, వసిష్ఠ భారద్వాజాంగీరస ప్రముఖులు జూచుచున్నారనుశంకలేక చివాలునఁ దన యాసనమునుండి లేచి రంగస్థలముమీఁదికి విసవిస బరువెత్తి పుంజికస్థలయున్నయెడకుఁ బోయెను. అదివఱకే వాని వికృతిచేష్టలు కనిపెట్టుచున్న పుంజికస్థల యతని వాలకముజూచి భయపడి శరీరము గడగడనడఁక నేమియు జేయునదిలేక తనకేదో మహాపద సంభవించునని శంకించి శంకర వేషముతో నున్న తన మనోహరుఁడగుహంసుని 'రక్షింపుము-రక్షింపు' మని కౌఁగలించుకొనెను. సభయంతయు మిక్కిలి కలఁత జెందెను. కొందఱు తమ యాసనంబులనుండి లేచిరి. కొందఱు దుర్వాసుని నివారింపఁబోయిరి. సరస్వతీదేవి దుర్వాసుని మనోదౌర్బల్యముఁజూచి పక్కుననవ్వెను. నాటకము చెడిపోయెను. భరతమహాముని తనప్రయత్నము విఘ్నమైనదని విచారించెను. ముఖ్యముగా నతనికి పుంజికస్థలమీఁదఁ గోపము వచ్చెను. "వేలకొలఁది సభికులుండఁగా దుర్వాసుఁడు వచ్చి నిన్ను ప్రమింగు ననుకొంటివా? ఏల నీవు వేషములోనుండి హంసునిఁ గౌఁగిలించితివి? నీ మూలమున నాటకము చెడిపోయినది" అని భరతుఁడు పుంజికస్థలను గనులెఱ్ఱజేసిచూచి "నీవు భూలోకంబున మనుష్యాంగనవై పుట్టు" మని శపించెను. అక్కడనుండి కోపములు శాపములుగా మారెను. తన్నుఁజూచి సరస్వతి నవ్వినందున దుర్వాసుఁడు మండిపడి కన్నుల నుండి విస్ఫులింగములు చెదర, కోపావేశమున మాటలు తడబడ, శారదాదేవి నుద్దేశించి యిట్లనియె—"ఓ వాణీ! సృష్టికర్తయైన బ్రహ్మదేవుని రాణివగుటచేతను, విద్యల కధిదేవత నగుటచేతను, నీవు

మిక్కిలి గర్వించుచుంటివి ఎంత గర్వములేకున్న నాయంతవానింజూచి నీవు పరిహసింతువా ? నీవు భూలోకంబున నొక కిరాతుండవై జన్మించి నీచ స్త్రీవలన మరణంబు నొందుదువుగాక !" యని శపించెను. శారదాదేవి యొక్క చెలిమికత్తెయైన సావిత్రి నిష్కారణముగా శారద దారుణ శాపవశయైనదని విషాదముఁ బొంది, మూర్తీభవించిన కోపదేవతవలె నున్న దుర్వాసునింజూచి యిట్లనియె, "అయ్యా! అష్టదిక్పాలకులు, త్రిమూర్తులు, సమస్తమహర్షులు, సకలదేవతలుఁ గొలువుదీర్చియున్న యీ సభలో నీవు పుంజికస్థలంజూచి కామమోహితుండవై నానా వికారచేష్టలుచేసి మీఁదుమిక్కిలి రంగస్థలముమీఁదికురికి యింకేమేమో చేయఁబోయితివి. నీ యవస్థఁజూచినప్పు డెవరికి నవ్వురాదు ? నీవు గొప్ప తప్పుజేసి సిగ్గుపడి యూరకుండక పైగా నీ మహాదేవిని శపించితివా ? ఎందుకు నీ తపము ? ఎందుకు నీ నిష్ఠ ? నిర్హేతుకముగ నామెను శపించితివిగావున నీవు భూలోకమున నాఁడుదానవై పుట్టి యొకకిరాతునకు భార్యవై సంసారసౌఖ్య మనుభవింపక దుఃఖముపాలై దీనమైన మరణ మొందెదవుగాక" యని ప్రతిశాప మిచ్చెను. సరస్వతి తనకు దుర్వారమైన దుర్వాసశాపము గలుగుటచే దుఃఖపరవశయై మగని పాదములపైఁబడి మూర్ఛిల్లెను. చతుర్ముఖుఁడు తన ప్రియురాలికిని తనకును వియోగము సంభవించినదని మిక్కిలి వగచెను. సభాసదులలో గొప్పశబ్దము పుట్టెను. కొందఱు దుర్వాసుని నిందించిరి. కొందఱు పుంజికస్థల యవివేకమునకు వగచిరి. కొందఱు భరతమహాముని కొందర వదెననిరి, కొందఱు సరస్వతినిజూచి జాలిపడిరి, కొందఱు సావిత్రి సాహసమును మెచ్చిరి. తమ కేమిశాపములు తగులునోయని మఱికొందఱు పిఱికితనమున సభనుండి మెల్ల మెల్లన జారిరి.

అప్పుడు శ్రీమన్నారాయణుఁడు నిజాసనమునుండి లేచి రంగస్థలము మీఁదికిఁబోయి హస్తమెత్తి కేకవైచి కలవఁ మడిసి యిట్లనియెః

"మహర్షులయొక్కయు దేవతలయొక్కయు నోటనుండి వెలువడిన మాటలు జరుగకమానవు. సకారణముగానో. నిష్కారణముగానో శపింపఁబడిన వారు శాపముల ననుభవించితీరవలెను. ఈ శాపములు పైకి మహాకష్టములుగాఁ దోఁచుచున్నను ప్రపంచమునకుఁ గొంచెము ప్రయోజనకరము లగును. ఈ సరస్వతీదేవి కిరాతజన్మ మెత్తినందులకు గొప్పఫలము కలదు. ఏమంటివేని భూలోకమున సంస్కృతభాష క్రమక్రమముగా క్షీణించుచున్నది. చతుర్వేదములు, షడంగములు, షడ్దర్శనములు. నష్టాదశపురాణములు, ధర్మశాస్త్రములు, జ్యోతిశ్శాస్త్రము, వైద్యశాస్త్రము, గానశాస్త్రము, చతుష్షష్టికళలు గీర్వాణభాషలో నున్నవి. ఆ భాషాప్రచారము తగ్గుటయునగా జ్ఞానము తగ్గుట. అందువలన మనుష్యులు పశుప్రాయులగుదురు యుక్తాయుక్త వివేచనాశూన్యులగుదురు. ధర్మభ్రష్టులగుదురు. కావున నీ శారదాదేవి కిరాతజన్మ మెత్తియుఁ బూర్వజన్మవాసనచేతను, శ్రీ కాళికావరప్రసాదముచేతను. గీర్వాణభాషాభిమానము గలిగి కవిత్వము జెప్పఁగలిగి లోకోపకారము చేయును. గీర్వాణభాషాభిమానము వృద్ధి జేయును, ఓ బ్రహ్మదేవుఁడా! భార్యావియోగ మయ్యెనని నీవు విచారింపకుము. నీ భార్య కాళిదాసుఁడను పేర గొప్ప కవియగును. ఆమె వియోగము లేకుండ నీవు భూలోకమున సింధులమహారాజునకు నందనుఁడవై జనియించి భోజరాజను పేర మహాప్రసిద్ధుఁడవై కాళిదాసునితో నిరంతర మైత్రి కలిగి యుందువు. నాతోడి గ్రౌణసఖియైన సావిత్రి మర్త్యలోకమున జన్మించి నీకిల్లాలై పట్టపుదేవియై యుండును. భరతమహాముని శాపముఁబొందిన పుంజికస్థల వేశ్యాంగనయై జన్మించి కాళిదాసునకు ప్రేమాస్పదురాలై యుండుఁగాక! సావిత్రి శాపానుసారముగ దుర్వాసుఁడు సరస్వతీ యవతారమగు కాళిదాసునిఁ బరిణయఁ బగుఁగాక! ఇదే నా శాసనము. భోజకాళిదాసు లన్యోన్యవియోగము

సహింపరు గావున గాళిదాసు మృతినొందిన మేము గణికయలకే భోజుడు కాలధర్మము నొందును. కావున వాణీ పంకజాసనులు మరల నొకచో గూడుదురు నాటకము విస్తృమొసినది గావున జగన్నాటక సూత్రధారుడనైన నా పలుకులు గారవించి మీరందఱు యథాస్థానంబులకు దయచేయుడు ”

ఆ గోవిందుని యాజ్ఞప్రకారము బృందారకులందఱుం దమతమ మందిరంబులకు జనిరి. అనంతరము తమతమ శాపముల ప్రకారము బ్రహ్మ, సరస్వతి, దుర్వాసుడు, సావిత్రి, పుంజికస్థల మధ్యమలోకమున జనన మొందిరి.

## భోజరాజు వృత్తాంతము

పూర్వకాలమున ధారానగరము రాజధానిగాఁ జేసికొని మాళవ దేశమును సింధులుఁడనురాజు పాలించుచుండెను. అతఁడు చిరకాలము సంతానములేక తపించుచుండ ముసలితనమున నొక కుమారుఁడు కలిగెను. ఆ కుమారుని పేరు భోజుఁడు. ఆ కుమారుఁడైదేండ్లప్రాయము గలవాఁడై నప్పుడు వార్ధకముచేతఁ దనకుఁ గాలము సమీపించుచున్నదని తెలిసికొని యిట్లువిచారించెను. “ అయ్యో ! నాకు మరణమాసన్నమగుచున్నది. కుమారుఁడు పసిబాలుఁడు. నా తమ్ముఁడు ముంజుఁడు మహాబల సంపన్నుఁడు. వాని కన్నెప్పుడు రాజ్యముమీఁదనేయున్నది. నాకు వెఱచి యతఁ డేమియుఁ జేయలేకయుండెనుగాని, లేనిచో నతఁ డెట్టిపనికైన సాహసించును. రాజ్యము ముంజుని కప్పగింపక నా కుమారుని కిచ్చితినేని ముక్కుపచ్చలారని యీ పసిబాలుఁడు దానిని నిలుపుకొనఁగలఁడా ? విశేషించి నాకు లోకమునం దపవాదము గలుగును.

అపవాదముమాట యటుండఁగా రాజ్యకాంక్షియైన ముంజుఁడు తన కడ్డముగా నున్న భోజుని విషప్రయోగాదులవలన జంపును. అట్టియెడ కుమారునకు రాజ్యమిచ్చినందువలన లాభము లేదు మీదుమిక్కిలి పుత్రహానియును వంశనాశనముగూడ సంభవించును. పోనీ! ముంజునికే రాజ్యమిచ్చి పోవుదమన్న, నా కడుపునఁబుట్టి యాగర్భ శ్రీమంతుఁడై, కడుగారాబమునఁ బెరిఁగిన భోజుఁడు నిర్భాగ్యుఁడై, దిక్కుమాలినవాఁడై, నిరాధారుఁడై పోవునుగదా.

శ్లో॥ లోభాత్ క్రోధః ప్రభవతి, క్రోధాత్ ద్రోహః ప్రవర్తదే,
ద్రోహేణ నరకం యాతి శాస్త్రజ్ఞోపి విచక్షణః

తా॥ లోభమువలన క్రోధముపుట్టును. క్రోధమువలన ద్రోహము జనించును. శాస్త్రములు దెలిసిన పండితుఁడుగూడ ద్రోహమువలన నరకము జెందును.

శ్లో॥ మాతరం పితరం పుత్రం భ్రాతరం వా సుహృత్తమం
లోభావిష్టోనరో హంతి స్వామినం వా సహోదరమ్.

తా॥ లోభప్రేరితుఁడైనమనుష్యుఁడు తల్లిని, గొడుకును, సోదరుని, స్నేహితుని, దన యజమానునిఁగూడ నిస్సందేహముగాఁ జంపివేయును.

"అయినను రాజ్యము ప్రస్తుతము ముంజునకిచ్చి భోజుని వాని కప్పగించెదను" అని నిశ్చయించుకొని తమ్ముఁడగుముంజుని బిలిపించి రాజ్యభార మతని కప్పగించి, కుమారుని వానితొడపైఁ గూరుచుండఁ బెట్టి వాని చేతిలోఁ జేయివైచి యప్పగించెను.

పిమ్మటఁ గొన్నినాళ్లకు సింధులమహారాజు స్వర్గస్థుఁడయ్యెను. ముంజుఁడు రాజ్యభారము వహించి, చిరకాలమునుండి మంత్రియై, రాజవంశముయొక్క మేలుగోరుచుండి, సింధులమహారాజునకుఁ బరమాప్తుఁడై, ప్రజలకు మిక్కిలి యిష్టుఁడైన బుద్ధిసాగరుఁడను మంత్రి

నుద్యోగమునుండి తొలఁగించి తగిన లోకానుభవములేనట్టియు, నధికార గర్వితుఁడైనట్టియు, జనరంజనము చేయలేనట్టియు, మఱియొకనిని వానిస్థానమునఁ బ్రవేశపెట్టెను. రాజనందనుఁడైన భోజుఁడు గురువులకడ విద్యాభ్యాసము చేయుచు, బహుశాస్త్రసాంప్రదాయముల వినుచు, బాల్యము గడపుచుండెను.

ఒకనాఁడు ముంజుఁడు నిండుకొలువుదీర్చియుండ సకలవిద్యాచాతుర్యవంతుఁడును, జ్యోతిశ్శాస్త్రపారంగతుఁడును నగు బ్రాహ్మణుఁ డొకఁడు సభామంటపముఁ బ్రవేశించి మహారాజునకు స్వస్తి చెప్పి రాజానుమతమునఁ దగిన యాసనముమీఁదఁ గూర్చుండి యిట్లనియె, "రాజా! నేను బహుశాస్త్రంబులఁ జదివితిని. లోకులు నన్ను సర్వజ్ఞుఁ డందురు కావున మీ కిచ్చవచ్చిన ప్రశ్న నేదేని నన్నడుగుఁడు" అని పలుకుటయు రాజు, పండితుఁ డహంభావముచేత నట్లనుచున్నాఁడో, లేక నిజముగా నతఁడు లోకులనుకొనునట్లు సర్వజ్ఞుఁడో తెలిసికొనఁదలఁచి "అయ్యా! నేను జన్మించినది మొదలుకొని నేఁటివఱకు నేమేమిచేసితినో యదియెల్ల మీరు సరిగాఁ జెప్పితిరేని మీరు సర్వజ్ఞబిరుదమునకుఁ దగినవారే యని నే నొప్పుకొందు" నని వచియించెను. ఆ పండితుఁడు ముంజుఁడు పుట్టినది మొదలుకొని యానాటివఱకు జేసిన సమస్తకార్యములనుగూడ వ్యాపారసహితముగ వరుసగాఁ జెప్పెను. రాజు, పండితుఁడు చెప్పినవన్నియు సరిగా నున్నవని తెలిసికొని చాల సంతోషించి యతని పాదములపైఁబడి భక్తితత్పరుఁడై యింద్రనీల పుష్యరాగ వైడూర్య మరకతమణిమయ మైన సింహాసనమున నతనిఁ గూర్చుండఁబెట్టి యిట్లనియె—

"ఆహాహా! విద్యాప్రభావ మేమని వర్ణింతును! దానికిసాటి మఱియొకటి కలదా?

శ్లో॥ మాతేవ రక్షతి, పితేవ హితే నియుఙ్క్తే
కాన్తేవ చాభిరమయత్యపనీయ ఖేదం
కీర్తిం చ దిక్షు వితనోతి, తనోతి లక్ష్మీం
కిం కిం నసాధయతి కల్పలతేవ విద్యా ?

తా॥ విద్య తల్లివలె రక్షించును. తండ్రివలె మంచిమార్గము నం బ్రవేశపెట్టును. కాంతవలె ఖేదమును బోఁగొట్టి యానందింపఁజేయును. కీర్తిని దిక్కులయందు వ్యాపింపఁజేయును. సంపదఁ గలిగించును. అది కల్పలతవలె సమస్తము నొసఁగును. విద్య సాధింపఁజాలని దేమున్నది ? " అనిపలికి యామహావిద్వాంసున కు త్తమజాతిగుఱ్ఱములఁ బదింటిని బహుమానముగా నొసంగెను. అప్పుడు సభలోఁగూర్చుండిన బుద్ధిసాగరుఁడను మంత్రి యిట్లనియె—" మహారాజా! భోజునిజాతక మీ పండితున కిచ్చి యాతని జన్మఫలముల నడుగవలయు నని కోరుచున్నాను " అనవుడు ముంజుఁడు మంచిదని భోజుని జన్మపత్రికను దెప్పించి యా బ్రాహ్మణున కిచ్చి దాని ఫలంబులఁ జెప్పుమని యడిగెను. ఆ పత్రిక నందికొని పండితుఁడు " విద్యాశాలనుండి భోజు నొక్కసారి పిలిపింపు " డని కోరెను. ముంజురాజు భోజకుమారు నధ్యయనశాలనుండి తీసికొనిరమ్మని సేవకుల నంపెను. ఆ భటులతో నా రాజనందనుఁడు సభఁ బ్రవేశించి తండ్రితో సమానుఁడైన ముంజునకు మిక్కిలి వినయమున నమస్కరించి యుచితాసనమునఁ గూరుచుండెను. ఆ సభామంటపమున నున్న రాజకుమారమండలమంతయు భోజుని నిరుపమానసౌందర్య లావణ్యములఁజూచి యచ్చెరువందెను. భూమండలమును సందర్శింపవచ్చిన మహేంద్రుఁడో, పూర్వాకారమును ధరించివచ్చిన మన్మథుఁడో, మూర్తిమంతమైన సౌభాగ్యమో, యనునట్లు వెలయుచున్న యా రాకుమారునిఁ దేరిపారఁజూచి పండితుఁ డిట్లనియె—" రాజా! భోజుని భాగ్యోదయ మిట్టిదని వర్ణించుటకు నాలుగు మొగములు గల బ్రహ్మ

కైనను శక్యము కాదు. అట్టివో నిరంతరము పొట్టకై నానాకష్టములం బడు నేనెంతవాఁడను? అయినను నాకుఁ దోఁచినట్లు చెప్పెదను. ఇప్పటినుండి శ్రీభోజునిఁ దన యధ్యయనశాలకుఁ బంపివేయుఁడు"

అప్పుడు భోజుఁడు రాజునానతిచేత నధ్యయనశాలకుంబోవుటయు బ్రాహ్మణుఁ డిట్లు చెప్పఁదొడంగెను:— "గౌడదేశముతోఁగూడ దక్షిణాపథమంతయు భోజుఁడు నిరాటంకముగా నేఁబదియైదు సంవత్సరముల యేడుమాసముల మూఁడుదినములు పరిపాలించును"

ఆ పలుకులు వినఁగానే ముంజరాజు మొగము మాడిపోయెను. తెలివిగలవాఁడుగనుక తన విన్నదనమును గప్పిపుచ్చుటకై రాని మందహాసముఁ దెచ్చిపెట్టుకొని సంతోషించిన ట్లభినయించెను. అనంతరము రాజు బ్రాహ్మణుని బహుమానమిచ్చి పంపి రాత్రి తాను పండుకొను మేడమీఁదికిఁ బోయి యొంటరిగఁ గూర్చుండి యిట్లు విచారించెను. "రాజ్యలక్ష్మి భోజకుమారునకుఁ జెందినపక్షమున నేను బ్రతికియుండియుఁ జచ్చినవాఁడనే. ఇంతబ్రతుకు బ్రతికి, యింత వయస్సు గడపి యెట్టకేలకు బాలుడైన భోజుఁడు రాజ్యపరిపాలనము చేయుచుండఁగా నేను దీనుఁడనై వాని నాశ్రయించి యుందునా? ధనములేనిచో నెంతబుద్ధియుండిన నేమి? ఎంత బల ముండిన నేమి? ఎంత పాండిత్య ముండిన నేమి? అన్నియు వ్యర్థములుగదా? కావున నేను రాజ్యహీనుఁడనై నిర్ధనుఁడనై యుండవలెనా; లేక యెప్పటి మహైశ్వర్యము గలిగి బంధుమిత్రపరివారములచేత గౌరవింపఁబడుచుండవలెనా? ఇన్నమాటలెందుకు? భోజుఁడు రాజ్యముచేయవలెనా, నేను రాజ్యము చేయవలెనా? భోజుఁడు రాజ్యము చేయునేని నేను జీవించియుండఁ గూడదు. నేను వసుంధరఁ బరిపాలింతునేని భోజుఁడు నా కడ్డముగఁ నుండఁగూడదు. ఇది సాధ్యమగు టెట్లు? ప్రయత్నించినచో సాధ్యము కాని కార్య మేమున్నది. భోజునిఁ గడతేర్చు నుపాయమేది? ప్రజలు

సింధులరాజునందు మిక్కిలి భక్తిగలవారు. ఆ కారణమున వాని కౌమారుఁడైన భోజునకు గడు ననురక్తులు. పూర్వామాత్యుఁడైన బుద్ధిసాగరుఁడు దేశమునందు మిక్కిలి పలుకుబడి కలవాఁడు. వాని మాటకున్న చెల్లుబడి యసాధారణమైనది. ఈ కార్యమునందు నాకు సాయపడువా రెవ్వరు ? వంగదేశపు ప్రభువగు వత్సరాజొకఁడు నా యందు మిక్కిలి ప్రీతిగలిగి వర్తించుచుండును. అతఁడు మాత్ర మీ ఘాతుకకార్యమును నా నిమిత్తమై చేయబూనునా ? ప్రాణమిత్రుఁడైనప్పుడు సాయముచేయఁడా ? అయిన నీ వృథాతర్కమేల ! వానిని రావించి యాలోచించెదనుగాక !" అని వితర్కించి మనస్థిమితము లేమిచే భోజనమైనఁ జేయక తన యంగరక్షకునిఁ బంచి వత్సరాజును రావించి మేడమీఁద నెవ్వరు లేకుండఁ జేసి రహస్యముగా నతనితో నిట్లనియె, "వత్సరాజా ! నీవు నాకు మిక్కిలి యనురక్తుఁడవు. నీవు నా నిమిత్తమై యొక మహాకార్యము సేయవలయును. మిత్రకార్యము వచ్చినప్పు డది యెట్టిదైనను మనుష్యుఁడు నిశ్శంకముగా దానిని జేయవలయును. నా బతుకంతయు దానిమీఁదనె నిలిచియున్నది. అది నీవల్లనేగాని మఱి యితరులవల్ల సాధ్యముకాదు. స్వామినిమిత్తము భృత్యామాత్యులు ప్రాణములనైన నర్పింపవలసినది ధర్మగదా ! అట్టి యెడ నీవు నేఁబనిచినపనుపు చేయుటకు సందేహింపఁగూడదు" అనుటయు వత్సరాజు "దేవా ! మీ యాజ్ఞ శిరసావహించి యెట్టిపనినైనఁ జేసెద-సెలవిండు" అని సవినయంబుగాఁ బలుక ముంజుఁడు వెండియు నిట్లనియె—"ఆమాట నీనోట వెడలుటవలన నా పంచప్రాణములు లేచివచ్చినవి. నీవంటి మిత్రరత్నముండఁగా నా కార్యసిద్ధి కాకుండునా ? ధారాపుర రాజ్యలక్ష్మిని నేను వశపఱచుకొని నిశ్చింతగాఁ బరిపాలింపవలె నని యున్నది. ఇందుకు భోజకుమారుఁ డడ్డముగ నున్నాఁడు. ఈ రాత్రి వానిని భువనేశ్వరి యాలయముకడకుఁ గొంపోయి వధించి

వాని శిరస్సు నాకు గానుకగాఁ బంపవలయును. ఇదియే నా మనోరథము. ఇట్లు చేయవైతివేని నేను ప్రాణములు విడచెద. మాఱుమాటాడక వేవిఁ జేయవలయు."

అతిదారుణములైన యప్పలుకులు శ్రవణగోచరములైనతోడనే వత్సరాజు తెల్లబోయి రాజుంజూచి యిట్లనియె—"రాజా! మీ యాజ్ఞ నేను శిరసావహింపవలసినవాఁడనే. కాని, దేవరవారియొద్ద మిక్కిలి చనవుగలిగినవాఁడ నగుటచే నొక్కమాట చెప్పఁదలఁచుకొన్నాను. ఆగ్రహింపక క్షమించి యాకర్ణింపఁదగును, భోజునిదగ్గర ధనములేదు, సైన్యములేదు, పరివారములేదు, మిక్కిలి బాలుఁడు. అతఁడు జీవించి యుండిన మీ కేమియుపకారము చేయఁగలఁడు? రాజ్యమంతయు మీరే యనుభవించుచున్నారుగదా! అతని నేల చంపవలయును? అతఁడు పెద్దవాఁడైనను సైన్యము, ధనాగారము, మీవశమైయున్నదిగనుక మీ రతనికి రాజ్యమప్పగింపవద్దు. అందుచే నతనిం జంపుటయనవసరము" అని వత్సరాజు పలుకుటయు, ముంజుఁడు నాఁటి యుదయమున జ్యోతిశ్శాస్త్రవిశారదుఁడైన బ్రాహ్మణుఁడు తనకడ కరుదెంచుటయు, దాను భోజుని జాతకమతని చేతికిచ్చి ఫలములు చూడుమనుటయు, నేఁబదియైదు సంవత్సరములు, నేడునెలలు, మూఁడుదినములు భోజుఁడు రాజ్యమంతయుఁ బరిపాలించునని చెప్పుటయు లోనుగాఁగల వృత్తాంతమంతయుఁ దెలిపెఁగించెను. అదివిని వత్సరాజు నవ్వి యిట్లనియె—

"రాజా! కుక్షింభరుఁడైన యొకానొక బ్రాహ్మణుఁడు చెప్పిన జాతకఫలములనుబట్టియా యీనిట్టికార్యమును దలపెట్టుట? జ్యోతిశ్శాస్త్రము దృశ్యాదృశ్యమని మీ రెఱుఁగరా? పార్వతీశాపముచేత నది సరిగా జరుగదని పెద్దలు చెప్పఁగా మీరు వినియుందురు. పూర్వము దశరథ మహారాజు రామునకు రాజ్యాభిషేకము చేయఁదలఁచి బ్రహ్మపుత్త్రుఁడును, బ్రహ్మర్షి, సర్వజ్ఞుఁడునైన వసిష్ఠ మహామునిచేత

ముహూర్తము బెట్టించెను. ఆ ముహూర్త మెంతచక్కగా యోగించి నదో చిత్తగించినారా? రామునకు రాజ్యాభిషేకము లేదు సరికదా భార్యాసమేతముగా వనవాసక్లేశము సంభవించినది. తరువాత సీతాదేవిని రావణాసురుఁ డెత్తుకపోవుట సంభవించినది. దశరథమహారాజు మృతి నొందెను. భరతశత్రుఘ్నులు పట్టణముబాసి నందిగ్రామములో నుండిరి. కౌసల్యాకైకాసుమిత్రలు వితంతువులైరి. అయోధ్య పాడయ్యెను. ఆ ముహూర్తము బలిమి యట్లుండెను! అది యటుండనిండు. ధర్మరాజునకు సకలశాస్త్రవేత్తయైన ధౌమ్యుఁడు పురోహితుఁడుగదా! ఆయన బెట్టిన ముహూర్తము లేమైనవి? అదిగాక, నలచక్రవర్తికి, హరిశ్చంద్ర చక్రవర్తికి వేదవేదాంగవేత్తలయిన విబుధులు పురోహితులుగా నుండిరికదా! అట్టివారు పెట్టిన ముహూర్తములలో వివాహములాడిన యా మహారాజుల కటువంటికష్టములు రానేల? కాఁబట్టి జ్యోతిశ్శాస్త్రము నమ్మఁదగినదికాదు. ఆత్మలాభపరాయణులైన పండితులు ప్రశ్నలడుగువారికి సంతోషముగలిగింపఁదలచి యిచ్చవచ్చిన తెఱంగునఁ జెప్పుచుందురు. ఆ పలుకులునమ్మి మనము వర్తింపరాదు. ఆ పండితుని మాటలనుబట్టి మీరు భోజుని వధియింతురేని దేశము మహాసముద్రమువలె ఘూర్ణమానమగును. ప్రజలు భోజునియం దతి ప్రీతికలవారు. వారు మహాకంపితులై యెంతపనియైనఁ జేయఁగలరు. ప్రజాశక్తి యొక్కమారు విజృంభించెనేని మన సైన్యములు, మన యాయుధములు, దానిముందట గడ్డిపఱకపాటి సేయవు. ప్రజాప్రీతియే రాజు మూలబలముగా నెంచుకొనవలయుఁగాని, కత్తులు, కటారులు, ఫిరంగులు, తుపాకులు, నమ్ముకొని యుండఁగూడదు. పశుబలముచే జనుల నేలెడు రాజు చిరకాలము సుఖముగా రాజ్యము చేయలేఁడు. ప్రజా విశ్వాసముమీఁద నిలిచిన రాజ్యము స్థిరమైయుండును. ఏ విధముచేత నాలోచించినను భోజుని వధించుట సముచితముగాదు"

అనుటయు ముంజరాజు మిక్కిలికోపించి పండ్లు పటపటకొఱుకుచు "ఓయీ! నీవు రాజువుకావు. నీవు నాభృత్యుఁడవు. రాజాజ్ఞనిర్వర్తింపని భృత్యులు రాజద్రోహులై దండార్హులగుదురు. కావున నీవు ముందు వెనుక లాలోచించుకొని మాటలాడుము" అని బెదరించుటయు, వత్సరాజు తన యైశ్వర్యము, తన ప్రాణములుగూడ ముంజునిచేతిలో నుండుటచేత నతఁడు తనకు గొప్ప యపాయము గావించునని భయపడి యెట్టకేల కా ఘాతుకకార్యము చేయుట కియ్యకొనెను. ధనలోభ మెంత దుష్కార్యమునైనఁ జేయించునుగదా?

అంతట సాయంకాలమయ్యెను. సూర్యబింబము పశ్చిమసముద్రమందు మునిఁగెను. ప్రతాపవంతుఁడైన మహీపాలకుఁడు గతించినతోడనే యనామకులు పెక్కండ్రు తలలెత్తుదురని తెలియఁజేయుటకోయన భానుమండలము పడమటిసంద్రమందు గుంగినతోడనె మినుకుమినుకుమను చుక్కలు బైలుదేఱెను. దేశపరిపాలకుఁడైన భూపాలుఁడు మృతినొందినతరువాత దేశము దుష్టరాజవశమై మహాపదంధకారమున మునిఁగియుండునని తెలియఁజేయుటకోయన గాఢాంధకారము భూమ్యాకాశమధ్యప్రదేశమున నీలిగుడ్డ పఱచినట్లు, కాటుక వాన గురిసినట్లు, బ్రహ్మాండమంతట వ్యాపించెను. అప్పుడు వత్సరాజు దుష్కార్యాచరణమందుఁ గృతనిశ్చయుఁడై, మాయోపాయమున భోజకుమారుని రావించి, తన రథముపై నెక్కించుకొని భువనేశ్వరీ దేవతాలయసమీపమునకుఁ గొంపోయెను. మాయయొక్కమర్మము నెఱుఁగని భోజుఁడు కటికవాని వెంటనరుగు మేకవలెఁ దనకు రానున్న మహాపత్తు నించుకేనియు నెఱుఁగక, వత్సరాజునందు సంపూర్ణవిశ్వాసము గలిగి వెళ్లెను. నిర్జనమై నిశ్శబ్దమై నిబిడాంధకారమయమైయున్న యచ్చోటికి కరిగినతోడనే వత్సరాజు తన యొరనుండి ఖడ్గము నూడఁబెఱికి నిర్దయాత్ముఁడై భోజున కిట్లనియె—"కుమారా! నేను మిక్కిలి

మందభాగ్యుఁడను. అతి దారుణకృత్యము చేయుటకై వచ్చితిని. జ్యోతిష్కుఁడు నీ జాతకముజూచి నీవు చిరకాలము రాజ్యమేలుదువని చెప్పినది మొదలుకొని నీ పినతండ్రి ముంజుఁడు చింతాక్రాంతచిత్తుఁడై నీవు తనకడ్డముగా నుండుటఁ జేసి నిన్నుఁ జంపుమని నన్ను నియోగించెను. ఈదుష్కార్యము చేయకుండవలెనని నేననేకవిధములఁ బ్రయత్నించితిని. ఈ పాపకార్యమునుండి తొలఁగుమని బహువిధముల వానిని వేఁడుకొంటిని. ఈ పని చేయకపోదునేని నీ పినతండ్రి నా ప్రాణములఁదీయింప నిశ్చయించుకొన్నాఁడు. కావున నాత్మప్రాణసంరక్షణార్థమై యీ క్రూరకార్యము నేను చేయనిశ్చయించుకొంటిని. నేను రాజద్రోహిని - దేశద్రోహిని - స్వలాభమునకై మహాపాపమును జేయుచున్నాను నీవైనను నేనది చేయకతప్పదు. మీ యమ్మకేదైనఁ జెప్పఁదలంచుదువేని వేగము చెప్పుము"

అతిదారుణములై పిట్టపిడుగులుకూలినట్లా పలుకులు చెవిని బడినతోడనే భోజుఁడు మొట్టమొదట భయముచే నించుక కంపించి, రాచబిడ్డఁడగుటచే మరల ధైర్యము దెచ్చుకొని యిట్లనియె,

శ్లో॥ రామే ప్రవ్రజనం, బలేర్నియమనం, పాండోస్సుతానాం వనం,
వృష్ణీనాం నిధనం, నలస్యనృపతే రాజ్యాత్ పరిభ్రంశనం,
కారాగారనిషేవణంచ మరణం సంచింత్య లంకేశ్వరే,
సర్వః కాలవశేన నశ్యతి నరః, కోవా పరిత్రాయతే.

విష్ణుదేవుని యవతారమైన రాముఁడు నారచీరలుగట్టి యడవిని వసించెను. ముజ్జగంబులుగెల్చిన బలిచక్రవర్తి బంధింపఁబడెను. దేవాంశసంభూతులైన పాండవులు రాజ్యభ్రష్టులై పలుబాములఁ బడిరి. యాదవులు శ్రీకృష్ణుని చుట్టములయ్యు నొకరినొకరు కొట్టుకొని చచ్చిరి. నలుఁడు జూదమాడి రాజ్యముఁగోల్పోయి ఋతుపర్ణుని రథసారథి యయ్యెను. ఇరువదిచేతులు బదితలలుగల రావణుఁడు చెఱలోఁబడి

యెట్టకేలకు రాముని చేత మృతినొందెను. కాలమువచ్చినప్పుడు ప్రతి మనుష్యుఁడు నశించును. వాని నెవ్వఁడు రక్షింపఁజాలఁడు. చిన్నతన ముందే నాకు గాలముతీఱియుండుటచే నే నిప్పుడు మృతినొందుచుంటిని. ఎవరికిఁ జెప్పుటకేమున్నది ? ప్రతిదినము ప్రాతఃసాయంకాలములయందు భగవంతునిఁ బ్రార్థించుకొమ్మని యొక ధ్యానశ్లోకము జెప్పిరి. ఆ శ్లోక మిప్పుడు పఠించి నే నొక్కసారి పరమేశ్వరునిఁ బ్రార్థించుకొనియెద. ఇదియే నా కడపటి ప్రార్థనము గావున దానిని జేసికొనుటకు సెలవిమ్మ

శ్లో॥ అంభోధిః స్థలతాం, స్థలం జలధితాం, ధూళీలవః శైలతాం
మేరుర్మృత్కణతాం తృణం కులిశతాం వజ్రం తృణప్రాయతాం
వహ్నిః శీతలతాం హిమం దహనతా, మాయాతి య స్యేచ్ఛయా
లీలాదుర్లలితాద్భుతవ్యసనినే దేవాయ తస్మై నమః

తా॥ ఎవ్వని యిచ్ఛ చేత సముద్రము నేలయగునో, నేల సముద్ర మగునో, పరమాణువులగుంపు పర్వతమగునో, మేరుశైలము మృత్కణ రూపమగునో, గడ్డిపోఁచ వజ్రాయుధమగునో, వజ్రాయుధము గడ్డిపోఁచ యగునో, అగ్ని చల్లనగునో, మంచు మహాగ్నియగునో లీలాదుర్లలిత ప్రతిభుఁడగు నప్పరమేశ్వరునకు నమస్కరించుచున్నాఁడను.

అని ప్రార్థించి యచ్చట నేలరాలియున్న మఱ్ఱియాకులు రెంటిని దీసి దొన్నెగాఁజుట్టి వత్సరాజ హస్తమునను న్న ఖడ్గముతోఁ దన పిక్క గోసికొని యా గాయమునుండి బొటబొటగారు క్రొన్నెత్తురు దొప్పలోఁ జేర్చి మఱియొక మఱ్ఱియాకుఁ జేతఁ గ్రహించి గట్టి గడ్డిపోఁచ రక్తములో ముంచి యా వటపత్రముమీఁద నొక శ్లోకము వ్రాసి యీ మఱ్ఱియాకు మా పినతండ్రికిమ్మని యాతనిచేతికిచ్చి వెండియు నిట్లనియె, " వత్సరాజా! ఏల యాలస్యము చేసెదవు ? నీ రాజునాజ్ఞ నీవు త్వరగా నిర్వర్తింపుము. అట్లుచేయుటచేత నీవు రాజకార్యము చేసినవాఁడవేగాక నాకు మహోప

కారము చేసినవాఁడవగుదువు. ఏలయనఁ దనకు మరణమాసన్నమైనదని తెలిసినతరువాత మనుష్యుఁడు జీవించియుండుట మిక్కిలి కష్టము. ప్రాణము లిప్పు డెంతవేగమునఁ బోయిన నంతసుఖము. అది తెలిసిన తరువాత నెక్కువసేపు జీవించినవానికి బంధువులమీఁద, దలిదండ్రుల మీఁద, మిత్రులమీఁద, మనసుపాఱి, భరింపరాని మనోవేదనగలుగును. ఇప్పుడు నా మనస్సు మందభాగ్యురాలైన మా తల్లిమీఁది కరుగు చున్నది. చిరకాలము సంతానములేక కుందికుంది పలునోములు నోచినోచి కనఁబడిన పుట్టకుఁ జెట్టుకు మొక్కి బహువ్రతములు చేసిచేసి నన్ను గాంచినది 'నావరప్రసాది, నానోములపంట, నాగృహదీపమా ! నా వంశాలంకారమా ! ' యని నన్నుఁ బిలుచును. నన్నువిడిచి క్షణ కాలమైన నిల్వనోపదు. చీఁకటి గ్రమ్మినది. చాల ప్రొద్దు పోయినది. నే నిల్లుచేరలేదని యీ పాటికే పరితపించుచుండును. ఆమెం దలఁచిన నాకు మిక్కిలి జాలి యగుచున్నది. కావున నన్ను వేగ నధింపుము. చేయఁదలఁచివచ్చినపని నిర్వర్తించుటలో నాలస్య మెందుకు ? నీవు నీ శరీరమునేగాక నీ యాత్మనుగూడ రాజున కమ్ముకొన్నావు. ఆత్మ నమ్ముకొన్నవాఁడు దైవమునకు వెఱువఁడు—పాపమునకు వెఱువఁడు—వానికి ధర్మమక్కఱలేదు—సత్కర్మమక్కఱలేదు—నీకు ధనమే ప్రధానము—అధికారమే ప్రధానము—రాజానుగ్రహమే ప్రధానము పరమేశ్వరానుగ్రహము నీ కవసరములేదు. రాజుదొక్క చిఱునవ్వే నీ మనస్సును వికసింపఁజేయునవి. కాని, యీ యైశ్వర్యము శాశ్వతముఁ గాదు. ఈయధికారము శాశ్వతముగాదు. ఈయందంబులు స్థిరధనంబులు, ఈహాయంబులు ధనచయంబులు, నీ క్షేత్రభాండాగారంబులు మాభరణంబులు శాశ్వతంబులు గావనియు, నీ లోకము మనకు శాశ్వతము గాదనియు బరమేశ్వరుఁడు మనకార్యంబులనెల్ల నరయుచుఁ బైనున్నవాఁడనియు, మనము గావించు కార్యములకెల్ల మన మతనికి నుత్తరవాదులమనియు

నీ వెఱుఁగవు. నేఁడు నన్ను జంపించినవాఁడు రేపు నిన్నెదో మిష మీఁదఁ జంపింపకపోఁడు. అప్పుడు పశ్చాత్తాపపడినఁ గార్యములేదు. నీ వీ రాజును నమ్మి మిట్టిపడుచున్నావు. ఈ రాజు నీకు నగ్రహార మీయఁగలఁడు. పరమేశ్వరుని నమ్ముకొంటివా, యతఁడో శాశ్వతమైన పరలోకసామ్రాజ్య మియ్యఁగలఁడు. అతఁడు దేవతలకు దేవత, ఇంద్రున కింద్రుఁడు, అగ్నికగ్ని, యమునకు యముఁడు, రుద్రులకురుద్రుఁడు, సార్వభౌములకు సార్వభౌముఁడు, చక్రవర్తులకుఁ జక్రవర్తి. అట్టి జగదేక చక్రవర్తిని, సకల బ్రహ్మాండ సార్వభౌముని, సకల విశ్వనియామకుని నమ్మక, క్షుద్రభోగముల కాశించి, నీచరాజుల నాశ్రయించి, దయను జంపుకొని, ధర్మముఁ జంపుకొని, యాత్మఁ జంపుకొని, కీర్తిఁజంపుకొని, శమదమసూర్తిఁ జంపుకొని, యధమాధముఁడవై, యధికారమునకు బానిసవై, యకార్యలోలుఁడవైన నిన్నుఁజూడ నాకు మిక్కిలి జాలి యగుచున్నది. పాపము! నీవేమిచేయఁగలవు? నీ రాజాజ్ఞ యట్లున్నది. కానిమ్ము. నీపని కానీ! ఇదిగో నాకంఠము. నేను పుట్టినదినమువచ్చినప్పుడు, "వత్సరాజా! నీవును నీ తమ్ముఁడును నా తండ్రి సంతసించుననియు, నా తల్లి సంతసించుననియు మెత్తని పుష్పమాలలు వైచిరి. ఆ చేతుల తో నే-యీ కంఠము నే-జారచోరులను, దురాచారులను ఖండించునట్టి ఖడ్గముతో ఖండింపుఁడు. ఈశ్వరద్రోహివైనను, మహీశ్వరద్రోహివి గాకుము-చేయుము-నీ కార్యముఁ జేయుము. నా నెత్తురుజూచి సంతుష్టుఁ డగుటకు, నా శిరస్సుజూచి యానందించుటకు, పాపము! ముంజుఁ డెంతో యానందముతో మేలుకొని యేమియుంబోఁచక పిచ్చివానివలె మందిరంబునఁ దిరుగుచుండును. సత్వరము నా శిరస్సు ఖండించి, దీనిని సూడిదగాఁ గొనిపోయి మీ రాజునకు వెల్లడియైన కానుకఁగా నిమ్ము. అనుగ్రహపూరితములైన యాతని దృష్టి వర్షంబులు నీపై- నుడికిన నీ మనస్సు చల్లపడును"

హృదయంగమములై, నీతిబోధకములై మనోవికాసములై, పరమార్థగర్భితములైన యీ భోజకుమారుని మృదుమధురవాక్యములు విని వత్సరాజు తమ్ముఁడు జాలిచే మనంబు కరుగఁ దనయన్న కిట్లనియె :—

" అన్నా! యీ బాలుని మృదుమధురసంభాషణములు వజ్రమునైనను గరగించున ట్లున్నవి. నా మనస్సు కరఁగి నీరైనది. రాజుల యనుగ్రహములు మెఱుపుదీఁగెలవలెఁ జంచలములు, నిలుకడలేని వారి యనుగ్రహములు నమ్ముకొని ఘోరమైన దుష్కార్యమును నీవు జేయఁజూచుచున్నావు. నీ విహపరంబులకుఁ జెడుచున్నావు. అతి సుకుమారుఁడైన యీ కుమారుని రక్షించితి మేని మనముభయలోకములందు సుఖపడఁగలము. ఇతఁడు బ్రతికి బాగుండి మహారాజైనపక్షమున మనవంటివారి ననేకుల రక్షింపఁగలఁడు. ఒకవేళ నీతని సంహరింప నందుకు ముంజరాజు నీ శిరంబు ద్రుంచునని భయపడుదువేమో, ఆ విధముగా నీవు చావవలసిన యోగ మున్నపక్షమున నది తప్పదు. ఎన్నివిధముల నాలోచించినను నీ రాజనందనునిరక్షించుట కర్తవ్యము. కావున, వీనిని వధింపవలదు " అని తమ్ముఁడు హితోపదేశము చేయ వత్సరాజు జాలిగలిగి పశ్చాత్తప్తమనస్కుఁడై కన్నుఁగవనుండి వేఁడి కన్నీరొలుక ఖడ్గము గ్రిందఁబాఱవైచి భోజకుమారుని పాదములపైఁబడి " కుమారా! నేను పాపాత్ముఁడను, నృశంసుఁడను, బాలఘాతకుఁడను, పెద్దపులికన్నఁ గ్రూరచిత్తుఁడను, ఆత్మలాభపరాయణుఁడనై, యంతఃపురమున నవ్వారిగా సౌఖ్యంబు లందుచున్న నిన్ను మాయోపాయంబున నర్ధరాత్రమున నిర్మనుష్యమగు స్థలంబునకుఁ గొనివచ్చి చంపఁదలఁచితిని. ఈ తప్పు సైరింపుము. ముంజరాజునకుఁ దెలియకుండ నిన్నుఁ గొంతకాలము నాయింట దాఁచెదను. అనంతర కర్తవ్యము జూచికొనవచ్చును. "

అని లేచి బాలునిం గౌఁగిలించుకొని ముద్దాడి తమ్ముని చేత వానిం తనయింటికంపి భోజుని తలవంటి మాయాశిరస్సు నొకదానిని నిర్మించి ముంజునియొద్దకుం గొనిపోయి చూపెను. చూపుటయు నతఁడు సంతసించి "మృతినొందునప్పుడు బాలుఁ డేమైన నాతోఁ జెప్పు మనియెనా ?" యని యడిగెను. "దేవా ! నా ఖడ్గమునతోఁ దన పిక్కఁ జీటి మఱ్ఱియాకు దొన్నెలో నెత్తురు జేర్చి, మఱియొక మఱ్ఱి యాకుపై నేమో వ్రాసి మీ కిమ్మని యిచ్చెను. ఇదె ! యా లేఖ" యని వత్సరాజు వటపత్రము సమర్పించెను. దానిం జేకొని యందున్న యీ క్రింది శ్లోకముఁ జదువుకొనెను—

శ్లో॥ మాన్ధాతాచ మహీపతిః కృతయుగాలంకారభూతో గతః,
సేతు ర్యేన మహోదధౌ విరచితః క్వాసౌ దశాస్యాన్తకః ?
అన్యేచాపి యుధిష్ఠిరప్రభృతయో యాతా దివం; భూపతే,
నైకేనాపి సమం గతా వసుమతీ, నూనం త్వయా యాస్యతి.

తా॥ కృతయుగమున కలంకారభూతుఁడగు మాంధాత గతించెను. మహాసముద్రమునకు సేతువుగట్టిన రావణాంతకుఁడగు శ్రీరాముఁడు దివమున కరిగెను. తక్కిన యుధిష్ఠిరప్రముఖులుగూడ కాలధర్మము నొందిరి. వారెవ్వరు నీ భూమిని దమతోఁ దీసికొనిపోవఁజాలరైరి. ఈ భూమిని నీవుమాత్రము నీతోఁగూడఁ దీసికొనిపోఁగలవు.

చదువుకొని మానవేంద్రుఁడు మఱ్ఱియాకు నేలఁ బడవైచి వత్సరాజును గృహంబునకుఁ బొమ్మని పానుపుపైఁ బండుకొని నిద్ర పట్టక కొంతసే పిట్టటు పొరలును, కొంతసేపు లేచి పచారుచేయును. కొంతసేపు పిచ్చివానివలె నూరక గోడలవైపు జూచును. మరల వటపత్రముఁదీసి చదువును. నోటిలో నేమేమో గొణుగుకొనును. మాటి మాటికి నిట్టూర్పు విడుచును. ఊరక సేవకులం బిలచును. మ మ్మేల పిలచితిరని వా రడుగ వారికిం బ్రత్యుత్తరమీయక యూరకుండును

ఇట్లు గ్రహావిష్టునిచందంబున మైకముగ్రమ్మినవాని తెఱంగున, వెఱ్ఱివాని విధమున, నెద్దియుం దోచక కొంతసేపుండి పిమ్మట నమిత పశ్చాత్తప్త మనస్కుండై యిట్టులంగున విచారింపఁజొచ్చెను—"హా! నే నెట్టి నృశంసుఁడను. నా యన్న సింధులుఁడు, మరణసమయంబునఁ దన కుమారుని నా తొడపైఁ గూర్చుండబెట్టి, నా చేతిలోఁ జేయివెచ్చి యప్పగించి నాకడ నతఁడు సురక్షితుఁడుగా నుండునని సంపూర్ణ విశ్వాసముగలిగి దేహము విడిచెను. ముద్దులమూటగట్టునట్టి యాతని కుమారుని నిష్కారణముగా నేను జంపించితిని. నేను మనుష్యుఁడను గాను రాక్షసుఁడను. రాక్షసులుఁగూడ నన్యులను వధింతురుగాని తమ బిడ్డలను జంపుకొనరు. నేను రక్కసునికంటె నధమాధముఁడను. పులి తన బిడ్డలను దాను తినదని చెప్పుదురు. నేను మానవవ్యాఘ్రంబను. ఛీ! నా బ్రతుకేల? కాల్పనా! నేను క్షత్రియకులంబున కెల్ల మహా కళంకముఁ దెచ్చితిని. మా వంశమున కప్రతిష్ఠ దెచ్చితిని. మా వంశమునకే గాదు. మానవజాతి కప్రతిష్ఠ దెచ్చితిని. నేను జన్మించుటచేత నీ వసుంధర యపవిత్రమైనది. మా తల్లిగర్భం బపవిత్రమైనది. రాజకుల మపవిత్రమైనది. హా! భోజకుమారా! హా! రాజకులభూషణా! పాపాత్ముఁడగు నా కతమున నీ ప్రాణములు గోలుపోయితివికదా. ఆ మాయాజ్యోతిష్కుఁ డాదినమున నేలరావలె? వచ్చెనుపో ఫలములు జూచుమని నీ జాతకము నాతని కేలయీవలె? ఇచ్చితినపో— యతఁ డట్లేల చెప్పవలె? చెప్పెనుగాక, నా కంత దుర్బుద్ధి యేల పుట్టవలె? పుట్టెంబో వత్సరాజు చేసిన హితోపదేశముల నా చెవిని బెట్టితిని? ఇదియంతయు నా దురదృష్టము. అప్రతిష్ఠ—పాపము—ప్రియపుత్త్ర నాశనము నాకు సంప్రాప్తించెనుగదా! ఏమిచేయుదును? ఈనాఁ డవివిన్న ఘోరాపవాదము నన్ను నా కుటుంబమును బ్రతుకనిత్తురా? ఏమిగతి! మహామంత్రియై మా కుటుంబహితముఁగోరిన బుద్ధిసాగరుని వెడలనిచ్చితిని. అతనిని మరల

రోపించి, యతఁడుచేసెడు నుపదేశమును శిరసావహించి, యీ దుఃఖ సముద్రమును దరింపవలెను. అంతకన్న వేఱొకమార్గము కనఁబడదు" అని తలపోసి యొక సేవకునింబిలిచి బుద్ధిసాగరునిం దోడ్కొనిరమ్మని పంచెను.

వత్సరాజు గృహంబున కరిగి భోజకుమారుని దనయింట నొక నేలకొట్టునం దాఁచి సంరక్షించెను.

భోజరాజుతల్లి ప్రాణసమానుఁడైన తన పుత్త్రుఁడు కనఁబడక పోవుటచే కూడను గోల్పోయిన యావువలె నారాత్రియంతయు రాళ్లుసయితము కరఁగునట్లు మిక్కిలి విలపించెను. బుద్ధిసాగరుఁడు రాజమందిరముఁ బ్రవేశించి జరిగినవృత్తాంతమంతయు రాజునోట విని విషణ్ణహృదయుఁడై, రాజకుటుంబమునకు సంభవించిన దురవస్థకు విలపించి యిట్లనియె—"రాజా! నీవంటి మహాపాతకుఁడు లోకంబునలేఁడు. శిశుహత్యకంటె, ఘోరపాతకములేదు. అట్టి మహాపాతకమును రాజ్య లోభమున నీవు చేసితివి. నీమొగము చూడఁగూడదు. సోదరుని వంశము నాశనముచేసి యాతని గద్దెమెక్కి యాతని కిరీటముఁదాల్చి మహైశ్వ ర్యముల ననుభవింపఁ దలఁచుచుంటివి కాఁబోలు. తెల్లవారనిమ్ము! ప్రజలీవార్త వినిరేని నీ యంతఃపురము పరశురామప్రీతిచేసి నిన్నుఁ దుత్తునియలుగా నఱికి పాఱవైతురు. నీ కుటుంబము నిర్మూలింతురు. అన్నా! యెంతపనిచేసితివి? హా! భోజకుమార! దురాత్ముఁడైన పినతండ్రి చేత నీ కెంతగతిపట్టినది? మేమందఱము బ్రతికియుండి నీకు రవ్వంతయైన సాయము చేయలేకపోతిమి గదా? బలవన్మరణకాలమున నీ వెంత విలపించితివో? ఎవ్వారిం దలఁచితివో? అయ్యో! మే మందఱము మందభాగ్యులముకాకున్న నీవంటి బుద్ధిశాలి—నీవంటి చక్కనయ్య— నీవంటి సుగుణసంపన్నుఁడు—మమ్మెడఁబాసి పోవునే" అని యమాత్యశేఖరుఁడు వాపోవుచుండ ముంజరాజు "బుద్ధిసాగరా!

నీ వన్నట్లు నేను మహాపాతకుఁడను. నా మొగముఁ జూడఁగూడదు, నే నింక ప్రజల మొగము జూడను. ఈ మహాపాతకమునకుఁ దగిన ప్రాయశ్చిత్తము విధింపుము. అట్లు తప్పక చేసెద" నని యతని చరణములపైఁబడ బుద్ధిసాగరుఁ డిట్లనియె.–"రాజా! అగ్నిహోత్రంబునం బడి ప్రాణము విడుచుటకంటె దీనికి వేఱు ప్రాయశ్చిత్తము లేదు. అది కర్తవ్య" మని పలుక ముంజరాజు దాని కొడంబడి దేహత్యాగమునకుఁ గృతనిశ్చయుఁడై చితి సిద్ధముచేసి తత్ప్రయత్నములఁ జేయుమని బుద్ధిసాగరున కాజ్ఞాపించెను. బుద్ధిసాగరుఁ డా ప్రయత్నము చేయఁ జొచ్చెను.

అంతలోఁ గలకల తెల్లవారెను. భోజకుమారుని కై విలపించు చందమున నానావిధములైన పక్షులు కూయఁజొచ్చెను. దైవమా! నా కొడుకును 'కావుకావు' మని భోజమాత యేడ్చినట్లు కాకులు కావుకావుమని కూయఁజొచ్చెను. ముంజరాజునవలెనే కళాహీనమై పాండువర్ణమై చంద్రమండలము స్తమింప సిద్ధముగానుండెను. ముంజరాజు మిత్రులువలె నక్షత్రములు మెల్లమెల్లగ నడంగెను. క్రోధసంక్షుభిత మనస్కుఁడైన బుద్ధిసాగరుని మొగమువలెనే సూర్యమండలము పూర్వ దిగ్భామిని మొగముమీఁది కుంకుమబొట్టువలెఁ బ్రకాశింపఁజొచ్చెను. ఆ దారుణవార్త ధారానగరమందు పొక్కెను. ప్రజలందఱు క్రోధ ఘూర్ణితమానసులైరి. రాజును జంపవలెనని, రాజభవనము దగ్ధము చేయవలెనని పౌరులు మందలు మందలుగాఁ బైలుదేఱిరి. ఎవరుఁ జంపకుండ రాజు తనంతటఁదానె చచ్చుచున్నాఁడని చెప్పి బుద్ధిసాగరుఁడు వారిని వారించెను.

అంతలో నొక కాపాలికుఁడు చేత నొక పుఱ్ఱఁదాల్చి చిన్న పుఱ్ఱెలు కొన్ని దండగాఁగూర్చి మెడవైచికొని శరీరమాపాదమస్తకము భస్మమలఁది మఱ్ఱియూడలువలెఁ దలమీఁద జడలు వ్రేలాడుచుండ

బొదుకలు దొడిగికొని కౌపీనధారియై వత్సరాజు వెంట రాజభవనముఁ జొచ్చెను. రాజకుమారుఁడు సురక్షితుఁడై యున్నాఁడనువార్త వత్సరాజు బుద్ధిసాగరునకు రహస్యముగఁజెప్పి యతనిని సంతోషపెట్టి యా కాపాలికుని రాజ సందర్శనార్థమై తీసికొనిపోయి "రాజా! ఇతఁడు కాపాలికుఁడు. పరమ శైవుఁడు, ఘోరనియమములు గలవాఁడు. ఇతనియొద్ద మహామ్మృతప్రజ్ఞలు కలవు. దేవరవారి దర్శనార్థమై తీసికొని వచ్చితిని" అని విన్నవించెను. ముంజుఁడు కాపాలికునికి నమస్కరించి, "స్వామీ! మీ ప్రజ్ఞ లేమి?" యని యడిగెను.

"మాకడ ననేకప్రజ్ఞలు గలవు. విషముచేతను శస్త్రముచేతను చచ్చినవారిని బ్రదికింపఁగలను. కావున మీరు పరీక్షించిచూడుఁ" డని కాపాలికుఁడు ప్రత్యుత్తరమిచ్చెను. అట్లైన ఖడ్గనిహతుఁడైన మాభోజుని బ్రదికింపుముస్వామీ!" యని ముంజుఁ డతనిపాదములపైఁ బడెను. కాపాలికుఁడు "మంచిది! ఇందుకు నేఁటిరాత్రి శ్మశానములో హోమము చేయవలెను. హోమమతిరహస్యము. జనులెవ్వరు నచటికి రాఁగూడదు. వచ్చినచోఁ బిశాచగణసమేతుఁడైన భేతాళుఁడు వారిం గబళించును. హోమద్రవ్యములు వత్సరాజుచేత నచటికిఁ బంపుము. మే మరిగెదము" అని చెప్పి యంతఃపురముఁ బాసి పోయెను. రాజు బుద్ధిసాగరుని, వత్సరాజును బిలిచి తత్ప్రయత్నముఁ జేయుంపుమనెను. ముంజరాజునకు మనణము దప్పెను. ఎల్ల హోమద్రవ్యములు వల్లకాడు చేరెను. సాయంకాల మైనతరువాతఁ గాపాలికుఁడు మణుఁగులకొలఁది నేయిబోసి హోమము జేసెను. అగ్నిజ్వాలలు మిన్నుముట్టెను. చచ్చినవాఁడు బ్రతుకు టెట్లని జను లాశ్చర్యముగాఁ జూచుచుండిరి. రెండుజాములు రాత్రి యైనతరువాత హోమగుండమునుండి భోజుఁడు బ్రదికివచ్చె నని శబ్దము పుట్టెను జనులు మహానందభరితులైరి. ముంజుఁడు భోజునిఁ గౌఁగిలించుకొని ముద్దాడి తనతప్పు సైరింపుమని వేడుకొనెను.

భోజరాజుతల్లి యానందము నెవరు వర్ణింపఁగలరు ? కాపాలికునకు రాజు విశేష బహుమాన మీయఁదలఁచెనుగాని యతఁడు దానిని నిరాకరించి యధేచ్ఛంజనియెను. వత్సరాజు పన్నిన తంత్రము సఫలమయ్యెను. ముంజరాజు భోజసమేతుఁడై బుద్ధిసాగరాదిమంత్రులు వెంబడింప మహా వైభవమున నంతఃపురముఁ బ్రవేశించెను.

అనంతరము కొన్నినినాళ్ళకు ముంజరాజు భోజరాజునకు రాజ్యాభిషేకముచేసి బుద్ధిసాగరుని వానికి మంత్రిగా నప్పగించి తన ముప్పురు కుమారులకు మూఁడుగ్రామము లిచ్చి భార్యాసమేతుఁడై తపోవనమున కరిగెను. "భోజుఁడు సుందరముఖాంభోజుఁడు, యాచక కల్పభూజుఁడు, భానుసమాన తేజుఁడు, భోగబిడౌజుఁ"డనుచుఁ బండితులు బామలురు, ప్రజలు నుతియింప సకలవిద్యావిశారదుండై, యశేష శాస్త్రపారంగతుఁడై, మహాకవియై, కవిజన కల్పవృక్షమై, బహుగ్రంథ కర్తయై, విద్యలభోజుండని పేరువడసి చిరకాలము వసుంధర నేలెను.

## భోజుని విద్యాప్రీతి

భోజ మహారాజు సింహాసన మెక్కి మాళవదేశ పరిపాలకుఁడై నదిమొదలుకొని మాళవదేశమునను, ముఖ్యముగా దాని రాజధాని యగు ధారానగరమునను సరస్వతీదేవి సత్యలోకమును బాసి యాపట్టణము నివాసముగాఁ జేసికొని ప్రత్యక్షముగా నచ్చట విహరించుచు సకల విద్యల వృద్ధిచేయుచున్నదా యనునట్లు సకలశాస్త్రములు, సకలకళలు, వేదవేదాంగాది చతుర్దశవిద్యలు వర్ణించుటకు నలవిగానంత వృద్ధి బొందెను. సంస్కృత సాహిత్యములేని మనుష్యులు ధారానగరమున నతనికాలమున లేరనియేచెప్పవచ్చును. చిన్నబిడ్డలుగూడ సంస్కృతము

తోనే సంభాషణ చేసిరఁట! స్త్రీలుగూడ విద్యావిశారదలై కవనముఁ జెప్పఁగలిగిరఁట. పలుమాటలేల ? చేతిపనులు చేసికొని జీవించునట్టి పాటకపుజనముగూడ గొప్పగానో కొంచెముగానో సాహిత్యముగలిగి కవిత్వముఁ జెప్ప నేర్చిరని వాడుకగలదు. రాజు సంపూర్ణముగాఁ దలఁచు కొన్న పక్షమున విద్యాభివృద్ధియగుట కేమి యాశ్చర్యము! రాజుల కేది ప్రీతియో ప్రజలు దానినే యాచరింతురు. "యథా రాజా తథా ప్రజాః" అన్నమాట సత్యము. తురకలు మనదేశమును బాలించి నప్పుడు మనవారిలో ననేకులు పారసీకభాషలో మంచి పండితులైరి. ఆంగ్లేయులు పరిపాలించుచుకాలమున హిందూదేశమునందలి ప్రముఖులు పూర్ణవిద్యాభ్యాసముజేసి మహాపండితులై, మహావక్తలై, కవులై, ప్రసిద్ధిగాంచుట మనము చూచుటలేదా ? శ్రీకృష్ణదేవరాయలు మన దేశమును బరిపాలించినప్పుడు తెనుఁగుభాష రాజభాషయై మహోన్నత దశఁ బొందలేదా! అట్లే విద్యావినోదినియగు భోజుఁడు పండితపారిజాతమై మహిషిజనమందారమై, కవిజనకల్పకమై, మహామండలముఁ బాలించు నప్పుడు ప్రతిమనుష్యుఁడును సంస్కృత సారస్వతము నభ్యసింపవలెనని, రసవంతమగు కవిత్వముఁజెప్పి రాజును మెప్పింపవలెనని ప్రయత్నించెను. అందుచేత ధారానగరము సరస్వతీనృత్యమునకు రంగస్థలమై విరాజిల్లెను. ఆ విషయమై జనులు చెప్పుకొనుచున్న కొన్నికథల నుదాహరించుట సముచితము.

## కాంచనమాల

ఒకనాఁడు భోజమహారాజు గుఱ్ఱముపై నెక్కి నగరవీథుల సంచరించుచుండ నొకబాలిక తనచేతఁ జిన్ని తాటియాకుల పుస్తకమును బట్టుకొని బడికిఁ బోవుచుండెను. ఆ బాలికకు రాజునకు సంస్కృతభాషలో నీ క్రింది సంభాషము జరిగెను.

రాజు : కావా బాలా ?=ఎవతెవేపిల్లా నీవు ?

బాలిక: కాంచనమాలా=నాపేరు కాంచనమాల.

రాజు . కస్యాఃపుత్రీ ?=ఎవని కూఁతురవు ?

బాలిక: కనకలతాయాః=కనకలతయొక్క కూఁతురను.

రాజు : కింవా హస్తే ?=చేతిలోని దేమిటి ?

బాలిక: తాళపత్రం=తాటియాకు.

రాజు : కావా లేఖాః ?=దానిమీఁద వ్రాసిన దేమిటి ?

బాలిక: కాఖాగాఘాః=కాఖాగాఘాలు.

ఇదియంతయు నీ క్రిందిశ్లోకమగును—

శ్లో॥ కావాబాలా ? కాంచనమాలా,
కాస్యాఃపుత్రీ ? కనకలతాయాః,
కింవా హస్తే ? తాళపత్రం,
కావా లేఖాః ? కాఖాగాఘాః,

ఆహాహా! చూచితిరా కాఖాలు వ్రాసికొనునట్టిచిన్ని బాలిక పుస్తకమైనను బట్టని సమయమునఁగూడ భోజమహారాజుతో గీర్వాణభాషలో సంభాషించెను. ఆకాలమునందలి విద్యాభివృద్ధి కింతకన్న వేఱు నిదర్శనమేమికావలయును ? ఆ కాలమున సంస్కృతభాషయే మాతృభాషగా జనులచేత సంభాషింపఁబడుచున్న దని దీనింబట్టి యూహింపవచ్చును.

## రత్నఖేటదీక్షితుఁడు

ఈ మహారాజు ధారాపుర పరిపాలనము చేయుకాలమున నచ్చట రత్నఖేటదీక్షితులను నొక మహాపండితుఁ డుండెను. ఆయన నిరంకుశ ప్రతిభాశాలి-అమితమేధానిధి-పాండిత్యమునం దద్వితీయుఁడు. అతనికి రానిశాస్త్రము, రానికళ ప్రపంచమునలేదు. అతనికొక్క కూఁతు

చుండెనఁట. ఆమె బాల్యముననందే వితంతువగుటచేత రత్నఖేటదీక్షితులు పుత్రికాజీవితము నిరర్థకముగాకుండఁ జేయఁదలఁచి యామెకుఁ గ్రమక్రమముగాఁ గావ్యనాటకాలంకారగ్రంథములు చెప్పి పిమ్మటఁ దర్క-వ్యాకరణములం దభినివేశముఁ గల్గించి గొప్ప విద్వాంసురాలిం జేసెను. ఆమె తండ్రికి బహువిధముల నుపచరించుచుండెను విద్వాంసురాలై నను నిరంతరము విద్యాగోష్ఠియందేకాలముగడుపక తల్లికిఁదోడ్పడి గృహకృత్యములుగూడ నెఱవేర్చుచు మంచి పేరు సంపాదించెను

ఒకనాఁడు రత్నఖేటదీక్షితుఁడు గ్రామాంతరమునకరిగియుండఁగా నతనితో వాదముచేయవలయునని తర్క-వేదాంతాదిశాస్త్రములయందు నిరుపమాన పాండిత్యముగల యొక గొప్ప విద్వాంసుఁడు వచ్చి "దీక్షితులు గారున్నారా ?" యని యడిగెను. "ఎందు" కని కూఁతురడుగఁగా "వాదముచేయవచ్చితి" నని యతఁడు చెప్పెను. అప్పుడామె చిఱునవ్వు నవ్వి యీ క్రింది శ్లోకముఁ జెప్పెనఁట—

శ్లో॥ విపశ్చితా మపశ్చిమే వివాదకేళినిశ్చితే
సపత్నపి త్యయత్నమేవ రత్నఖేటదీక్షితే
బృహస్పతిః ప్రజల్పతి ప్రసర్పతి క్వసర్పరా
డసమ్ముఖశ్చ షణ్ముఖ శ్చతుర్ముఖ శ్చతుర్ముఖః.

తా॥ పండితులలో నగ్రగణ్యుఁడును, శత్రువులను జయించువాఁడును నైన రత్నఖేటదీక్షితులు వివాదమునకు సిద్ధమైనప్పుడు ప్రయత్నము లేకుండఁగనే వానిముందట బృహస్పతి ప్రేలరియగును. వేయి నాలుకలుగల యాదిశేషుఁడు ప్రసరింపఁజాలఁడు. ఆఱుమొగములుగల కుమారస్వామి తెల్లమొగము వేయును. చతుర్ముఖుఁడు మూర్ఖుఁడగును.

ఈ శ్లోకము వినఁగానే యా క్రొత్తపండితుఁడు "అమ్మా! దీక్షితులు గారు నీ కేమగుదురు ?" అని యడిగెను. "ఆయన మా తండ్రియే" యని

యామె ప్రత్యుత్తర మిచ్చినతోడనే యతఁ డామె పాండిత్యమునకు మిక్కిలి యాశ్చర్యమంది, దీక్షితులుగారివద్ద విద్య నేర్చికొన్న యాఁడు పిల్లయే యింత పాండిత్యము గలిగి, యింత పటుత్వముగాఁ గవిత్వము చెప్పఁగలిగిన నింక దీక్షితులుగారి పాండిత్య మెట్లుండునో? ఆయన ముందర మన మాఁగగలమా యని తనలో వితర్కించుకొని "మీ నాయనగారు వచ్చినతరువాత మరల వచ్చెదనమ్మా" యని యామెతోఁ జెప్పి యా రాత్రియే ధారానగరము విడిచిపోయెను.

## ఒక విద్యావతి

ధారాపురమున నొక బ్రాహ్మణుఁడు తనకూఁతును మంచి సాంప్రదాయముగల యొక పడుచువాని కిచ్చి వివాహము చేసెను. అల్లుఁడు బహుదేశముల కరిగి విద్యలు నేర్చి కటకములో జ్యోతిశ్శాస్త్ర మభ్యసించుచుండెను. బ్రాహ్మణునికూఁతురు రజస్వలయై నాలుగైదు సంవత్సరము లయ్యెను. ఎంతకాలము కనిపెట్టుకొనియున్నను వారి యల్లుఁడు వచ్చుటగాని, భార్యను దీసికొనిపోవుటగాని సంభవింప దయ్యెను. ప్రాణము విసికి యా బ్రాహ్మణుఁ డూరకుండెను. ఎట్టకేలకు బ్రాహ్మణుని బాలిక పుట్టినింటఁబడియుండఁజాలక తాను శాస్త్రవిద్యాభ్యాసము జేసినపండితురా లగుటచేఁ గటకముఁ పోవునట్టి యొకానొకని చేతికి క్రిందిశ్లోకము వ్రాసియిచ్చి యది తనభర్త కిమ్మని పంపెను.

శ్లో॥ గృహే హిత్వా బాలా మభినవవిలాసాన్వితతనూ,
మధీషే భిక్షాసీ చిర మధిశయాన క్షితితలే
పరిజ్ఞాతే శాస్త్రే కటక మటతో జీర్యతి వపుః
చకోరే పాండిత్యం న విషయసుఖం నాపిచతివః.

తా॥ నవయౌవనముతోఁగూడిన శరీరముగల బాలికను గృహమునందు విడిచిపెట్టి మాధుకరము జేసికొని నేలఁబండుకొని చిరకాలము నుండి విద్య నేర్చికొనుచున్నావు. ఆ కటకమునందు నీవు విద్యాసమాప్తి

జేసికొనునప్పటికి వయస్సు చెల్లిపోయి శరీరము శిథిలమగును. ఎందుకు నీ పాండిత్యము ? తగులబెట్టనా ? సంసారసుఖ మనుభవించినవాఁడవు కావు ; దానిమీఁదఁ గాంక్ష లేకపోయినపక్షమున వైరాగ్యముగలిగి తపస్సు చేసికొన్నవాఁడవు కావు ; ఈ రెంటికిని జెడినవాఁడవైతివి.

భార్యాస్వహస్తలిఖితమైన యాకమ్మఁజూచుకొని యాపండితుఁడు సిగ్గుదెచ్చుకొని కటకమును విడిచి ధారాపురముఁ బ్రవేశించి భార్యతో సుఖముగాగాపురముచేసెను. ప్రాచీనకాలమునందు స్త్రీలు విద్యాభ్యాసము విశేషముగాఁ జేసిరనుట కిట్టి నిదర్శనము లనేకములు గలవు.

## సాలెవాఁడు

ధారాపట్టణమున నొక సాలెవాఁడు కలఁడు. అతఁడు కులవృత్తివలన జీవనము చేయుచున్నను, సంస్కృత సాహిత్యముగలిగి కవిత్వము చెప్పఁగలిగియుండెను. ఒకనాఁడు భోజరాజు తనపట్టణమందు విద్యావిహీనులైనవారిని గృహములలోనుండి లేవఁగొట్టి సారియింపఁ బండితుల కీయవలసినదని యాజ్ఞాపించెనఁట ! సేవకులు వాడవాడలకుఁ బోయి విద్యావిహీనులైనవారిని రాజసమ్ముఖమునకుఁ గొంపోయిరి. సాలెవాఁడు తాను పండితుఁ డయ్యుఁ దనప్రజ్ఞ నెవరికిం దెలియకుండ నివురుగప్పిన నిప్పువలె నుండి బట్టలు నేసికొనుచుండుటచే వాఁడు నిరక్షరకుక్షి యని భావించి సేవకులు వానిని రాజుకడకుఁ గొనిపోయిరి. "నీవు విద్యావిహీనుఁడవు కావున నీ యిల్లువిడచి స్థలాంతరమునకుఁ బోవలయు" నని రాజు వానితోఁ బలికెను. అప్పు డతఁడీ క్రిందిశ్లోకరూపమున రాజునకుఁ బ్రత్యుత్తర మిచ్చెను.

శ్లో॥ కావ్యం కరోమి న హి చారుతరం కరోమి;
యత్నాత్ కరోమి యది, చారుతరం కరోమి;
భూపాలమౌళిమణిరంజితపాద,
హే సాహసాంక, కవయామి, వయామి, యామి.

తా॥ రాజుల కిరీటములయందలి మణులచేత నలంకరింపఁబడిన పాదపీఠము గలిగి సాహసాంకుఁడను బిరుదుగలిగిన యో రాజా! కావ్యము చేయఁగలను, కాని యంతచక్కఁగాఁ జేయలేను. ప్రయత్నము చేసిన పక్షమునఁ జక్కఁగాఁగూడఁ జెప్పఁగలను. దేవరవారి సెలవేమి? కవిత్వము చెప్పుదునా, నేత నేసికొందునాఁ యిల్లువిడిచిపోదునా?

అనవుడు రాజు వానిపాండిత్యమున కచ్చెరువడి యివింతపండితుఁడ వన్నమాట మే మెఱుఁగము. నీ వెక్కడికిం బోవనక్కఱలేదు. నీయింట నీవుండు మని చెప్పి వానిం బంపివేసెను.

## కుటుంబకవులు

మాళవ దేశమునందొక గ్రామమున నొక బ్రాహ్మణుఁ డుండెను. అతఁడు, నతని భార్యయు, నతని కుమారుఁడు, నితని కోడలు నలుగురు గొప్ప పాండిత్యము సంపాదించిరి. నలుగురుఁ గవిత్వము చెప్పఁగలిగిరి. ఒకనాఁడు భోజమహారాజు పండితకవిజనపరివేష్టితుఁడై సభాభవన మలంకరించియుండ బ్రాహ్మణుఁడు సకుటుంబముగా మహీపాలుని సందర్శించి యాశీర్వదించి "రాజా! మేమందఱము గవిత్వము జెప్పుదుము పరీక్షించి మమ్ము సన్మానింపుఁడు" అని విన్నవించెను. ఆ కుటుంబకవులంజూచి రాజు సంతసించి యీ క్రింది సమస్య పూరింపు మని వారి కిచ్చెను.

"క్రియాసిద్ధిః సత్త్వే భవతి మహతాం; నోపకరణే"

తా॥ మహాపురుషులయొక్క కార్యసిద్ధి వారి మహిమయందే యుండును. గాని సాధనసామగ్రియం దుండదు.

ఆ సమస్యను గ్రహించి బ్రాహ్మణుఁడు ముందుగా నీ క్రింది విధమునఁ బూరించెను.

శ్లో॥ ఘటో జన్మస్థానం, మృగపరిజనో, భూర్జవసనో
వనేవాసః, కందాదికమశన; మేవంవిధగుణః
అగస్త్యః పాథోధిం యధకృతకరాంభోజకుహరే,
క్రియాసిద్ధిః సత్త్వేభవతి మహాతాం నోపకరణే.

తా॥ అగస్త్యుఁడు కుండలో జన్మించెను. అతనికిఁ బరివారము మృగసమూహమే. కట్టుబట్ట భూర్జపత్రము, ఉనికి నట్టడవి, భోజనము కందమూలఫలములు—ఇట్లుండియు నతఁడు సముద్రమంతయు నజచేతిలోఁ బట్టి త్రాగివైచెను. మహాపురుషులయొక్క కార్యసిద్ధి వారి మహిమ యందే యుండును గాని సాధనసామగ్రియం దుండదు.

అదివిని రాజు సంతోషించి యతనికి గొప్పబహుమాన మొసంగి, ముగ్గుబుట్టనలె నెఱసినతలతో మొగమునిండఁ బసపు బూసికొని పెద్ద కుంకుమబొట్టు పెట్టుకొని వృద్ధ బ్రాహ్మణునిప్రక్కనున్న పెద్దముత్తైదు వయిన యతనిభార్యనుజూచి "అమ్మా! మీరుగూడ నీ సమస్యను బూరింపుఁ" డని భోజుఁడు పలికెను, అప్పుడాయవ్వ యిట్లుపూరించెను.

శ్లో॥ రథస్యైకం చక్రం, భుజగయమితాః సప్తతురగా,
నిరాలంబోమార్గ, శ్చరణవికలః సారధి రపి,
రవి ర్యాత్యే వాన్తం ప్రతిదిన మపారస్యనభసః,
క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం; నోపకరణే.

తా॥ సూర్యుని రథమునకు జక్ర మొక్కటి. ఏడుగుఱ్ఱములుఁ పాములతో వాటిని గట్టుదురు. ఆ రథము పోవునట్టి యాకాశమార్గము నిరాధారమైనది. రథముఁదోలెడుసారథి కాళ్లులేనివాఁడు. అయినను సూర్యుఁడు ప్రతిదినము మేరలేని యాకాశముయొక్క కొట్టకొనవఱకుఁ బోవుచున్నాఁడు. మహాపురుషులయొక్క కార్యసిద్ధి వారి మహిమయందే యుండునుగాని సాధనసామగ్రియం దుండదు.

రాజాశ్లోక మాకర్ణించి మహానందమునొంది గొప్ప బహుమాన మిచ్చి నిండు ప్రాయములోనున్న యాతని కుమారునిఁగూడ సమస్యా పూరణము జేయుమని యడిగెను. అతఁ డిట్లు పూరించెను.

శ్లో॥ విజేతవ్యా లంకా, చరణతరణీయో జలనిధి,
ర్విపక్షః పౌలస్త్యోరణభువి, సహాయాశ్చ కపయః,
పదాతిర్మర్త్యోఽసౌ, సకల మవధీ ద్రాక్షసకులం;
క్రియాసిద్ధిః సత్త్వేభవతి మహతాం; నోపకరణే.

తా॥ జయింపవలసినది లంక, సముద్రము కాలితో దాటఁదగినది కాదు. శత్రువుఁడన్ననో రావణాసురుఁడు యుద్ధములో సాయపడినవి కోతులు. యుద్ధముచేయుచున్న వీరుఁడు రథములేని కాలిబంటు, అట్లుండియు శ్రీరాముఁడు రాక్షసకులమునంతయు నాశనముచేసెను. మహాపురుషులయొక్క కార్యసిద్ధి వారి మహిమయందే యుండును గాని సాధనసామగ్రియం దుండదు.

ఆ శ్లోకమును విని రాజు సంతుష్టాంతరంగుఁడై యతనినిగూడ సర్వముగ సత్కరించి మిసమిసలాడెడు నిండుజవ్వనమున రెండవరతీదేవి వలె వినయమునఁ దలవంచుకొనియున్న యా బ్రాహ్మణిని కోడలింజూచి "అమ్మా! నీవుకూడ నీ సమస్యను బూరింపు"మని యడిగెను. ఆ కల్యాణి యీ క్రిందివిధమున దానిం బూరించెను.

శ్లో॥ ధనుః పౌష్పం, మౌర్వీ మధుకరమయీ, చంచలదృశాం
దృశాం కోణోబాణాః, సుహృదపి జడాత్మాహిమకరః
స్వయం చైకోనంగః, సకలభువనం వ్యాకులయతి,
క్రియాసిద్ధిః సత్త్వే; భవతి మహతాం; నోపకరణే.

తా॥ విల్లు పువ్వు, నారి తుమ్మెదలగుంపు, చంచలనేత్రలైన పడఁతుల కటాక్షవీక్షణములు బాణములు, స్నేహితుఁడు జడస్వరూపుఁడైన చంద్రుఁడు, తానో శరీరమే లేనివాఁడు, అయినను మన్మథుఁడు

ప్రపంచమంతను వ్యాకులపెట్టుచున్నాఁడు. మహాపురుషులయొక్క కార్యసిద్ధి వారి మహిమయందే యుండును. కాని సాధనసామగ్రియం దుండదు.

ఈ శ్లోకము పై ముగ్వురు చెప్పిన శ్లోకములకంటె మిక్కిలి రసవంతముగా నుండుటచే భోజుఁడు సంతోషవికసితముఖాంభోజుఁడై యామెను గడు బ్రశంసించి, తన పట్టపుదేవి యగు లీలావతీదేవియొక్క యాభరణము లన్నియుఁ దెప్పించి యామెకు బహుమాన మిప్పించెను.

## కాళిదాస భోజరాజ సమాగమము

అట్లు కాళిదాసుఁడు భార్యాపరిత్యాగము జేసి తన విద్యావినోదములు జూపఁదగిన రాజాస్థానమేదైన లభించునా యని యందందుఁ దిరుగుచుండ నక్కాలంబున యాచకచకోరములకు సంపూర్ణచంద్రుండును, పండితచాతకములకు నీలమేఘుఁడును, కవిజనంబులకుఁ గామధేనువును నని పేరువడసిన భోజరాజును దర్శించుటకై కొందఱు పండితులు బోవుచుండి యాతనికిం గనఁబడిరి. ఎందు బోవుచున్నారని కాళిదాసు వారినడుగ వారిట్లనిరి—"అయ్యా! మేము మాళవేశ్వరుఁడగు భోజరాజును దర్శింపఁ బోవుచున్నాము. అతఁడు పండితచింతామణి, కవులకు ముంగొంగుబంగారము, దానవిద్యాంధకార ప్రభాకరుఁడు. పండితులకు మితిలేని బహుమానము లిచ్చుచున్నాఁడు. రసవంతమయిన కవిత్వముఁ జెప్పితిమా యక్షరలక్షలతనివద్దఁ బుచ్చుకొన్నవారమే. సూర్యదర్శనముకాఁగానే తామరపువ్వు వికసించినట్లు వానిని దర్శించినంతమాత్రమున బుద్ధి వికసించును. కొండజలవలె గవిత్వము పుట్టుకొనివచ్చును. అతనిని సందర్శించిన మాత్రమున దారిద్ర్యము పటాపంచలై పోవును"

ఆ పండితులమాటలు వినినతోడనే కాళిదాసుఁడు "బంగారు పళ్లెరమునకైనను గోడచేరు వుండవలెనుగదా? అట్లే నా విద్యయు మహాపురుషు నాశ్రయించినంగాని శోభించదు. లత వ్యాపించి పుష్పించుటకు మంచియాశ్రయ మేదైన నుండవలయును. కవితాలతకు గూడ నట్టి యాశ్రయము కావలయును. అది లేనినాఁడు శోభింపదు. ఆ యాశ్రయము గొప్పది కావలయును. "నీచాశ్రయిం న కర్తవ్యం కర్తవ్యం మహదాశ్రయం" నీచుల నాశ్రయింపఁగూడదు. గొప్పవాని నాశ్రయింపవలె నను నార్యోక్తినిబట్టి నేఁటికాలమున జగత్ప్రసిద్ధుఁడై విద్వజ్జనులను సత్కరించుచున్న భోజమహారాజు నాశ్రయించెద" నని నిశ్చయించి ధారానగరమునకుఁ బోయెను.

ఆ కాలమున భోజుని యాస్థానమందు బుద్ధిమంతులు, కవితా ప్రవీణులు, సాహిత్య చక్రవర్తులు నగు ముగ్గురు పండితు లుండిరి. వారి కనర్గళమైన కవితాధార కలదు. అసాధారణమైనబుద్ధిసంపద కలదు. కాని, "యాచకో యాచక శ్శత్రుః" అనునార్యోక్తినిబట్టి భోజరాజును సందర్శించుట కేపండితకవులు వచ్చినను వారియందు రాజునకు గౌరవభావము గలుగునేమో యని శంకించి మత్సరము బూని వారికి రాజసందర్శనము గాకుండ జేయుచుందురు. అందులో మొదటివాఁ డేకసంతగ్రాహి. అనఁగా నేశ్లోకమైన నొకసారి విన్నపక్షమున నది చిరకాలముక్రిందటఁ దనకువచ్చిన ప్రాతశ్లోకమును జదివినట్లే గడగడ కంఠపాఠముగఁ జదువును. రెండవవాఁడు ద్విసంతగ్రాహి. అనగా రెండుసార్లు చదివిన నతనికి శ్లోకమువచ్చెడిది. మూఁడవవాఁడు త్రిసంత గ్రాహి. అనఁగా మూఁడుసార్లు చదివినపక్షమున నతనికి శ్లోకము కంఠపాఠముగ వచ్చెడిది. వీరు ముగ్గురు మిక్కిలి నైకమత్యము గలిగి యుండిరి. ఏ కవియైన మహారాజును దర్శింపగోరి ముందుగా వారి యాస్థాన కవులం జూచుట మంచిదని వారికడకుఁ బోయినపక్షమున వారు

ముప్పుడు క్రొత్తగావచ్చిన కవినిజూచి "ఏదీ! మీరు చెప్పినశ్లోక మొకటి చదువండి–విందము" అని యడుగుచుండును. వారేమో తనకు మహోపకారము సేయఁగలరని గంపెడాసపెట్టుకొని యాకవీశ్వరుఁడు తాను రచియించినశ్లోకములందెల్ల మిక్కిలి హృదయంగమమై రసవంతమైన శ్లోక మొకటిచదివి వినిపించుచుండును. ఒకసారి వినఁగానే యేకసంతగ్రాహి కెట్టిశ్లోకమైన వచ్చునుగనుక "అయ్యో! ఇది పూర్వమున్నశ్లోక మేనండి! మీరు చేసినారని చెప్పుచున్నారేమిటి?" యని యతఁడా శ్లోకమును మరలఁ జదువును. శ్లోకకర్తయు నేకసంతగ్రాహియు జదినతోడనే ద్విసంతగ్రాహి "ఔనండి! ఇది పూర్వశ్లోకమే" యని తానుగూడ జదువును. మూఁడుసార్లు వినుటచేత వెంటనే త్రిసంతగ్రాహి "ఇది మా నాన్నగారు చదువుచుండఁగా నా చిన్నప్పుడు నేను విని వల్లించితి" నని తాను చదువును. అప్పుడాకవీశ్వరుఁడు నిర్విణ్ణుఁడై సిగ్గుపడి రాజదర్శనము చేయకుండఁగనే స్వగృహమునకు మరలిపోవుచుండును. ఇట్లు కొంతకాలము జరుగుటచే రాజాస్థానమునకు నూతన కవులు వచ్చుట మానిరి. భోజరాజు కవిత్రయమును జూచి "ఏమి! మునుపటివలె మన యాస్థానమునకు సత్కవీశ్వరులు వచ్చుటలేదని పలుమా రడుగఁజొచ్చెను ఆ కవిత్రయము తమలోదాము ముసిముసి నవ్వులు నవ్వుకొని "దేవా! దిగ్గజంబులవంటి పండితులు, మహాకవీశ్వరులు మీ ముందర నిలువఁజాలరు. కవిత్వముఁజెప్పి మిమ్ము మెప్పించుట చతుర్ముఖములుగల బ్రహ్మకైనను నలవిగాదు. అందుచేత వారు తమ ప్రజ్ఞావిహీనత సభలో వెల్లడియగునని భయముచే వచ్చుటలేదు" అని ప్రత్యుత్తర మిచ్చుచుండిరి. మహారాజునకీకృత్రిమస్వభావ మెంతమాత్రముఁ దెలియలేదు.

రాజస్థానములయందును, రాజాంతఃపురములయందును, గల వైచిత్రములు వర్ణనాతీతములుగదా! సేవకులలో సేవకులకుఁ బండితు

లలో బండితులకు, నుద్యోగులలో నుద్యోగులకు నెడ తెగక పరస్పర మాత్సర్యభావముండును. అందుచేత ననేకములైన యనర్థములు పొటిల్లు చుండును.

ఆస్థానమందలి స్థితిగతు లీవిధముగానుండఁగా భూపాల సందర్శనార్థమై కాళిదాసుఁ డరిగి తక్కిన కవులవలెనే యాస్థానకవులంజూచి నమస్కరించివచ్చుట సముచితమని భావించి యా ముగ్గురు నొకచోట నుండఁగా వారికడకుఁ బోయి భక్తియు వినయంబును గనుపడున నమస్కరించి వారి యాశీర్వాదములు బడసి తాను కొంచెము కవిత్వము జెప్పఁగలిగినట్లు వారికిఁ దెలిపి రాజ సందర్శనము జేయింపుమని కోరెను. "ఏదీ! నీవు చెప్పిన శ్లోక మొకటి చదువు" మని వా రడిగిరి. వారు ముగ్గురుఁగలిసి కట్టుచున్న భాగవతమంతయు నంతకుమును పే కాళిదాసుఁడు బహుజనంబులవలన విని యుండుటచే రసవంతమైన శ్లోక మేదేని జెప్పినపక్షమున నది యదివఱకేయున్న దని వారు తన్నెగతాళి చేయుదురని తెలిసి వారి కన్నులలో దుమ్ముగొట్టుటకై వెఱ్ఱిమొఱ్ఱిశ్లోక మొకటి రచియించి యిట్లు చదివెను.

శ్లో॥ అస్థివ ద్బకవ చ్చైవ చల్లవ త్తెల్లకుక్కవత్,
రాజతే భోజ తే కీర్తిః పున స్సన్యాసిదంతవత్.

తా॥ ఓ భోజరాజా! నీ కీర్తి యెముకవలెను, కొంగవలెను, మజ్జిగవలెను, తెల్లకుక్కవలెను, సన్యాసిదంతమువలెను దెల్లగానున్నది.

అసకతవక మాటలతో నిండిన యా శ్లోకము వినఁగానే వారు విఱుసవ్వునవ్వి "శ్లోకము మిక్కిలి రసవంతముగా నున్నది. రేపుదయమున రాజసందర్శనము చేయించెదము రండి" యని యతనిం బొమ్మనిరి. కొంగవాకిట మండమువేసినట్లు కాళిదాసుఁడు తన కేమియు రానట్లు నటించి వారి గర్వభంజనము చేయఁదలంచెను. తర్వాతఁ గవిత్రయ మిట్లాలోచించెను. "ఏఁడేదో వట్టి వెఱ్ఱిముండకొడుకువలెనున్నాఁడు.

రాజు కవులను నా యాస్థానమునకుఁ దీసికొనిరాలేమని మనల నడుగు చున్నాఁడుగదా? ఈ నిర్భాగ్యునిఁ దీసికొనిపోయితిమా వీని కవిత్వము విని యసహ్యపడి లోకమునం దందఱు నిట్టిమూర్ఖులే యని తలంచి క్రొత్తకవులను దీసికొనిరమ్మనఁడు—మనము జీవించియున్నంతకాలము మన యందు గౌరవ మట్లే యుండును" అని తలపోసి సంతుష్టాంతరంగులై మఱునాఁ డుదయమున రాజాస్థానమునకుఁ బోయిరి. కాళిదాసుఁడు ప్రాతశాలువయొకటి తలకుఁజుట్టుకొని నిరాడంబరవేషముతో రాజసభఁ బ్రవేశించి నొకమూల నొదిగి కూర్చుండెను. కవిత్రయములో మొట్టమొదటివాఁడు కాళిదాసును మహీపాలునకుఁజూపి "ఇతఁడు గౌడదేశీయుఁడు. పండితకవి. దేవరవారిమీఁద రసవంతమైన కవిత్వము చెప్పినాఁడట సావధానచిత్తులరై వినవలయు" నని చెప్పెను. "రచియించిన శ్లోక మొకటి చదువు" మని మహారాజు జానతిచ్చెను. అప్పుడు కాళిదాసుఁడు తాను వెనుకటిదినమునఁ గవులయెదుట జెప్పిన నెట్టిమొట్టి శ్లోకముఁ జదువక కవిత్రయ ములికిపడునట్లు, సభాసదు లాశ్చర్యపడునట్లు, భోజమహారాజ మనఃపుండరీకము వికసించునట్లు, నిరుపమానధారా పరిపూర్ణములై, కఠినాక్షర ద్విత్వాక్షర దుర్ఘట సమాసయుక్తములైన శ్లోకముల నీ క్రిందివిధమునఁ జదివెను.

శ్లో॥ వాళ్ళాచ్చేద్ధ్వజదగ్ధతోద్వధిపతిః కుత్ఛేత్ఛజానిర్గణో
ద్ఘోరాదాహుమురస్సరే మురుతిరగ్త్రవేయకంభాసరం
ఉడ్డీడ్డప్రజ్ఞరకాస్థిత్రక్రిద్భగిథే డార్ఢాభిజిరాచ్ఛాదన
సస్యాజంబును దంబుదాళిగళను గ్ధో ముదేవో మృడః

రెండవశ్లోకము—

శ్లో॥ షడ్జా మడ్జ ఖరాడ్జ పీడ్జ వసుధా జ్జాలాంశ్చమజ్ఞా ఖరే
జడ్జట్కిటిక్కి ధరాడ్ఢకే మ్మనఘనః ఖజ్ఞోతనీడ్యక్ర్భమా

విఘ్నాలుద్ఘమలుట్ప్యయట్ర్యపదాడడ్గిడ్గిడడ్గిడ్గిహా
పాదా కేట్ట్పటట్ట్పట్ట్పటరసత్ప్లఖ్యాటసఖ్యోదయః

మూఁడవశ్లోకము—

శ్లో॥ ద్వ్యత్యేద్ధ్వజవిద్ధ్వతా ద్రిరఘుధగ్ధరత్ర పరీడిశ్వాసృ
ద్రక్షుక్షు ప్రేక్షిణపేర్దనుర్ద్రుగిఘ్రద్ఘత్కటభద్వ్రదమేట్
దేవేడీడితపత్పునాతువిగహేదారుద్ధయూవాడ్వరా
ట్స్వార్ద్వృద్ధ గ్బహురుద్రిపాస్యుదుపఘ్రజ్మద్వరద్వృభుః.

నాల్గవశ్లోకము—

శ్లో॥ తిగ్మత్విత్విత్విరుడ్స్వద్భృగ్వ్యగదభృత్కోద్భుక్షుగజ్బాక్షియు
గ్వుట్ఫ్యోట్స్ఫణిరాట్ఫయేద్ధృతమహేభృద్రాభ్మాహాచక్రవాట్
పాయాన్నో ఘుధగంబుము గ్ఘనరుచిర్ద్బద్ధ్వద్యజ్ఞోష్మవి
ద్బక్తాభీష్టదకామధుగ్బ్భవ నసుద్బ్రహ్మాండరక్షీవిరాట్.

అయిదవశ్లోకము—

శ్లో॥ ఖండాలేడ్ద్వీడనీలకాండవినుతో పిట్ఖండకాండోన్నృషే
ట్ఖండః కాండజకాండ కాండ ధరజిద్భట్ఖండచూడామణిః
ఖండాలాస్య షడాస్య సేవ్యచరణం సౌఖ్యం శివ స్సాదరం
దద్యా దద్య సకాండకాండ దగశత్క్యుట్ఖండలీట్ఖండలీ.

ఈ శ్లోకపంచకము గాళిదాసుఁడు చదివినతోడనే భోజరాజ మహైశ్వర్యభరితుఁ డయ్యెను. కవిత్రయములో నేకసంతగ్రాహి యగు మొదటికవికి నించుక నత్తియుండుటచే మిక్కిలి కఠినాక్షరములతోఁ గూడిన యాశ్లోకముల నతఁడు ధారణచేయలేకపోయెను. ద్విసంతగ్రాహికి రెండుసార్లు శ్లోకము వినఁబడకపోవుటచే నది కంఠపాఠముగ రాలేదు. అందుచేత, త్రిసంతగ్రాహి నోరెత్తక యూరకుండెను. ఈ విధముగా నిపుణముగా వారి ముగ్గురినోళ్లడఁచి కాళిదాసమహాకవి దేవీవరప్రసాద జనితమైన యఖండకవితాధార సెలయేటివలెఁ దన ముఖగహ్వరమునుండి

బైలు దేఱ ద్రాక్షారసమధురంబులై. మనోహరశబ్దగుంభనలు గలిగి గంభీరభావముగల శ్లోకములతో భోజమహారాజును స్తోత్రము చేయఁ దలంచి యాతనికీర్తి నిత్తెఱంగున వర్ణించెను :

శ్లో॥ మహారాజ, శ్రీమన్, జగతి యశసా తే ధవళితే
పయఃపారావారం పరమపురుషోయంమృగయతే
కపర్దీ కైలాసం కరివర మభౌమం కులిశభృద్
కళానాథం రాహుః కమలభవనోహంస మధునా.

తా॥ శ్రీమంతుఁడైన యోమహారాజా! నీకీర్తిచేత జగమంతయుఁ దెల్లబడిపోయెను, అన్నిసముద్రములు తెల్లబడుటచే శ్రీమన్నారాయణుఁడు తనకు నెలవైనపాలసముద్రమేదో తెలియక వెదకికొనుచున్నాఁడు. అట్లే కొండలన్నియుఁ దెల్లబడుటచే శివుఁడు వెండికొండను, నేనుఁగు లన్నియుఁ దెల్లబడుటచే నింద్రుఁడు తనయైరావతమును, గ్రహము లన్నియుఁ దెల్లబడుటచే రాహువు చంద్రునిఁ, బక్షులన్నియుఁ దెల్లబడుటచే బ్రహ్మదేవుఁడు తనహంసనుగురుతుపట్టజాలక వెదకులాడుచున్నారు.

ఈశ్లోకమువినఁగానె భోజభూపాలుఁడు మితిలేని యానందమున నుర్వశత్వముఁజెంది యంతకుమునుపు తూర్పుదిక్కునకు మొగమై కూర్చున్నవాఁడు గిరుక్కునదక్షిణదిక్కునకు మొగముద్రిప్పికూర్చుండెను. తనశ్లోకమురసవంతముగా లేకపోవుటయే మహారాజు పెడమొగము బెట్టనని శంకించి కాళిదాసుఁడు మొదటిదానికన్న నెక్కుడురసముగల శ్లోకముఁజెప్పి రాజును మెప్పింపవలముననిఁ యీక్రింది విధముగానతని యశస్సు వర్ణించెను—

శ్లో॥ నీరక్షీ రే గృహీత్వా నఖిలఖగతతీ ర్యాతి నాళీకజన్మా
తక్రం ధృత్వా తు సర్వానటతి జలనిధీం శ్చక్రపాణిర్ముకుంద
సర్వా నుత్తుంగశైలా న్దహతి పశుపతిః ఫాలనేత్రేణ పశ్యన్
వ్యాప్తా త్వత్కీర్తికాంతా త్రిజగతి నృపతే భోజరాజక్షితీంద్ర

తా॥ హంసలు నీరక్షీరములను విభాగము చేయును. కావున బ్రహ్మదేవుఁడు తనహంసను బట్టుకొనుటకై పాలు, నీళ్లు చేతఁబట్టుకొని బైలుదేఱుచున్నాఁడు. చల్లమక్క వేయఁగానే పాలు లోఁగొనును గావున మజ్జిగ చేతఁబట్టుకొని తన పాలసముద్రమును గను గొనుటకై నారాయణుఁడు తిరుగుచున్నాఁడు.

శివుఁడు తన వెండికొండను గనుఁగొనుటకై గొప్ప పర్వతముల నన్నిఁటికి దన మూఁడవకన్ను దెఱచి భస్మము చేయుచున్నాఁడు. నీ కీర్తికాంత మూఁడులోకములయందు వ్యాపించుటచేతఁ బ్రపంచ మిట్లు సంక్షోభము జెందుచున్నదిసుమా ఓ భోజరాజా!

ఈ శ్లోకము కర్ణగోచర మగుటయు రాజు మహానందమగ్నుఁడై దక్షిణదిక్కునుండి మరలి పశ్చిమాభిముఖుఁడయ్యెను. ఈ శ్లోకముగూడ రాజునకు రుచింపలేదుగాబోలు నని తలంచి కాళిదాసుఁడు దానికన్న రసవత్తరమైనదానిం జెప్ప నమకట్టి మరల నాతని యశస్సు నిట్లు వర్ణించెను:

శ్లో॥ విద్వద్రాజశిఖామణే, తులయితుం ధాతా త్వదీయం యశః
కైలాసంచ నిరీక్ష్య తత్ర లఘుతాం, నిక్షిప్తవాన్ పూర్తయే
ఉక్షాణం, తదుప ర్యుమాసహచరం, తన్మూర్ధ్ని గంగాజలం,
తస్యాగ్రే ఫణిపుంగవం, తదుపరి స్ఫారం సుధాదీధితిమ్.

తా॥ పండితుఁడైన యోమహారాజా! నీ కీర్తిని బ్రహ్మదేవుఁడు తక్కెడలోఁబెట్టి తూచఁదలచి యొక సిబ్బిలో నీ కీర్తిని బెట్టి, రెండవ సిబ్బిలోఁ గైలాసపర్వతము నునిచి యది తేలికగా నుండుటచే నీ కీర్తితో దానిని సమానము చేయఁదలఁచి భారపూర్తికై దానిపై నెద్దు నెక్కించి యప్పటికిని వెండికొండ కీర్తితో సరిపోవకపోవుటచే

తూనిక సరిపుచ్చుట కెద్దుపై శివుని నెక్కించి, నతనిశిరస్సుపై గంగను నిలిపి యింకను తూనిక సరిపోవకపోవుటచే నతని తలమీఁద వేయి శిరస్సులుగల యాదిశేషువును నిలిపి యప్పుడును సరిపోవకపోవుటచే నాపైఁ జంద్రుని నిలిపెను. అప్పుడును నీ కీర్తియే బరువయ్యెను.

ఈ శ్లోకము చెవినిబడినతోడనే భోజభూజాని పశ్చిమదిక్కునుండి మరలి యుత్తరదిక్కునకభిముఖుఁడై కూర్చుండెను. కాళిదాసుఁడు రాజునకుఁ దానంతవఱకుఁ జెప్పిన శ్లోకత్రయము మనోరంజకముగా నుండలే దని యాతని యశంబు వర్ణించుచు నీ క్రిందిశ్లోకము జెప్పెను:

శ్లో॥ స్వర్గాద్గోపాల, కుత్ర వ్రజసి ? సురమునే భూతలే కామధేనో
ర్వత్సస్యానేతుకామ స్తృణచయ మధునా ముగ్ధదుగ్ధం నతస్యాః ?
శ్రుత్వా శ్రీభోజరాజప్రచురవితరణం వ్రీడశుష్కస్తనీ సా
వ్యర్థోహ స్యాత్ ప్రయాస స్తదపి తదరిభిశ్చర్వితం సర్వముర్వ్యాం.

ఈ శ్లోకమునందు స్వర్గవాసియైన గొల్లవానికిని నారదునికిని సంభాషణ జరిగినట్లున్నది.

నారదుఁడు : "ఓయి గొల్లవాఁడా ! స్వర్గమునుండి యెక్కడికి బోవుచున్నావు ?

గొల్లవాఁడు : ఓ దేవమునీ! కామధేనువుయొక్క దూడకు గడ్డి తేవలెనని భూలోకమునకుఁ బోవుచున్నాను.

నారద : ఓ వెఱ్ఱివాఁడా ! తల్లిదగ్గఱ పాలులేవా ?

గొల్ల : శ్రీభోజమహారాజుయొక్క జగత్ప్రసిద్ధమైన వితరణము విని కామధేనువు సిగ్గుపడఁగా దాని పొదు గెండిపోయెను.

నారద : నీ ప్రయాసము వ్యర్థము. భూలోకము గడ్డిలేదు. ఏలయన ! భోజరాజు శత్రువులే యా గడ్డినంతయు నమిలిరి.

ఈశ్లోకచతుష్టయము నాకర్ణించి భోజరాజు బ్రహ్మానందభరిత స్వాంతుండై సింహాసనముదిగి కాళిదాస మహాకవి చరణారవిందములకు దండప్రణామ మాచరించి చేతులు జోడించి యిట్లనియె—"కవీంద్రా! రసము చిలుకుచున్న యీ నాలుగుశ్లోకములకు నా రాజ్యమునందు నాలుగుదిక్కులును నీకిచ్చివేసితిని. నీవు కవిరాజువేగాక రాజువుకూడ నైతివి కాబట్టి యీ రాజ్య మేలుకొనుము. నేను శ్రీ కాశికానగరము నకుం బోయివిశ్వేశ్వరధ్యానపరాయణుండనై గంగాతీరమునఁ గాలముఁ గడిపెదను" అని బైలుదేఱంబోవుచుండ నప్పుడు కాళిదాసుఁడు "దేవా! ఇది ధర్మమా? సింహాసనము మీది, దర్భాసనము మాది భూమండలము మీది, కమండలము మాది. రత్నగర్భలు మీవి. దర్భలు మావి. మహీమండల పరిపాలనము మూర్ధాభిషిక్తులగు మహారాజులకుం జెల్లుగాని శమదమసంపత్తిగల బ్రాహ్మణులకుఁ జెల్లునా? శ్లోకములతో లోకముల నేలజాలుదుమా? గంటము పట్టగలముగాని, ఖడ్గముబట్టఁగలమా? శాస్త్రములేగాని, శస్త్రములుమాస్వాధీనములా? కావున మీరే వసుంధరా పరిపాలనము జేసి మా బోంట్లను రక్షింప వలయునని ప్రార్థించుచున్నాఁడ" నని వినయమున విన్నవించెను. మంత్రులు, సామంతులు, తక్కిన సభాసదులు మహారాజుముందర నిలిచి రాజ్యస్వీకారము చేయవలయు నని కోరిరి. అప్పుడు రాజు "కాళిదాసునకు రాజ్యమంతయు నిచ్చితినే మరల నే నెట్లు గ్రహింప గలుగుదు?" నని వారితోఁ బలుక వారందఱు నేకగ్రీవముగా కాళిదాసునకు విశేషధనమిచ్చి రాజ్యము మరల మీరు క్రయమునకు బుచ్చుకొనుఁడు. దానితో నాదోషముశమించు" నని హితోపదేశము చేసిరి. అది యుక్తముగా నున్నదని యంగీకరించి రాజు కాళిదాసునకు ధనకనకవస్తువాహనంబులు విరివిగా నిచ్చి దన యాస్థాన కవీశ్వరులలో నగ్రగణ్యుఁడుగ నుండవలసినదని యాతనిం గోరెను.

కాళిదాసున కట్టియ మేయగౌరవము జరుగుటవలన నాస్థాన కవిత్రయమునకు మితిలేని యసూయజనించెను అందుచేత వారిలోవారు కూడబలుకొని భోజుని యెట్టయెదుట నిలిచి కాళిదాసుని గర్వభంజనము చేయఁదలఁచి యిట్లనిరి—"మహారాజా! ఈ కాళిదాసు దేవరవారిమీఁద స్తోత్రపూర్వకముగాఁ జదివిన 'మహారాజా, శ్రీమాన్' అను శ్లోకము మొదలుకొని నాలుగుశ్లోకములు కాళిదాస విరచితములు కావు. పూర్వమహాకవికృతములు. అవి విక్రమార్కునిమీఁద నే మహాకవియో చెప్పఁగా వాటినిసంగ్రహించి, కాళిదాసుఁడు పూర్వరాజు పేరు తీసివైచి మీ పేరుచేర్చి పఠించెను. ఈ శ్లోకములు కంఠపాఠముగా మాకు వచ్చును. పరగ్రంథచోరుఁడైన యీ పండితుని మహాకవీశ్వరుఁడని కడుంగడుగౌరవించి చిరకాలమునుండి మీ యాస్థానమునుండి సకలదేశ ప్రఖ్యాతులమై, సాహిత్యచక్రవర్తులమై, కవిసార్వభౌములమైన మమ్ము నిరసించుట దేవరవారివంటి విద్వత్ప్రభువులకు భావ్యముకాదు" అని విన్నవింప దండతాడితమైన మహాసర్పమువలె లేచి కాళిదాసుఁడు భోజమహీపాలునితో నిట్లనియె—"రాజేంద్రా! ఈ పండితులు కవితామండితులయ్యు మీ చేత దండితులుగానర్హులు. ఏలయందురా! వీరిలో నొకఁ డేకసంతగ్రాహి, రెండవవాఁడు ద్విసంతగ్రాహి మూఁడవవాఁడు త్రిసంతగ్రాహి. అందుచేత నెవ రేక్రొత్త పద్యము చేసికొని వచ్చినను నిది పూర్వమున్నదే యని తక్షణమే బుద్ధివైభవముచేత నప్పుడే చదివి యనేక పండితులను, విద్వత్కవులను, మీ దర్శనము చేయింపకయే వచ్చినవారిని వచ్చినట్లు బంపుచువచ్చిరి. ఎంతోమంది వీరి మాయలలోఁబడి మీ దర్శనముగాక యుస్సురనుచుఁ బోయిరి. నాకుమాత్రము మీ దర్శనమగునా! మాలిన్యము మాలిన్యముచేతనే శుద్ధియగునట్లు మాయ మాయచేతనే జయింపవలెనని, నేనేమియు నెరని పరమమూర్ఖునివలె వీరికడకుఁబోయి దర్శనముచేసి యొక్క వెట్టిమొట్టి

శ్లోకము రచియించి మీ దర్శనము చేయింపుమంటిని ” అని, ‘అస్థివత్ బకవత్’ అను శ్లోకము చదివి సభవారందఱిని నవ్వించి కాళిదాసు మఱియు నిట్లనియె—“ఆశ్లోకమువిని వీఁడు పరమమూర్ఖుఁడు. వీని వంటివానిని దీసికొనిపోయినచో రాజు తనకడ కింతటినుంచి కవీశ్వరులను దీసికొనిరమ్మనఁడు. బాగున్న దని వారిలోవా రాలోచించుకొని నాకు మీ దర్శనము చేయించిరి. నేను మీ దర్శనము చేసినతోడనే వీరు ధారణచేయుటకు వీలులేని కఠినాక్షరములతో మొదటిశ్లోకమును జెప్పితిని. ఇందులో నేకసంతగ్రాహికి నత్తి. అందుచేత నతఁడు కఠినాక్షరపూరితములైన యీ శ్లోకములను జ్ఞాపకముంచుకొని చదువలేకపోయెను. వానికి రాకపోవుటచేఁ దక్కిన యిద్దఱికి వచ్చినవి కావు. కాఁబట్టి యీ శ్లోకములను విడిచి ధారణచేయుటకు సులభములైన ‘మహారాజ, శ్రీమన్’ అను శ్లోకము మొదలుకొని నాలుగు శ్లోకములను ధారణచేసి పూర్వకవి విరచితములని నా కవమానము సంఘటింపఁ దలఁచుచున్నారు. ‘వినాశకాలే విపరీతబుద్ధిః’ అనునట్లు వీరికిఁ జెడుకాలము వచ్చుటచే నిట్టిబుద్ధులు పుట్టినవి. ఈ రహస్యమెఱుంగక దేవరవారు పయోముఖ విషకుంభములు, గోముఖ వ్యాఘ్రంబులు ననఁదగు వీరిని సత్కవులని, సత్పురుషులని గౌరవించి మాన్యములిచ్చి పోషించుచున్నారు” అని గంభీరస్వరముతో రాజున కభిముఖుఁడై విన్నవింప సభాసదులు వారి దౌర్జన్యమును విని ఛీ ఛీ యనిరి. మహారాజు కవిత్రయమును గట్టిగా మందలించి నాఁడు మొదలుకొని యట్టి దుష్కార్యము నెన్నఁడైన మరలఁ జేసినపక్షమున నాస్థానమునుండి వెడలఁగొట్టుదునని చెప్పి యీ తప్పు సైరించెను. కవులును తమ గుట్టు బట్టబయలగుటచే సిగ్గుపడి మాఱుమాటాడక తలవంచుకొని యూరకుండిరి.

నాఁటినుండియు భోజరాజు కాళిదాసును దన యాశ్రితునిగాఁ గాక పరమగురువుగా, నాప్తమిత్రునిగా, భావించుచు, వీరికిరువురకు

నిశేహములు రెండుగాని శరీరమొక్కటేయని లోకులు భావించునట్లు పరస్పరప్రేమగలిగి మెలఁగుచుండెను. కాళిదాసుమాట ప్రతి విషయమున నతఁడు శిరసావహించుచుండెను. అతని యాలోచనములేక యతఁడేకార్యమును చేయఁడయ్యెను.

## త్వమేవాహమ్

భోజుని యాస్థానమందలి కవులలో దండి, భవభూతి, శంకరులను మువ్వురు నిరంతరము కాళిదాసునితో స్పర్థగలిగి యున్నట్లు లోకమునందనేకకథలు గలవు. ఏకసంతగ్రాహి, ద్విసంతగ్రాహి, త్రిసంతగ్రాహులు కూడ వారు మువ్వురేయని ప్రతీతికలదు. కాళిదాసునకును వీరు ముగ్గురికిని దఱుచుగా శాస్త్రచర్చలు జరుగుచువచ్చెను. అందొకసారి కాళిదాసు గెల్చుటయు, మఱియొకసారి యా పండితులు గెల్చుటయు సంభవించుచుండెను. కాళిదాసుఁడే యందఱికంటె గొప్పవాఁడని కొందఱును, దండిభవభూతిశంకరులే గొప్పవారని మఱికొందఱును బలుకఁజొచ్చిరి. ఒకనాఁడు భోజమహారాజు విద్వజ్జనంబులు, మహాకవులు, మంత్రిసామంతులు, బంధుమిత్రులు, పరివారజనము పరివేష్టించి నిండుకొలువుండ నచ్చటసీవిషయమైన వివాదము ప్రబలెను ఈవిషయమై మనుష్యమాత్రులెవ్వరు నిదమిద్ధమని చెప్పఁజాలరనియు' విద్యాధిదేవతయైన శ్రీ సరస్వతీదేవియే నిర్ణయించుట కర్హురాలనియు సభాసదులైన పండితులు పలికిరి, అప్పుడు కాళిదాసు తన ప్రభావముచేత సరస్వతీదేవి నావాహనముచేసి "తల్లీ! మా తారతమ్యములు చెప్పి యీ వివాదము నీవే పరిష్కరింపఁదగుదు" వని ప్రార్థించెను. అప్పుడు సభలో నొక శబ్దము వినఁబడెను. సరస్వతీదేవి

సభాసదులకుఁ గనఁబడకుండ మాటలాడఁజొచ్చెను. ఆమె యీ తెలుంగునఁ బలికెను,

"కవి ర్దండీ కవిర్దండీ భవభూతిస్తు పండితః"

తా! దండియే కవి!దండియే కవి భవభూతియన్నచో పండితుఁడు

అని శ్లోకములో సగముచెప్పి శారదాదేవి నిమేషమాత్ర మూరకుండెను దండి కవియనియు భవభూతి పండితుడనియు జెప్పి కాళిదాసునిమాట యంతమాత్ర మెత్తక యామె యూరకుండుటచే గాళిదాసుఁడు కవియుఁగాడని పండితుఁడుఁగాఁడని శత్రుపక్షమువారు పరిహాససూచకమైననవ్వులు నవ్విరి.అప్పుడు కాళిదాసుఁడు రోషారుణిత లోచనుఁడై సరస్వతీదేవి నుద్దేశించి,, కోహం రండే ,, నేనెవరే ముండా యని యఱుముటిమినట్లు పలికెను. అప్పుడా యశరీరవాణి "త్వమే వాహం త్వమేవాహం న సంశయః" అని ప్రత్యుత్తరమిచ్చెను. అనఁగా "నీవే నేను నేనే నీవు. సంశయములే" దని ప్రత్యుత్తర మిచ్చెను. ఇదియంతయు నీ క్రిందశ్లోకమైనది.

శ్లో॥ కవి ర్దండీ కవిర్దండీ భవభూతిస్తు పండితః ;
కోహంరండే ? త్వమేవాహం త్వమేవాహం న సంశయః

బ్రహ్మదేవుని పట్టపురాణియు, సకల విద్యాధిదేవతయు నైన వాణి యశరీరవాణియై " నేనే నీ " వని యెల్లవారు వినుచుండి నుచ్చై స్స్వరముతోఁ బలుకుటచే సభాస్థానులును, భోజమహీపాలుఁడును, మహాశ్చర్యమునొంది కాళిదాసుయొక్క ప్రభావమును, నిరవధిక పాండిత్యమును మిక్కిలి ప్రశంసించిరి. దండిభవభూతులచండగర్వ మణఁగెను. సరస్వతి శంకరునిమాటయైన నెత్తిగొనలేదు.

## కాళిదాసుని బుద్ధికుశలత

బాణుఁడను నొక మహాకవి కలఁడు. ఇతఁడు సరస్వతీదేవికిఁ గేవలము పంచ బాణుఁడే యని జయదేవ మహాకవి చెప్పియున్నాఁడు. "బాణోచ్ఛిష్టం జగత్సర్వ" మని యీ మహాకవినిగూర్చి యొక లోకోక్తి కలదు. అనఁగా లోకమంతయు బాణుని యెంగిలియే యని దీని యర్థము. బాణకవి యుపయోగింపని శబ్దముగాని, ప్రయోగింపని యలంకారముగాని, కూర్పని సమాసముగాని, చెప్పని భావముగాని లోకమున లేదనియు, నేకవి యే యే రసములు జూపినను, నెట్టికావ్యము రచించినను, నెట్టి శబ్దము ప్రయోగించినను నవియన్నియు బాణకవి వాడినవే యగుటచేతఁ దక్కిన కవులుపయోగించిన శబ్దప్రపంచమంతయు బాణుని యెంగిలియేయనియు విద్వాంసులు భావించుచుందురు. పండితలోకమునకు బాణునియం దట్టి గౌరవము కలదు. అతఁడు కాదంబరీ, హర్షచరిత్రలను రెండు వచన కావ్యములను మాత్రమే రచియించెను. మొదటిది కల్పితకథ. రెండవది హర్షమహారాజుయొక్క చరిత్ర. చేసినవి వచకావ్యములైనను, బాణుఁడు గొప్పగొప్ప పద్యకావ్యములు, నాటకములు, మహాప్రబంధములు రచియించిన మహాకవీశ్వరులతోఁబాటు కవిసార్వభౌముఁడని ప్రఖ్యాతి గాంచెను. అందు కాదంబరి మిక్కిలి రసవంతమైనది. ఎట్టి మహాకవి కైనఁ దాను రచియించిన కావ్యము తన కింపుగానేయుండును. అది సరసులైన కవిపండితులువిని భళీయని మెచ్చినప్పుడే దానియందు గుణములున్నవని గ్రంథకర్త తలంపవలయుఁ గావున బాణుఁడు తాను నిర్మించిన కాదంబరీ మహాకావ్యమును లోకప్రఖ్యాతకవీశ్వరుఁడైన కాళిదాసునకు వినిపించి యతని యభిప్రాయము గ్రహించుట మంచిదని తలంచి కాళిదాసునకుఁ జదివి వినిపింపుమని యా గ్రంథము తన శిష్యులచేతఁ బంపెను.

శిష్యులు గురుని యాజ్ఞానుసారముగా కాదంబరీ మహా కావ్యమును దీసికొని కాళిదాస సన్నిధానమున కరిగి యామూలాగ్రముగా నా గ్రంథము నతనికిఁ జదివి వినిపించిరి. అతఁడు దత్తావధానుఁడై గ్రంథమంతయు నాకర్ణించి బాణశిష్యులను జూచి "మీ గురువుగారి గ్రంథము నాకు మత్తుగలుగఁజేసినదని చెప్పుఁ" డని వర్తమానమంపెను. ఆ మాటలనే శిష్యులు బాణున కెఱిఁగించిరి. బాణుఁడప్పలుకులు విని తన గ్రంథము రసవంతముగా నుండకపోవుటచేఁ గాళిదాసునకు నిద్రమత్తు వచ్చినదికాఁబోలు ! కాళిదాసు మెచ్చనిగ్రంథము లోకమున నున్నను లేకపోయినను సమానమే. ఇట్టి పనికిమాలిన గ్రంథ మేల యని యా మహాగ్రంథమును శిష్యులు వద్దని వారించుచున్నను వినక పరశురామప్రీతి గావించెను. అంనతరము కొన్నినాళ్ళకు బాణుఁడు కాళిదాసునిఁ గలసికొని మాటలాడుచుండఁ బ్రసంగవశమున "బాణకవీ! నీకాదంబరి మిక్కిలి రసవంతముగానున్నదిసుమీ" యని ప్రశంసించి మఱియొకసారి దానిని వినవలెనని యున్నదని చెప్పెను. అప్పుడు బాణుఁడు తెల్లపోయి "అయ్యో! గ్రంథశ్రవణ మైనతరువాత నది మీకు మత్తుగలిగించిన దని మీరు నా శిష్యులతోఁ జెప్పుటచేత నది రసహీనముగా నున్నదని దాని నగ్నిహోత్రున కాహుతి జేసితిని. గ్రంథ మింక దొరకుట యరిది" యని పలికి గాఢవిషాదము నొందెను. కాళిదాసుఁడుగూడ విచారించి "అన్నన్నా! నా యభిప్రాయముఁ దెలిసికొనలేక మీరు పొరబాటుచేసితిరి. కాదంబరి యనగా, కల్లు కూడ నర్థమగుటచేఁ గాదంబరీరసము కాదంబరీరసమువలెనే మత్తు కలిగించి పరవశత్వము నొందించినదని నా యభిప్రాయముగాని, రసహీన మైనదని నాయభిప్రాయము కాదు. నీశిష్యులు సరిగాఁజెప్పలేదు కాఁబోలు? అయినను మించిపోయినదికాదు. ఆ గ్రంథమంతయు మిక్కిలి రసవంతముగా నుండుటచే వినినప్పుడ నా మనస్సుమీఁద ముద్రితమై

కంఠపాఠముగ నాకు వచ్చినది" యని మొదటినుండి చివరవఱకు నేకరువుపెట్టి వ్రాయించియిచ్చెను. అప్పుడు బాణుఁడు పరమానంద భరితుఁడయ్యెను.

భవభూతి మహాకవి యుత్తరరామచరిత్ర మను నాటకమును విద్వజ్జన ప్రశంసనీయముగా రచించి శాశ్వతకీర్తి సంపాదించెను. కావ్య నాటక నిర్మాతలలో నగ్రగణ్యుఁడైన కాళిదాసమహాకవి కది వినిపించి వాని యభిప్రాయమును జేకొనవలెనని యతఁడుగూడఁ దన శిష్యులచేత నా మహానాటకమును గాళిదాసునొద్దకుఁ బంపెను. నాటకమందలి యేడంకములను వారు మిక్కిలి జాగరూకతతో వినిపించిరి. కాళిదాసుఁ డును శ్రద్ధాళువై వినెను. విన్నతరువాత శిష్యులా గ్రంథమును దీసి కొనిపోయి మరల గురువునకు సమర్పింపఁగా భవభూతి శిష్యులంజూచి "కాళిదా సేమనియె" నని యడిగెను. "ఏమియు ననక యూరకవినె" నని శిష్యులు చెప్పిరి: "గ్రంథముమీఁద నభిప్రాయము చెప్పకపోయినను నడుమనడుమ నతనినోట వెడలినమాటలేవో చెప్పుఁ" డని యాతఁ డడిగెను. అప్పుడు వారిట్లనిరి, అయ్యా! మొదటియంకములో

శ్లో॥ కిమపి కిమపి మందం మందమాసక్తియోగా
దవిరళితకపోలం జల్పతోరక్రమేణ
అశిథిలపరిరంభవ్యాపృతైకైకదోష్ణో
రవిదితగతయామా రాత్రిరేవం వ్యరంసీత్.

అను శ్లోకమును మేము చదువుచుండగా నతఁడు తాంబూలము వైచుకొనుచుండెను. తమలపాకులకు సున్నము వ్రాయునట్టి పనికత్తెం జూచి సున్న మెక్కువైనదని యతఁడనెను. ఇంతకంటె నతఁ డేమియు మాటలాడలే" దని చెప్పిరి. ఆమాట కర్థమేమైయుండునా యని భవ భూతి చాలసేపు వితర్కించి శ్లోకముయొక్క కడపటి పాదములోనున్న "ఏవం" అనుమాటలో సున్న మధికముగా నున్నదని కాళిదాసుఁ

దభిప్రాయపడినట్లు తెలిసికొని 'ఏవం' అనుమాటలో నున్న సున్నఁ దీసివైచి 'ఏవ' అనుమాటగా మార్చి శ్లోకము సరిచేసికొనెను. ఆ మార్పుచేత శ్లోకమునకెంతో రసపుష్టి కలిగెను.

శ్లోక తాత్పర్యము : ఈ శ్లోకములో సీతారాములు గాఢాలింగనము చేసికొనినట్లు వర్ణింపఁబడినది. ఆసక్తియోగమువలనఁ జెక్కిలి చెక్కిలి యెడములేకుండఁ గలిపి యొక్రమములేకుండ మెల్లమెల్లగా నేమేమో మాటలాడుకొనుచుఁ గౌఁగిలింత విడిపోకుండ నొకరిమీఁద నొకరు చేతులువైచికొని యుండఁగాఁ దెలియకుండఁగనే జాములు గడచిపోవగా రాత్రిమాత్రమే వెళ్ళిపోయెను. అనఁగా రాత్రి వెళ్ళిపోయెనేగాని సుఖము సమాప్తము కాలేదని దీని భావము. సున్న తీసివేయుటవలన రాత్రిమాత్రమె యని యర్థమువచ్చెను.

రసవంతమైన యీ నాటకము భవభూతి నిండుకొలువులో నుండఁగా భోజమహారాజునకు వినుపించెను. మహారాజు కార్యాంతరాసక్తివలన శ్రద్ధగా వినలేదు. రసహీనమగుటచేత రాజు శ్రద్ధగా వినలేదని తలంచి, భవభూతి విచారించి, బాణుఁడు కాదంబరిని జేసినట్లే దానిని మంటఁగలిపెను.

తరువాత భోజక్షితిపాలుఁ డొకనాఁడు భవభూతిం జూచి "నీ యుత్తరరామచరిత్రము మిక్కిలి రసవంతముగా నున్నదట. ఆనాఁడు నీవు చదివినప్పుడు నేను శ్రద్ధగా వినలేదు. మరల నొకసారి వినిపింపు" మని యడిగెను. అడుగుటయు భవభూతి తాను గావించిన తెలివితక్కువపని రాజునకు విన్నవించెను. ప్రతిశ్లోకరసాస్పదమైన యుత్తమ నాటకము నిష్కారణముగా నశించిపోయెనే యని రాజును సభాసదులును విచారించుచుండఁగా, పరశ్రేయస్సహనముగలిగిన కాళిదాస మహాకవి లేచి భవభూతిశిష్యులద్వారమునఁ దన కాగ్రంథము వినిపించినప్పుడే తనకది కంఠపాఠముగా వచ్చెనని చెప్పి యెల్లవారలాశ్చర్యపడునట్లు

తానుజెప్పి వ్రాయించెనఁట మేరమీఱిన యతని మేధాశక్తి కెల్లవారు సంతసించిరి. కాళిదాసుఁడు భవభూతి ప్రణీతమైన యుత్తరరామచరిత్ర నీ క్రిందివిధముగాఁ గొనియాడెను :

శ్లో॥ కావ్యేషు నాటకేష్వేవ వయంవా వయమేవ వా
ఉత్తరేరామచరితే భవభూతి ర్విశిష్యతే.

తా॥ కావ్యములయందు నాటకములయందు మేమే పేరెన్నికఁ గన్నవారము. కాని, యుత్తరరామచరిత్రయందు భవభూతి మమ్ముఁ గూడ మించుచున్నాఁడు.

## కాళిదాసుని శాస్త్రజ్ఞానము

కాళిదాసుఁడు కొన్ని కావ్యనాటకములను జదువుకొని గట్టి సాహిత్యము సంపాదించి సరసమైనకవిత్వ మల్ల నేర్చెనేగాని, తర్కవ్యాకరణాది శాస్త్రములయందు మెచ్చదగిన పాండిత్యము లేదని యతని శత్రువులు లోకమునం దొకప్రవాదము గలిగించిరి. లోకులు కాకులవంటివారుకదా! మూర్ఖబహుళమైన యీప్రపంచమందు ముందువెనుకలు విచారింపక ప్రవాదముల నమ్ముటయే మనుష్యులకు స్వభావమై యున్నది. కావున, గాళిదాసు నెఱుఁగనివా రనేకులామాట నమ్మిరి. ప్రభాకరుఁడను నొక పండితుఁడు ప్రాభాకరమనుపేర నొక వ్యాకరణశాస్త్రమును రచియించి, కాళిదాసునకు వ్యాకరణశాస్త్రమునందు మంచిప్రవేశ మున్నదో లేదో కనుఁగొనవలె నని నిశ్చయించి తాను రచియించిన శాస్త్రములోని యొక ఘట్టములోఁ గొన్ని తాటియాకులనుదీసివైచి యా భాగమునకు ముందున్న సూత్రములయొద్ద నారంభించి కాళిదాసునొద్ద పాఠము చెప్పుకొని రమ్మని శిష్యుల నంపించెను. శిష్యులాప్రకారమే కాళిదాసుని

కడకుఁబోయి తమ గురువు గ్రామాంతరము వెళ్లెననియు తమకాదినమునఁ బాఠము జెప్పవలెననియుఁ గాళిదాసునిగోరి గురూపదేశ ప్రకారము మొదలుపెట్టిరి. కొన్ని సూత్రములు చదివినతరువాత గొంతభాగము పోవుటంజేసి సందర్భము కుదరలేదు అప్పుడు కాళిదాసుఁడు నడుము కొంతభాగము పోయినదని వారితోఁజెప్పి యాభాగము దానే పూరించెను. పూరింపబడినభాగమునుదీసికొనిపోయి శిష్యులు గురువునకుఁ జూపఁగా నతఁడు తాను రచియించినదానికంటెఁ గాళిదాసవిరచితమైన భాగమే సర్వవిధములఁ బ్రశస్తమైయుండుటంజేసి యాభాగమునే తన గ్రంథమున నిలుపుకొని తాను రచించినది పారవైచి "కాళిదాసఘట్ట"మని దానికిఁబేరుపెట్టెను. ఈ వార్త లోకములో వెల్లడియైనతరువాత కాళిదాసునకు శాస్త్రజ్ఞానము లేదన్న నమ్మిక పోయి యతఁడు సకల శాస్త్రపారంగతుఁడను నమ్మిక విద్వాంసులకుఁ గలిగెను.

నవనవ

దండి, భవభూతి, శంకర ప్రముఖులైన మహాకవులు తమకు రాజాస్థానమున మునుపటి గౌరవము లేకపోవుటంజేసి యేదేని క్రొత్తపుంతత్రొక్కి కాళిదాసుకన్న నెక్కుడు గౌరవము సంపాదింపవలెనని నిశ్చయించి చాలకాల మాలోచించి వేదమునందు ఛందోదోషములు, వ్యాకరణదోషములు కొన్ని కనఁబడు చుండుటచేత వానిని దిద్ది సంస్కరించి నిర్దుష్టము చేయఁదలఁచినట్లు భోజమహారాజునకు విన్నవించిరి. అపౌరుషేయములై, యనాదిసిద్ధములై, చతుర్ముఖుని ముఖములవలన బుట్టిన వేదములను దిద్దుట విపరీతమాయని కాళిదాసుఁడు తనలోఁ దాను నవ్వుకొని యూరకుండెను. చేతనైనచో మీరు దిద్దుఁడని చెప్పి భోజరాజు మిన్నకుండెను.

అంతట వారు తత్కార్యమునకు సుముహూర్తము నేర్పఱిచి "ఆదౌపూజ్యో గణాధిపః" యనునార్యోక్తి నిబట్టి ముందుగా విఘ్నేశ్వర పూజ చేయుచుండిరి. అప్పు డొక చిలుక సమీప వృక్షశాఖపైఁ గూర్చుండి "నవనవ" యని కూయఁదొడఁగెను. మహాకార్యము ప్రారంభించినప్పుడు పులుఁగుకూఁత దుశ్శకునమని యానాటికి వారు విరమించి మఱియొకదినమున వేదసంస్కరణమారంభించిరి. ఆ దినమునఁ గూడ వారందఱుఁ జేరఁగానే యెప్పటియట్ల శుకమువచ్చి వారి యెదుట నున్న చెట్టుమీఁదఁ గూర్చుండి "నవనవ" యని కూసెను. ఆనాఁడుగూడ వారు పనిమానిరి. కాని, ప్రతిసారియు "నవనవ" యని చిలుక కూయుట కేమికారణ మని వారు వితర్కింపఁజొచ్చిరి. దాని యర్థ మెవ్వరికిని బోధపడలేదు. మూఁడవసారికూడ దండి ప్రముఖులు చేరి వేదసంస్కరణమునకుఁ బ్రయత్నించుచుండ మరల నా పక్షి వచ్చి "నవనవ" యనియెను. అక్కడికి కాళిదాసు వచ్చి "పంచపంచ" యని యా పక్షి కుత్తరము చెప్పెను. అప్పు డాచిలుక యెగిరిపోయెను. చిలుకమాటలకుఁగాని, కాళిదాసు మాటలకుఁగాని, యర్థము దెలియక పండితులు కొట్టుకొనుచుండిరి. అప్పుడు కాళిదాసు వారి కిట్లనియె,

"అయ్యా! ఇది సాధారణమైన చిలుక కాదు. వేదములు విభాగించిన సాక్షాన్నారాయణస్వరూపుఁడగు వ్యాసుఁడు. మనపండితుల యహంభావ మణఁచుటకై యీ శుకరూపమునవచ్చెను. మనతలదన్నిన పండితులు నందఱువేలు పూర్వముండిరి. వారెవ్వరు వేదమునందు దోషములు దిద్దుటకై ప్రయత్నింపలేదు. నేటికాలమునకు మీరు బైలుదేఱి యీ విరుద్ధప్రయత్నములు చేయుచున్నారు అందుకు భగవానుఁడైన బాదరాయణుఁడు చిలుకయైవచ్చి "నవనవ" యని యడుగుచున్నాఁడు. అనఁగా మీరు తొమ్మిదివ్యాకరణములు చదివినారా యని యడుగుచున్నాఁడు. మన మైదువ్యాకరణములు మాత్రమే చదివితిమిగనుక "పంచపంచ" యని నేనుత్తరము చెప్పితిని. మనము

తొమ్మిది వ్యాకరణములు చదివిన తరువాత వేదసంస్కరణమునకుం బూనవలయును. అయిదు వ్యాకరణము చదివిన యసంపూర్ణజ్ఞానముగల మనకు వేదమున దోషములు కనుపట్టుచున్నవి. తొమ్మిది చదివినపక్షమున దోషములు కనఁబడవు. కావున మీ ప్రయత్నము విరమింపుఁడు" అని మందలింప వారందఱు మిన్నక గృహములకుఁబోయిరి.

## చకారకుక్షి

కాళిదాసు తీర్థయాత్రలు సేవించు తలంపున నయోధ్యా, హరిద్వారము, మధుర, ద్వారక మొదలగు దివ్య స్థలముల సేవించి, ప్రయాగయందలి త్రివేణీ సంగమంబున స్నానమాడి, పుణ్యరాశియైన కాశికిఁబోయెను. అచ్చట నమ్మహాకవి భాగీరథియందు స్నానమాడి, విశ్వేశ్వరస్వామిని వినుతించి, ఢుండి విఘ్నేశ్వరుని స్తుతియించి, కేశవస్వామిని సేవించి, యన్నపూర్ణాదేవియడుగులకు మ్రొక్కి, హరిశ్చంద్రుఁడు భార్యనమ్మినచోటు, వేదవ్యాసుఁడు భిక్షమెత్తినచోటు, వీక్షించి యానందించి యవిముక్తక్షేత్రముననున్న వేదవ్యాసుని విగ్రహంబునకు నమస్కరించి, దానిబొడ్డునఁ దన వ్రేలుపెట్టి 'చకారకుక్షి' యని చమత్కారముగాఁ బలికెను. కడుపునిండా చకారములున్నవని దాని యర్థము. అనఁగా బాదరాయణుఁడు సంస్కృతమున మహాభారతమును, నష్టాదశ పురాణములను రచియించినప్పుడు రెండుమూడు వస్తువులనుగాని యిద్దఱుముగ్గురు పురుషులనుగాని, చెప్పినప్పుడు "ధర్మరాజశ్చ భీమశ్చ పార్థశ్చ నకులశ్చ" యని చకారములు తరుచుగా బ్రయోగించుచు వచ్చెను. అందుచేఁ గాళిదాసుఁ డట్లాక్షేపించెను. వేదవ్యాసునకు మహాగ్రహముకలిగెను; అతని మహిమవలన గాళిదాసు

యొక్క వ్రేలు వ్యాసవిగ్రహముయొక్క బొడ్డులో నిఱికికొనిపోయి యూడిరాదయ్యెను. అప్పుడు కాళిదాసుఁడు పదునెనిమిది పురాణములు రచియించి, బ్రహ్మసూత్రములు వ్రాసి, వేదవిభాగము జేసిన నారాయణావతారుని వ్యాసమహర్షిని నిష్కారణముగా నిట్లు తూలనాడితినే యని పశ్చాత్తాపముజెంది యిట్లు వినుతించెను,

శ్లో॥ వ్యాసం వసిష్ఠనప్తారం, శక్తేః పౌత్ర మకల్మషం
పరాశరాత్మజం వందే, శుకతాతం తపోనిధిమ్.

తా॥ వసిష్ఠుని మునిమనుమఁడును, శక్తిమహాముని మనుమఁడును, పాపరహితుఁడును, పరాశరునిపుత్త్రుఁడును, శుకునితండ్రియుఁ దపోనిధియు నైన వ్యాసునకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ అచతుర్వదనో బ్రహ్మా, ద్విబాహురపరో హరిః
అఫాలలోచనశ్శంభు, ర్భగవా న్బాదరాయణః.

—షడ్గుణైశ్వర్యసంపన్నుఁడైన బాదరాయణుఁడు నాలుగు మొగములు లేని బ్రహ్మ, రెండుచేతులుగల విష్ణువు, మూడవకన్ను లేని శంభుఁడు. అనఁగా రూపమున బ్రహ్మవిష్ణుమహేశ్వరులను బోలఁడు గాని మహిమయందు వారితో సమానుఁడే యని దీనిభావము.

ఈ రెండుశ్లోకములకు మిక్కిలి సంతసించి సాత్యవతేయుఁడు ప్రత్యక్షమై "వత్సా! కాళిదాసా! చకారకుక్షియని నన్నధిక్షేపించితివి. ఏదీ నీప్రజ్ఞ చూతము ధర్మజభీమార్జుననకులసహదేవులు ద్రౌపదికి మగలై, మఱఁదులై, బావలై యుందురనుభావము చకారములు లేకుండ నొక్క యనుష్టుప్శ్లోకమునఁ జెప్పు నాయనా" యని పలికెను. వెంటనే కాళిదాసుఁడు "స్వామీ! మీ యనుగ్రహమున్నచో నదియెంతపాటిది" యని యీ క్రింది శ్లోకము జెప్పెను,

శ్లో॥ ద్రౌపద్యాః పాండుతనయాః పతిదేవరభావుకాః
నదేవరో ధర్మరాజ స్సహదేవో న భావుకః.

తా॥ పాండవులు ద్రౌపదికి భర్తలు, బావలు, మఱఁదులు. ధర్మరాజెన్నఁడు మఱఁది కాఁడు, సహదేవుఁ డెన్నఁడు బావ కాఁడు.

వేదవ్యాసుఁ డా శ్లోకమువిని సంతసించి తాను చేసిన చకార ప్రయోగములకు హేతువులు చెప్పి కాళిదాసు నొడంబఱచి యతనికి వరములిచ్చి దీవించి పంపెను

## సమస్యాపూరణము

సాహస విక్రమార్కుఁడు మాఱువేషము వేసికొని తన రాజ్యమందలి నానాభాగములకుఁ బోయి దేశ పరిస్థితు లెట్లున్నవో స్వయముగాఁ జూచుకొని రాజ్యపాలనము జేసెనని వాడుకగలదు. భోజమహారాజుగూడ నట్లే పరులు తన్నెఱుఁగకుండ మాఱువేషములు వేసికొని దేశమంతయుఁ దిరుగుచు నొకనాఁ డొక గ్రామమునకుబోయి యొక బ్రాహ్మణుని యింట బసచేసెను. ఆ గృహయజమానుఁడు వేదాధ్యయనసంపన్నుఁడు, నిరతాగ్నిహోత్రి. ఆయన యిల్లాలు పరమ సాధ్వి. ఈ లోకములో మగనికంటె దైవము వేఱు లేదని నమ్మి యతని యడుగులు గొలుచుచు లోకులందఱుఁ గొనియాడునట్లు శాంతి గలిగి సంతుష్టిగలిగి సంసారము చేయుచుండెను. భోజుఁడు బసచేసిన నాటిరాత్రి పగలెల్ల నెందెందో తిరిగి యామెభర్త మిక్కిలి పాటుపడి యింటికివచ్చెను. ఆ మహాపతివ్రత భర్తకెదురుగాఁ బోయి సకలోప చారములు చేసి తనయింటఁగలిగినకొలఁది నెందలకడ వంటకముచేసి యారగింపఁజేసి పానుపువైచి భర్తను బండుకొనంబెట్టి తాను భోజనము చేయకయే మగని పాదములనొత్తుచుఁ గూరుచుండెను. భర్త గాఢముగ నిద్రించుచుండెను. ఆమె కుమారుఁడు రెండేండ్ల ప్రాయమువాఁడు.

కొంచెము మూరముగా నొక నులకమంచముమీఁద బండుకొని యిట్టటు పొరలి ప్రక్కనున్న కుంపటిలోఁబడెను. కడుపునఁబుట్టిన గారాబు బిడ్డఁడు దారుణ వహ్నిలోఁ బడినను నమ్మహాపతివ్రత కొమరుని తీపి నొక మూలకుఁ ద్రోసి మిక్కిలి యలసిసొలసివచ్చి గాఢనిద్రావశక్తుఁడైన ప్రాణవల్లభునికి నిద్రాభంగ మగునేమోయని శంకించి పాదములొత్తుట మానలేదు. అచ్చోటునుండి కదలిరాలేదు. "నేన త్తమామలకు విధేయురాల నగుదునేని, మగని దైవముగా నెంచుకొందునేని నా బిడ్డ కపాయము కలుగనే కలుగదు" అని నిశ్చయించుకొని మనస్సులో నగ్నిహోత్రుని వేఁడుకొని ధైర్యముగలిగి యుండెను.

బాటసారి వేషముతోనున్న భోజుఁ డంతయు గనిపెట్టి మిక్కిలి యాశ్చర్యమునొంది మఱునాఁ డుదయమున ధారానగరమునకుఁబోయి యావార్త యెవ్వరికిఁ దెలియఁజేయక కొలువుజొచ్చి సింహాసనాసీనుఁడై "హుతాశన శ్చందనపంకశీతలః" అను సమస్యనిచ్చి పూరింపుమని యాస్థానకవీశ్వరుల నడిగెను. దండి భవభూతిశంకరులు మొదలగు కవులు సరిగా దానిం బూరింపలేకపోయిరి. కాళిదాసుఁడు కాళీ వరప్రసాదమున భోజరాజు కంటఁబడిన యావద్వృత్తాంతము నెఱిఁగి సమస్య నిట్లు పూరించెను,

శ్లో॥ సుతం పతన్తం ప్రసమీక్ష్య పావకే
నబోధయామాస పతిం పతివ్రతా
తదాఽభవత్ తత్పతిభక్తిగౌరవా
ద్ధుతాశన శ్చందనపంకశీతలః.

తా॥ కుమారుఁ డగ్నిహోత్రములోఁబడుటఁ గనులారఁజూచియు మహాపతివ్రతయైనభార్య భర్తను మేలుకొలుపలేదు. ఆమెయొక్క పాతివ్రత్య మహిమచేత నగ్నిహోత్రుఁడు మంచిగంధమువలెఁ జల్లనయ్యెను.

అదివిని సభాసదులు విస్మేరమనస్కులై కాళిదాసును గడుంగడు ప్రశంసించిరి.

## కందుక వర్ణనము

భోజభూపాలుఁడు మాఱు వేషము వైచికొని ధారా నగరమునఁదిరుగుచు నొకనాఁడు వేశ్యావాటికకుఁబోయెను. ప్రచ్ఛన్నుఁడై యుండుటచేత నతఁడు మహారాజని గ్రహింపలేక వేశ్యలు యథేచ్ఛముగా విహరించి సంభాషింపఁజొచ్చిరి. అందొక పడుచు వెలయాలు కాలి యందియలు ఘల్లుఘల్లని మ్రోయఁ, జేతి కంకణాలు గణగణ మ్రోఁగఁ దన చేతితో బంతిఁ గొట్టుచు మిక్కిలి చమత్కారముగా నాడుచుండెను. ఆ సమయమున దాని హొయలు, దాని యొయారము, దాని సౌందర్యము, దాని చంచలనేత్రముల సొగసు వర్ణనాతీతమై యుండుటంజేసి రాజు మిక్కిలి యచ్చెరువడి మందిరమునకుఁబోయి మఱునాఁ డావృత్తాంతముఁ దన యాస్థానకవీశ్వరులకుఁ దెలియఁజేసి బంతియాడుచున్న యా గణికను వర్ణింపుమని కోరెను. అందు భవభూతి కందుక క్రీడ నిట్లు వర్ణించెను,

శ్లో॥ విదితం నను కందుక తే హృదయం
ప్రమదాధరసంగమలుబ్ధఇవ
వనితాకరతామరసాభిహతః
పతితః పతితః పునరుత్పతసి.

తా॥ ఓబంతీ ! నీ హృదయమునను న్న యభిప్రాయము తెలిసినది. ఆకాంతయొక్క యధరోష్ఠమును నీవు చుంబనముచేయఁదలఁచుచున్నావు. అందుచేతనేకదా యా బాలిక హస్తపద్మముతో నిన్నణఁగఁ జఱచినను మరలమరల లేచుచున్నావు.

అనంతరము రాజు వ్యాకరణవేత్తయైన వరరుచిం గనుంగొని వర్ణింపుమన నతఁ డిట్లు చెప్పెను,

శ్లో॥ ఏకోఽపి త్రయఇవ భాతి కందుకోఽయం
కాంతాయాః కరతలరాగరక్తరక్తః
భూమౌ తచ్చరణనఖాంశుగౌరగౌరః
ఖస్థః సన్ నయనమరీచినీలనీలః.

తా॥ ఈ బంతి యొక్కటే యయ్యు మూఁడు బంతులువలె గనఁబడుచున్నది. ఆ కాంతయొక్క కరపల్లవముయొక్క యెఱ్ఱదనము సోఁకుటచే నెఱ్ఱనిదై యుండును, నేలఁ బడినప్పు డామె గోళ్ళకాంతిచేత మిక్కిలి తెల్లనిదై కనఁబడును, మిక్కిలి పై కెగిరినప్పుడు దాని కన్నుల నల్లనిరంగుచే నల్లగా నున్నట్లు కనఁబడును.

మహారాజునకు వారిరువురుచేసిన వర్ణనలు నచ్చకపోవుటచేతఁ గాళిదాస మహాకవిని బిలిచి వర్ణింపుమనియెను. అప్పుడతఁడిట్లువర్ణించెను,

శ్లో॥ పయోధరాకారధరో హి కందుకః
కరేణ రోషా దభిహన్యతే ముహుః,
ఇతీవ నేత్రాకృతిభీత ముత్పలం
స్త్రియః ప్రసాదాయ పపాత పాదయోః.

తా॥ ఆ బంతి తన పాలిండ్లతో సమానముగా నున్నదని యీ బాలిక చేతితో మాటిమాటికిఁ జఱచుచున్నది. బంతికి జరుగుచున్న పరాభవముఁజూచి, చెవిలోనున్న నల్లకలువ తనకుఁగూడ నట్టి చఱపులు తగులునేమోయని భయపడి కొట్టవద్దని యీయామె పాదములపైఁ బడుచున్నదా యనునట్లు బంతియాటవలన చెవినుండి వీడి కాలిముందర బడెను.

కాళిదాసుఁడు తన మనస్సులో నున్న యభిప్రాయమంతయును బూర్ణముగఁ దీసికొని వచ్చెనని సంతసించి రాజు వానికి మిక్కిలి బహుమానము లిచ్చెను.

## నేరేడు పండ్లు

భోజక్షితిపాలుఁ డొక నాఁడు వేఁటకరిగి పలు మృగముల వేఁటాడి యలసి శ్రమనివారణార్థమై యొక సరోవరతీరమున దట్టమైన యాకులుగల యొక నేరేడు చెట్టుక్రిందఁ గూర్చుండి చల్లగాలి సేవించుచుండెను. అప్పుడు కొన్ని కోఁతులు చెట్టెక్కి కొమ్మలం గదపుచు దుముకుచు నిచ్చవచ్చినట్లు విహరింపఁజొచ్చెను. అందువలన మిక్కిలి పక్వములైన నేరేడుపండ్లు తరుశాఖలనుండి యాక్రిందనున్న సరస్సులో "గుళు గుగ్గుళు గుగ్గుళు" అను ధ్వనితోఁ బడెను. ఆ ధ్వని రాజు చెవి కెంతో మనోహరముగానుండెను. మరల నగరమునకుఁ బోయినతరువాత రాజు కాళిదాసునుజూచి "గుళు గుగ్గుళు గుగ్గుళు" అను సమస్యనిచ్చి పూరింపుమనెను. కాళిదాసుఁ డిట్లు పూరించెను,

శ్లో॥ జంబూఫలాని పక్వాని పతంతి విమలే జలే,
కపికంపితశాఖాభ్యో గుళు గుగ్గుళు గుగ్గుళు.

తా॥ పక్వములైన నేరేడుపండ్లు కోఁతులచేతఁ గదల్పఁబడిన వృక్షశాఖలనుండి, 'గుళు గుగ్గుళు గుగ్గుళు' అనుధ్వనితో విమలజలము నందు బడుచున్నవి.

అడవిలో నచ్చటనో జరిగిన వృత్తాంతము గాళిదాసుఁడు తెలిసి కొని సమస్యాపూరణము చేసినందుకు రాజు మిక్కిలి యానందించి యితఁడు సాక్షాత్పరమేశ్వరుఁడే యని భావించి నమస్కరించి గౌర వించెను

ఈ శ్లోకమునకుఁ బాఠాంతర మొకటి కలదు:

శ్లో॥ జంబూఫలాని పక్వాని పతంతి విమలే జలే,
తాని మత్స్యా న ఖాదంతి జాలగోళకశంకయా.

తా॥ పక్వములైన నేరేడుపండ్లు విమలమైన జలములోఁ బడు చున్నవి. అవి బెస్తవాండ్లు వలలకుఁగట్టిన సీసపుగుండు లేమో యని భయపడి యా పండ్లను చేఁపలు తినకున్నవి.

## గేదె పెరుగు శ్లోకము

వేదాధ్యయనమునందు మిక్కిలి ప్రవీణతగల పరమ వైదికులైన యిద్దఱు బ్రాహ్మణులు పేదతనముచేతఁ బీడితులై, భోజరాజ దర్శనముఁ జేసినపక్షమునఁ దమ కేర్పడిన దారిద్ర్యవిచ్ఛిన్నమగునట్లు ధనము దొరకునని పుట్టెడాసపెట్టుకొని ధారానగరమునకుఁ బోయిరి. అక్కడికి కరిగినతరువాత భోజుఁడు కవితాప్రియుఁడనియు. మధురకవిత్వము జెప్పినవారికేగాని బహుమాన మియ్యఁడనియు విని లోకమాతయైన భువనేశ్వరిని సేవించినపక్షమునఁ దమకు గవిత్వము పుట్టునని భావించి యా దేవతాలయమున కరిగి యామె కభివాదనముచేసి స్తోత్రము గావించి తాటియాకు గంటము బుచ్చుకొని కవిత్వముజెప్పఁ బ్రయత్నించిరి. సూర్యోదయాత్పూర్వము గూర్చుండి యాలోచింపఁగా జాము ప్రొద్దెక్కినప్పటి కొకనికి "భోజనం దేహి రాజేంద్రా!" యని యొక పాదము గుదిరెను. రెండవవానికి రెండుజాము లగునప్పటికి "ఘృతసూపసమన్వితం" అని మఱియొక పాదము గుదిరెను. నెయ్యి పప్పుతోఁగూడిన భోజనము పెట్టుము రాజేంద్రా యని యా పాదముల

భావము. పాపమప్పటికి రెండుజాములై నదిగనుక కడుపులోని ప్రేగులు మాడిపోవునట్లు కరకర యాకలియైనదికాఁబోలు! అందుచేత పప్పుఁ నేయితోఁగలిపిన యన్నము జ్ఞాపకమువచ్చి యీ పాదములు జెప్పి యుండవచ్చు. కవిత్వమనఁగా మంచి కల్పనలు, భావములు, రసములు, మేలైన యుపమానము లుండవలెనని వారి జన్మమధ్యమం దెఱుఁగరు. ఏవో నాలుగుపదములుగూర్చినపక్షమునఁ గవియైపోవునని వారు తలంచి యుందురు.

వారావిధముగా నవస్థపడుచుండ నంతలో దేశీ పాత్రప్రణామముఁ జేయుటకై కాళిదాసా యాలయమునకుఁ బోయెను. వారింజూచి కాళిదాసుఁడు 'మీ రేమి వ్రాయుచున్నా' రని యడుగ వారిట్లనిరి, "అయ్యా! మేము బ్రాహ్మణులము, ఛాందసులము, నిరుపేదలము. కుటుంబభరణము చేయలేక మిక్కిలి కుందుచున్నాము భోజు నాశ్రయించి దారిద్ర్యము బోఁగొట్టుకోవలెనని వచ్చినాము. కాని, కవితారసోల్లాసుఁడైన యీ రాజు మాబోటి ఛాందసులకు సంభావన లియ్యఁడని వింటిమి. అందుచే నెట్లైన నొక శ్లోకముల్లి భోజదర్శనము చేయవలెనని ప్రయత్నించుచున్నాము. ప్రొద్దుటినుండి చచ్చిచెడి రెండు పాదము లల్లితిమి. తక్కినపాదము లల్లుటకు మా తరము, మా తాతతరము గాకున్నది" అని యీ రెండుపాదములు జదివి వినిపించిరి. కాళిదాసుఁడు చిఱునవ్వునవ్వి తక్కిన రెండుపాదములు నేను చెప్పెద వ్రాసికొనుఁడనిపలికి యిట్లుచెప్పెను,

"మాహిషంచ శరచ్చంద్ర చంద్రికాధవళందధి"

తా॥ శరత్కాలచంద్రుని వెన్నెలవలె, తెల్లని గేదెపెరుగుఁగూడ నిమ్ము.

శ్లోకము చక్కఁగాఁ గుదిరినదని ఛాందసులు సంతసించి రాజ దర్శనముచేయ సభామంటపద్వారముకడకుఁ బోయి ద్వారపాలకునిఁగని

"ఓయీ! మేము కవిత్వముఁజెప్పితిమి. మేము వచ్చినట్లు రాజుగారితో మనవిచేయుము" అనిచెప్పిరి. ద్వారికుఁడు రాజుంగని నమస్కరించి యీ క్రిందిశ్లోకముతో బ్రాహ్మణులరాక నెఱింగించెను,

శ్లో॥ రాజమాషనిభై ర్దన్తైః కటివిన్యస్తపాణయః
ద్వారి తిష్ఠంతి రాజేంద్ర! ఛాందసాః శ్లోకశత్రవః

తా॥ బొబ్బర్లవంటి దంతములుగలిగి, నడ్డిని చేతులుపెట్టుకొని కవిత్వమునకు శత్రువులైన యిద్దఱు ఛాందసబ్రాహ్మణులు ద్వారమందున్నారు మహాప్రభో.

అదివిని రాజు వారిం బ్రవేశపెట్టుమని యానతిచ్చెను. వారు ప్రవేశించి శ్లోక మిట్లు చదివిరి :

శ్లో॥ భోజనం దేహి రాజేంద్ర ఘృతసూపసమన్వితం
మాహిషంచ శరచ్చంద్రచంద్రికా ధవళం దధి.

ఆ శ్లోకమువిని మహారాజిట్లనియె—"ఇందలి మొదటి రెండు పాదములు మీరు చేసినవి. వాటికి బహుమాన మీయనక్కఱ లేదు. కడపటి రెండుపాదములు మీవి కావు గాని, రసవంతములుగా నుండుటచే నక్షరలక్షలిచ్చుచున్నాను" అని సబహుమానముగా వారినంపి కాళిదాసునిజూచి "యీ శ్లోకమునఁ గడపటి రెండు పాదములు నీవు రచియింపలేదా" యని యడిగెను. కాళిదాసుఁడు మందహాసముచేసి యూరకుండెను.

## కోవుల కానుక

క్రమదరిద్రుఁడైన యొక బ్రాహ్మణుఁడు కుటుంబ భరణము చేసికొనలేక మిక్కిలి ఖేదపడి పుంభావసరస్వతియైన కాళిదాసు

నాశ్రయించినపక్షమున నతఁడు భోజునితోఁ జెప్పి తన కేదేని యుపకార మొనరించునేమో యని యాసపడి ధారాపురికిఁబోయి యా కవిశేఖరుని దర్శనముచేసి తన దీనావస్థనంతయు వెళ్లఁబుచ్చుకొనెను. అదివిని కాళిదాసు మిక్కిలి విచారించి నీవు కవిత్వమేమైనఁ జెప్పఁగలవా యని యడిగెను. అందుకు బ్రాహ్మణుఁ డిట్లనియె, "అయ్యా! చదువుకు నాకుఁ జాలదూరము. పొట్టజించి కంచుకాగడాలువేసి వెదికినను నా కడుపులో నొక్క యక్షరమైనఁ గనఁబడదు. ఇంటినిండ పిల్లలు ఏపూట కాపూట కుండ కాలుటయే కష్టముగా నున్నది. విద్వాంసుఁడ నైన పక్షమున నేనే రాజునాశ్రయించి సంపాదించుకొందును. నావంటి నిరక్షర కుక్షికి సాయముచేయుటయే చేయు"టని బదులుచెప్పెను, వానియవస్థవిని జాలినొంది కాళిదాసుఁడు వాని కేదేని సాయము చేయదలచి "అయ్యా! నేనేదో సాయముచేసెద. రేపు రాజద్వారమునొద్ద మీరు కనిపెట్టి యుండుఁడు. రాజును, దేవతలను, చిన్నపిల్లలను, గురువును రిక్త హస్తములతోఁ జూడఁగూడదు. కావున పండ్లో, కాయలో రాజునకు బహుమానముగాఁ దీసికొనిరమ్ము" అని వానిం బంపెను.

మఱునాఁ డా బ్రాహ్మణుఁడు పెద్ద చెఱుకుగట్టు నొకదానిని సంపాదించి, దానిని చిన్న ముక్కలుగావిఱిచి వాటిని దన కొల్లాయగుడ్డను జుట్టఁబెట్టి రాజద్వారముకడఁ గూర్చుండెను. అతఁడు పెద్దమ్మకుఁ బెంపుడు కొడు కగుటచేత 'నిర్భాగ్యునకు నిద్ర' యన్న లోకోక్తి ప్రకారము కునికిపాట్లువచ్చెను. చెఱుకుముక్కలకట్ట తలగడఁ జేసికొని యతఁడు గుఱ్ఱుపట్టి నిద్రబోయెను. చెఱుకుముక్కలు చూచి నోరూరుటచే వానికన్న నిర్భాగ్యుఁడొకఁడు కాగి చల్లారిన కొఱవులు తెచ్చి, చెఱుకు ముక్కలు తాను లాగి యా కొఱవుల నంగవస్త్రమునఁజుట్టి యతని తలక్రిందఁ బెట్టెను. మన బ్రాహ్మణుఁడు కలియుగ కుంభకర్ణుఁ డగుటచే నదియేమియు నెఱుఁగక తనదారిని దాను బుసకొట్టుచుండెను.

కాళిదాసుఁడు రాజసభాభవనమున కరిగి ద్వారమునందొక మహా పండితుఁ డున్నాఁడనియు, నతఁడు మౌనవ్రతము ధరించినాఁడనియు, రాజుతో మనవిచేసెను. రాజు వానిం బ్రవేశపెట్టుమని దౌవారికుని కానతిచ్చెను. ద్వారపాలకుఁడు గాఢనిద్రలోనున్న యా బ్రాహ్మణుని మేలుకొలిపి "మీరేనా రాజదర్శనార్థమై వచ్చినవా" రని యడిగి "నేనే" నని యతఁడు చెప్ప నవ్వలోపలికిఁదీసికొనిపోయెను. జ్యేష్ఠాదేవి ప్రియపుత్త్రుఁడైన యా విప్రుఁడు కన్నులు నులుముకొనుచుఁ దన యంగ వస్త్రమునఁ జుట్టబడిన వేవో చూచుకొనక చెఱుకుముక్కలే యనుకొని రాజునకభిముఖుఁడై కట్టవిప్పి యా కొఱవులఁ జేతికిచ్చెను. రాజు కొఱవు లందుకొని విస్మితుఁడై కాళిదాసువంకఁజూచెను. తాను దీసికొనివచ్చిన బ్రాహ్మణుఁడు మిక్కిలి యమంగళములై, యశుభసూచకములైన కొఱవులను బ్రశస్తములైన రాజహస్తములఁ బెట్టుటచేతఁ గాళిదాసుఁడు తెల్లఁబోయి బ్రాహ్మణుని యవివేకమునకు నొచ్చుకొని యెట్లయిన నాతని వికృతచేష్టను సమర్థింపవలెనని భువనేశ్వరీ పాదపద్మముల నొక్కసారి ధ్యానించి మహారాజుతో నిట్లు మనవి చేసెను:

"దేవా! ఈ బ్రాహ్మణుఁడు కొఱవులు కానుకగా నిచ్చినందుకు మీరు విస్మితులగుచున్నారు. కోపగింపవలదు. నిమ్మపండ్లో, యఱటి పండ్లో, పుష్పములో దేవరవారికిఁ గానుకగాఁ దెచ్చియియ్యవలెనని యీ బ్రాహ్మణుఁ డెఱుఁగకపోలేదు. బ్రాహ్మణజాతిలోఁబుట్టి యింత వయస్సు గడపిన యీతని కింతమాత్రము దెలియకపోవునా? కాని దీనిలో గంభీరమైన యర్థమున్నది చిత్తగింపుఁడు!—

శ్లో॥ దగ్ధం ఖాండవ మర్జునేనచ వృథా దివ్యద్రుమైర్భూషితం
దగ్ధా వాయుసుతేన హేమరచితాలంకాపురీ స్వర్గభూః
దగ్ధ స్సర్వసుఖాస్పదశ్చ మదనో హాహా వృథా శంభునా
దారిద్ర్యం ఘనతాపదం భువి నృణాం కేనాపి నోదహ్యతే.

తా॥ దివ్యవృక్షములచే నలంకరింపఁబడిన ఖాండవవనము పూర్వ మర్జునునిచే వ్యర్థముగాఁ దహింపఁబడెను. స్వర్గతుల్యమైన, సువర్ణమయమైన, లంకాపట్టణము హనుమంతునిచే నిష్కారణముగాఁ దగులబెట్టఁబడెను. సకలజంతు సుఖప్రదుఁడైన మన్మథుఁడు గూడ శంభునిచేత నిర్హేతుకముగాఁ గాల్పఁబడెను. మనుష్యులను మిక్కిలి పీడించుచున్న యీ దారిద్ర్యము నెవ్వరుఁ గాల్పలేకపోయిరి.

కావున నీవైన మాదారిద్ర్యము నీకోపాగ్నులతోఁ గాల్చి వేయుమని యీ బ్రాహ్మణుఁడు వేఁడుకొనుచున్నాఁడు" అని సభాసదులు భోజుఁడు విస్మయమందునట్లు సమర్థించెను. రాజు పరమానందభరితుఁడై బ్రాహ్మణునకు గొప్ప బహుమానమిచ్చి పంపెను.

## అమావాస్య పూర్ణిమ యగుట

కాళిదాసునినోట వెడలినమాట తప్పక జరిగి తీఱుననుటకు విచిత్రమైనకథ యొకటిగలదు.

ఒకనాఁడు భోజరాజు కాళిదాసునిఁజూచి "నేఁటి తిథి యే" మని యడిగెనఁట! కాళిదాసుఁడు శ్లోకమేదో యాలోచించుచుఁ బరాయత్తచిత్తుఁడై యుండుటచేత నోరుజాఱి పొరబాటున నమావాస్య యనుటకు మాఱుగాఁ బూర్ణిమావాస్యయని చెప్పెనఁట! దగ్గఱ నెవ్వరోయుండి, "నేఁ డమావాస్యకాదా" యని యడిగెను. కాళిదాసుఁడు తననోట పొరబాటుమాట వెడలెనని యొప్పుకొనుటకిష్టములేక తనకు భువనేశ్వరీదేవతా ప్రసాదము కలదను ధైర్యముతో "కాదు. నేఁడు పూర్ణిమావాస్యయే. అమావాస్యకాదు" అని దృఢముగాఁ బలికెను. అప్పుడు భోజభూపాలుఁడు "కాళిదాసుఁడా! నేఁడు పూర్ణిమ యైనపక్షమునఁ బూర్ణ చంద్రోదయమగునా? వెన్నెలకాయునా?" యని గట్టిగానడిగెను

"తప్పక చంద్రుఁడుదయించును. తప్పక పండు వెన్నెల గాయును" అని గంభీరముగఁ బలికెను. సరే! చూతమని రాజు వానికి సెలవిచ్చిపంపెను

కాళిదాసుఁడు స్నానముచేసి భోజనముచేయక భువనేశ్వరీ దేవతాలయమునకుఁ బోయి యూ రేచి యనేకవిధముల స్తుతియించి తన పరువు దక్కింపుమని ప్రార్థించెను అప్పుడు భువనేశ్వరీదేవత తనను నమ్ముకొన్న పరమభక్తుని మీఁద నిజకరుణాకటాక్షవీక్షణములు ప్రసరింపఁజేసి "వత్సా! భయపడకుము. నీ మాట చెల్లించెద" నని యభయమిచ్చి తన కర్ణభూషణ మతనికిచ్చి సాయింకాల మైనతోడనే దాని నెగుర వేయుమని యానతిచ్చెను. దేవతానుగ్రహపాత్రుఁడై నందుకు మిగులసంతసించి కాళిదాసు నిజమందిరమునకుఁబోయి సూర్యాస్తమయ మైనతోడనే దేవీ కర్ణభూషణమును మింటి కెగురవైచెను. అది యాకాశమున కరిగి చంద్రమండలముపగిది సకలకళాపరిపూర్ణమై తెల్లని కాంతులు వెదజల్లఁజొచ్చెను మహారాజు, పౌరులు మిక్కిలి యక్కజ మంది కాళిదాసుని ప్రభావముఁ గొనియాడిరి.

## వేదవేదాంగసారము

ఒకనాఁడు భోజ భూపాలుఁడు పండితమండల పరివేష్టితుఁడై ప్రసంగవశమున "వేదవేదాంగపురాణాదుల సారమంతయు నొక్క శ్లోకమునఁ జెప్పఁగలరా" యని విద్వత్కవుల నడిగెను. కవు లొకరి మొగ మొకరు చూచుకొనిరి. అట్లు చెప్పట యసంభవమని కొందఱు పలికిరి అప్పుడు కాళిదాసుఁడు లేచి "దేవా! శ్లోక మెందుకు! శ్లోకములో సగములో నేఁజెప్పెద చిత్తగింపుఁడు" అని యిట్లు చదివెను—

శ్లో॥ శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః,
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్

తా॥ కోటి గ్రంథములచేతఁ జెప్పఁబడినదానిని నేను శ్లోకములో సగములోఁ జెప్పెదను. పరోపకారమువలన పుణ్యము గలుగును; పరులను బాధించుటవలనఁ బాపము కలుగును.

అంత పరమార్థ మింత చిన్నశ్లోకములో నిమిడ్చి కవుఁ జమత్కారముగాఁ జెప్పినందుకుఁ గాళిదాసు మహాకవి కేర్పుకు మిక్కిలి వినుతించి రాజు, సభాసదులు మిక్కిలి సంతసించిరి

## జూదమువిూఁది యాసక్తిఁ బోఁగొట్టుట

దీప్తిమంతమైన దీపముక్రింద నించుక క్రీనీడ యున్నట్లు చల్లని వెలుఁగు వెదజల్లు చంద్రమండలమునకుఁ గళంకమున్నట్లు, కమ్మనితావులు వెదజల్లు గులాబి పువ్వునకు ముండ్లున్నట్లు బహుసద్గుణసంపన్నులై నమహాపురుషులయందు సైతము నొకానొకదుర్గుణము కానఁబడుచుండును. అట్టిభోజమహారాజునందు విద్వత్కవిజనపోషణము, దాతృత్వము, పరాక్రమము మొదలగు బహు సుగుణము లుండినను నతనికిఁ జూదమందు మిక్కిలి యాసక్తి యుండెను. అది యనర్థకమని యతఁడెఱుఁగును. కాని, మనస్సును దానినుండి త్రిప్పుకొనలేకపోయెను. కాళిదాసుఁడు రాజహితాభిలాషి యగుటచేఁ బలుసారు లతనిం గలసి రహస్యముగా నిట్లు హితోపదేశము చేయుచు వచ్చెను.

"ఆర్గురు చక్రవర్తులలో నొకఁడైన నలుఁడు దాయాదియైన పుష్కరునితోఁ జూదమాడి రాజ్యపదభ్రష్టుఁడయ్యెను. అంతటితోఁ బోక జూద మా చక్రవర్తిని బరమ నీచదశకుఁ దెచ్చెను. ఆ మహాసార్వభౌముఁడు పూర్వము తనకు సామంతరాజయిన ఋతుపర్ణునింట వంటలవాఁడై, యతని రథసారథియై, కర్కోటకునిచేతఁ గరువఁబడి కురూపియై జీవింపవలసివచ్చెను. రాజసూయయాగముచేసి, యెల్ల

రాజులం గెలిచి, నేల నాలుగు చెఱంగుల నేలిన ధర్మరాజు, భార్యను సోదరులను జిట్టచివరకుఁ దన్నును బందెములుగా నొడ్డి యోడి, పండ్రెండు సంవత్సరము లరణ్యవాసము, విరటునింట నొక సంవత్సర మజ్ఞాతవాసము జేయవలసివచ్చెను. అట్టివారికే జూదము బహుకష్టము దెచ్చిపెట్ట నీవంటివా డెంత ? కావున జూదము మానుము " అని పలు దెఱంగుల నీతులు చెప్పినను వినక భోజుఁడు నిరంతర ద్యూతాసక్తుఁడై యుండెను. అప్పుడు కాళిదాసొక యుపాయము పన్ని యన్యాపదేశముగా నతనికి నీతి బోధించెను.

ఒక బౌద్ధభిక్షుకునిఁ బిలిచి " భోజరాజు జూదమాడుటకై ద్యూత గృహమునకుఁ బోవునప్పుడు నీవు మాంసపుదుకాణముదగ్గఱ నంజుడు గొనువానివలె నిలిచియుండుము " అని చెప్పి మఱికొన్ని మాటలు వానితో రహస్యముగాఁ జెప్పిపంపెను. భిక్షుకుఁ డాప్రకారముగా మాంసపుటంగడియందు బేరమాడుచుండెను. భోజరా జాదారింబోవుచు భిక్షుకునితో మాటాడెను. వారిసంభాషణ మీ శ్లోకరూపముగానున్నది.

భోజ : భిక్షో! మాంసనిషేవణం కిముచితమ్?=ఓయి భిక్షుకుఁడా! మాంసము దినఁదగునా ?

భిక్షు : కిం తేన మద్యంవిన=మద్యము లేనిదే ప్రయోజనమేమి.

భోజ: మద్యంచాపితవప్రియం?=నీకు మద్యముగూడ ప్రియమా?

భిక్షు : ప్రియ మహో వారాంగనాభి స్సహం=బోగమువాళ్ళఁ గలసినప్పు డది మిక్కిలి ప్రియము.

భోజ : వారస్త్రీరతయే కుత స్తవ ధనం ?=బోగమువాళ్ల నుంచుకొనుటకు నీకు సొమ్మెక్కడిది ?

భిక్షు : చౌర్యేన ద్యూతేన వా=దొంగతనముచేతఁగాని జూదము చేతఁగాని.

భోజ : చౌర్యద్యూతపరిశ్రమో౽స్తి భవతాం ?=చౌర్యద్యూతములయందుఁగూడ మీకు పరిశ్రమము కలదా ?

భిక్షు: భ్రష్టస్య కావాగతిః=చెడిపోయినవానికి వేఱుగతేమున్నది.

ఆ శ్లోక మీ క్రిందివిధముగా నున్నది—

శ్లో॥ భిక్షో ! మాంసనిషేవణం కిముచితం ? కిం తేన మద్యం వినా,
మద్యంచాపి తవ ప్రియం ? ప్రియమహో వారాంగనాభిస్సహ
వారస్త్రీరతయే కుత స్తవ ధనం ? చౌర్యేణ ద్యూతేన వా
చౌర్యద్యూతపరిశ్రమో౽స్తి భవతాం ? భ్రష్టస్య కావాగతిః.

భిక్షుకుఁడు చమత్కారముగాఁ జేసిన యీ హితోపదేశమును విని భోజరాజు జూదము సప్తవ్యసనములలో నొకటియనియు, దానివలన సకలానర్థములు గలుగుననియు గ్రహించి నాఁటనుండి నెత్తమాడుట మాని తన్ను మంచిమార్గములో దింపిన కాళిదాసునకుఁ గృతజ్ఞుఁడై యుండెను.

## రావేరావే భోజరాజు

విదర్భదేశమును గూడ జయించి పాలించెను. విదర్భదేశములోఁ గొన్ని భాగములయందు మాటలాడుకొను భాష తెనుఁగు. కాళిదాసుఁడు భోజమహారాజుతోఁ గూడ నొకసారి విదర్భదేశమునకుఁ బోయి రాజధానియైన విదర్భాపురముంజూచి మిక్కిలి సంతసించి పూర్వము త్రేతాయుగమున నలదమయంతుల విహారములచేత పవిత్రీకృతమై, పిమ్మట ద్వాపరయుగమున రుక్మిణీ వాసుదేవుల వివాహముచేత నత్యంతపావనమై యుండిన యా పురము నీ క్రిందివిధమున వర్ణించెను,

శ్లో॥ గేహేగేహే జంగమా హేమవల్లి
వల్ల్యాం వల్ల్యాం పార్వణశ్చంద్రబింబః

బింబే బింబే కోకిలానాం విరావో
రావే రావే జాయతే పంచబాణః.

తా॥ పతిగృహమందును కదలుచున్న బంగారుతీఁగెలు గలవు. ప్రతి తీఁగయందును పున్నమనాఁటి చంద్రమండలమున్నది. ప్రతి చంద్రబింబమునందును కోకిలస్వరమున్నది. ప్రతి స్వరమునందును మన్మథుఁడు మొలకెత్తుచున్నాఁడు

ఈ శ్లోకము నతఁడు చదువుకొనుచు విదర్భాపురవీధులయందు సంచరించుచుండఁగా నొకపడుచుపిల్ల "రావేరావే జాయతే పంచబాణః" అను కడపటిపాదమునుమాత్రము విని యతఁడు తన్ను రావేరావే యని పిలుచుచున్నాఁడనుకొని యతని దుండగమునకు మిక్కిలి కోపించి తండ్రితోఁ జెప్పెను. తండ్రి భోజరాజుకడకుఁబోయి "మహారాజా! చూచితిరా మీ యాస్థానకవీశ్వరుని సాహసము. నా కూఁతును జూచి రావేరావే యని పిలిచినాఁడట" యని మొఱపెట్టెను.

రాజు కవిరాజునుబిలిచి యడుగ నతఁడు మందహాసముచేసి యిట్లనియె—"దేవా! నేను విదర్భాపుర వర్ణనము చేసితిని. అందుఁ గడపటిపాదమున "రావేరావే" యనియున్నది. అది యాంధ్రభాషలో నపార్థమిచ్చును గాఁబోలు! సంస్కృతభాషలో మంచి యర్థ మిచ్చుచున్నది. ఆ శ్లోకమును నేను చదువుకొనుచు వెళ్లితిఁగాని యీ బాలిక నవమానింపలేదు" అని యా శ్లోకమును జదివెను. అది రాజువిని చిఱునవ్వు నవ్వి యా బాలికతండ్రిని సమాధానపఱచి పంపెను.

టం టం ట టం టం

భోజభూపాలుఁడు మిక్కిలి చక్కనివాఁడు. నవమన్మ థాకారుండగు నతఁ డొకనాఁడు స్నానముఁ జేయుచుండఁగా నొక పరిచారిక

రాజుయొక్క తారుణ్యాలావణ్యములుగాంచి మోహించి పరవశత్వముచేఁ దనచేతనున్న పాత్ర మేడమీఁద జాఱవిడచెను. అది మేడమెట్లనుండి టంటంటటంటం అని దొర్లుచు నేలఁబడియెను. భోజనానంతరమున మహారాజు సభామంటప మలంకరించి 'టంటంటటంటంటటటంటటంటం' అను సమస్యను బూరింపుమని కవుల నడిగెను తత్, సవారందఱు దాని భావ మెఱుఁగక మూఁగలట్లు మొగమొగంబులు చూచుకొనుచు నూరకుండిరి. కాళికాదేవి వరప్రసాదమున సకలరహస్యములఁ దెలిసికొనఁగల కాళిదాసుఁడు సమస్య నిట్లు పూరించెను,

శ్లో॥ రాజాభిషేకే మదవిహ్వలాయాః
హస్తాచ్చ్యుతో హేమఘటో యువత్యాః
సోపానమార్గేషు కరోతి శబ్దం
టంటంటటంటంటటటంటటంటం.

తా॥ రాజుగారి స్నానసమయమందు మోహపరశయైనపరిచారిక యొక్క చేతినుండి బంగారుపాత్ర జాఱి పడిపోఁగా మెట్లమీఁదనుండి 'టంటంటటంటంటటటంటటంటం' అని శబ్దముచేయుచుఁ గ్రిందఁబడెను.

## యజ్ఞోపవీతమ్ పరమం పవిత్రమ్

వేదాధ్యయన ప్రవీణులైన ఛాందస బ్రాహ్మణు లిరువురు భోజభూపాలుని మెప్పించి సంభావన గైకొనఁదలంచి ధారాపురికిఁ బోయి కవిత్వము చెప్పినంగాని భోజుఁడు బహుమానమియ్యఁడని పురజనులవలన నెఱింగి మొట్టమొదట రాజదర్శనముచేసి యందొకఁ డుపనిషత్తులలో నున్న "అణోరణీయా న్మహతో మహీయాన్" అనునదొక పాదముగాఁ జెప్పి శ్లోకమారంభించి నృపాలునియెదుటఁ జదివెను. రెండవవాఁడు జందెము వేసికొనునపుడు చదువుమంత్రములో మొదటిపాదమైన మంత్రమును రెండవపాదముగాఁ జేసి "యజ్ఞోపవీతం పరమం పవిత్రమ్" అనిచదివెను.

ఇట్లు విపరీతముగా వేదమంత్రభాగములలో నొక శ్లోకమున సగముభాగ మల్లి పిమ్మట నోరాడక వా రూరకుండిరి. వారిం గరుణించి భోజరాజు కొంత బహుమానము వారికిచ్చి పంపి మఱునాఁడు కొలువుకూటమున కరిగి యాస్థానవిద్వాంసులంగాంచి యా రెండుపాదములనిచ్చి శృంగార రసప్రధానముగా శ్లోకముపూరింపుమని వారినడిగెను. తక్కినకవులందఱు దానిం బూరింపలేక యూరకుండఁ గాళిదాసు కడు చమత్కారముగాఁ దాని నిట్లు పూరించెను—

శ్లో॥ అణోరణీయా న్మహతో మహీయాన్
మధ్యోనితంబశ్చ యదంగనాయాః
తరంగహారిద్రదనిమజ్జనేన
యజ్ఞోపవీతం పరమం పవిత్రం

తా॥ ఏ పడఁతియొక్క నడుము పరమాణువుకంటెఁ జిన్నదియై, కటి ప్రదేశము మహాపదార్థముకంటె గొప్పదియై యుండునో, యా యంగన యొక్క మేని పసపుతోఁ దడసిన జందెము మిక్కిలి పవిత్రమైనది.

ఆ శ్లోకమందలి భావసౌకుమార్యమునకు మహారాజు భళీ యని మెచ్చి కాళిదాసునకుఁ దగిన పారితోషిక మొసంగెను.

## అశ్వనీ దేవతల వైద్యము

భోజరాజు నగరము వెలుపల నొక క్రొత్తచెఱువు త్రవ్వించెను. చిన్ననాఁటనుండియు నాతఁడు తన కపాలమును శోధించుకొనుట నలవాటు చేసికొనెను. ఆ నూతన తటాకమున స్నానము చేయునప్పుడు మునుపటి యలవాటుచొప్పున నిజ కపాలమును దీసి శోధనచేసికొనెను. ఆ సమయమున రెండు చేఁపపిల్లలాకపాలములో దూరెను. అది యెఱుఁగక భోజుఁడు కపాలము నెప్పటియట్ల నమర్చుకొనెను. అది మొదలుకొని యతనికి

గాఢమైన తలనొప్పి బయలుదేరెను. వైద్యులువచ్చి యెంత చికిత్స చేసినను శిరోవేదన శాంతింపలేదు. మనుష్యవైద్యుల కెన్నటికిని బోధపడని దారుణరోగముచేత నతఁడహోరాత్రములు విశ్రాంతిలేక బాధపడుచుండుటచే శరీరము చిక్కిపోయెను. సుఖము గతించెను. చలికాలమందలి తామరపువ్వువలె మొగము వాడిపోయి కళాహీన మయ్యెను. రాజ్యవ్యాపారములయందు విముఖుఁడయ్యెను ఎండినపుల్లల మీఁద నగ్నిహోత్రుఁడువలె వ్యాధి విజృంభించెను. అన్నము రుచింపక పోయెను. నిద్ర పట్టలేదు. ఇట్లు సంవత్సరకాలము గడచెను. ఆ రోగ మెవ్వరును నివారింపలేకపోయిరి. అనేకౌషధముల మ్రింగి మ్రింగి రోగ నివారణమును గానక ప్రాణము విసికి యా క్షితిపాలుఁడు, తన యవస్థం జూచి దుఃఖసాగర నిమగ్నుఁడైన బుద్ధిసాగరునిఁగనుంగొని నిస్పృహుఁచేత మాటాడలేక నెంతో కష్టముమీఁద నిట్లనియె,

"ఓయీ! బుద్ధిసాగరా, వైద్యులెవ్వరు నారోగము గుదుర్పలేక పోయిరి. కావున నేఁటి మొదలుకొని నా దేశములో వైద్యులెవ్వరు గాపురముండఁగూడదు. బాహటము మొదలగు వైద్యగ్రంథములను దీసికొనిపోయి నీటిలోఁ బాఱవైచిరండు నాకు దేవతలను గలసికొను కాలము సమీపించినది. నా నిమిత్తమై మీరెవ్వరు విచారింపవలదు"

ఆ పలుకులు విని పురజనములు, కవులు, మంత్రి సామంతులు, నంతఃపురమందలి స్త్రీజనము మహాదుఃఖవంతులైరి. అందఱి కన్నుల నుండి కన్నీరు సోనలై ప్రవహించెను.

భోజుఁ డీవిధంబుననుండ నొకనాఁడు స్వర్గలోకమున మహేంద్రుఁ డష్టదిక్పాలకులతోడను, దేవసమూహముతోడను, బ్రహ్మర్షి రాజర్షి గణముతోడను, నిండుకొలువుండి నారదమునింజూచి "మునీంద్రా! భూలోకమున వార్తలెవ్వి?" యనియడిగెను. అనవుడు నారదమహాముని యిట్లనియె, "మహేంద్ర! భూలోకమున మహాశ్చర్యమేమియును లేదు. ధారానగర పరిపాలకుఁడైన భోజమహారాజు జబ్బుగా నున్నాఁడు.

మిక్కిలి బాధపడుచున్నాఁడు. ఆ రోగ మెవ్వరికి సాధ్యమైనదికాదు. అందుచేత భోజుఁడు తనదేశమునుండి వైద్యులనందఱిని వెడలఁ గొట్టించెను. వైద్యశాస్త్రము వట్టి బూటకమని నిరసింపఁబడెను. వైద్యగ్రంథములు నీటిలోఁ బాఱవేయఁబడెను.

అదివిని మహేంద్రుఁడు విస్మయమంది తనచెంతనున్న యశ్వినీదేవతలనుజూచి యిట్లుపలికెను, "ఓహో! స్వర్గవైద్యులారా, ధన్వంతరీయమైన వైద్యశాస్త్రము బూటకమా?" అనవుడు దేవవైద్యులు, "మహేంద్రా! వైద్యశాస్త్ర మబద్ధముకాదు. మనుష్యులకు సాధ్యముకానట్టియు, దేవతలచేతనే సాధ్యమగునట్టియు దారుణరోగముచేత భోజభూపాలుఁడు బాధపడుచున్నాఁ"డని బదులుచెప్పిరి "ఆరోగమేమి? అది మీకు సాధ్యమగునా?" యని యింద్రుఁడు మరలనడుగ, వారు "ఆ! మే మెఱుఁగుదుము. కపాలశోధనకాలమునఁ జేఁపలు శిరస్సున దూరినవి దానివలన శిరోవేదన కలిగినది" యని యుత్తరముచెప్పిరి. అప్పుడింద్రుఁడు చిఱునవ్వుచేత మొగము వికసింప "అట్లైన మీరిప్పుడే భూలోకమునకరుగుఁడు మీరరిగి యారోగము నివారింపకపోదురేని భూలోకమునందు వైద్యశాస్త్రముమీఁది విశ్వాసము పోవును అతఁడు సరస్వతి కాధారమైనవాఁడు. అనేకశాస్త్రముల నుద్ధరించినవాఁడు. కావున, నవశ్యము రక్షణీయుఁడు" అని హెచ్చరించెను దేవేంద్రునానతి శిరసావహించి యా వైద్యులిరువురు భూలోకమున కరిగి బ్రాహ్మణ వేషములు దాల్చి భోజుని మందిరద్వారమున నిలిచి ద్వారపాలకునితో నిట్లనిరి—"ఓయీ! మేము వైద్యులము బ్రాహ్మణులము. కాశీపురమునుండి వచ్చితిమి ఆ రాజేంద్రుఁడు వైద్యశాస్త్ర మబద్ధమని నిరసించినాఁడనివిని వైద్యశాస్త్రము సత్యమని స్థాపించుటకును, నృపాలుని రోగముకుదుర్చుటకును, మేమువచ్చితిమి. మారాక ఱేని కెఱిఁగింపుము" అనవుడు ద్వారపాలకుఁడు "బ్రాహ్మణులారా! వైద్యుఁడన్నవాని నెవ్వనిని లోపలికి రానీయఁగూడదని రాజాజ్ఞయైనది. రాజుగారు మిక్కిలిజబ్బుగా

నున్నారు. మీరాక విజ్ఞాపనము చేయుటకుఁ దగినసమయముకాదు" అని వారిని నిరోధింప నాసమయమునసే బుద్ధిసాగరుఁ డేపనిమీఁదనో ద్వారముకడకువచ్చి వారివలన వారిరాకకు నిమిత్తమెఱిఁగి వారిని రాజసన్నిధికిం గొనిపోయెను. మహారాజు వారి దివ్యసుందరవిగ్రహములఁ జూచి వారివలనఁ దనరోగము నివారితమగునని నిశ్చయించి వారిని గౌరవించెను అప్పుడు వారు రాజుంజూచి "మహీపాలా! భయపడకుము. నీ రోగము కుదిరినదనినమ్ముము. కాని, యీ స్థలమందు నీవును మేమును దప్ప మఱియెవ్వరు నుండఁగూడదు" అనిపలుక రాజు వల్లెయని యట్లు చేసెను. అశ్వినీ దేవతలు భూపాలునకు మోహచూర్ణమిచ్చి మత్తుగల్గించి శస్త్రముచేఁ గపాలముభేదించి లోపలనున్న చేఁపపిల్లలందీసి యొక పాత్రయం దుంచి, సంధానకరణిచేత వెండియుఁ గపాలమును యథాప్రకారమమర్చి సంజీవకరణిచేత నతనిని మరల బ్రతికించి చేఁపపిల్లల వానికిఁ జూపిరి. రాజు వాటినిజూచి విస్మేరమనస్కుఁడై యిది యేమికారణమని యడుగ దేవచికిత్సకులు "రాజా! నీ కపాలశోధనకాలమున నిది సంప్రాప్తమైనది" యని వారుత్తరముచెప్పిరి. అప్పుడు రాజువారు దివ్యపురుషులని తెలిసికొని "తన కేమిపథ్య" మని యడిగెను. అప్పుడు వా రిట్లనిరి :

శ్లో॥ అశీతే నాంభసా స్నానం, పయఃపానం, వయస్స్త్రియః,
ఏత న్నో మానుషాః పథ్యం,.....................

తా॥ ఓ మనుష్యులారా! వేడినీళ్ళస్నానము, పాలుత్రాగుట, పడుచుపడఁతుల సహవాసము నివి మీకు పథ్యములు.

ఓ మనుష్యులారా యనుటచేత వారు శ్లోకము పూర్తిచేయక మునుపె రాజు వారిచేతులు పట్టుకొని మీ రెవ్వరని యడిగెను. వా రాచేతులు వదలించుకొని శ్లోకముయొక్క నాలుగవపాదము వీరా కాళిదాసు పూరింపఁగలఁడని పలికి యంతర్ధానమైరి.

అంతట రాజు మిక్కిలి యశ్కజమునొంది యాస్థానకవీశ్వరులను, మంత్రిసామంతులను బిలిపించి యా వృత్తాంతమంతయు నెఱిఁగించెను. అనంతరము కాళిదాసుఁడు నాలవచరణ మిట్లు పూరించెను,

"స్నిగ్ధ ముష్ణంచ భోజనమ్"

తా॥ భోజనము స్నిగ్ధముగాను, నుష్ణముగాను నుండవలెను. అనఁగా, చక్కని వేడియన్నముఁ దినవలెనని దీని భావము.

అదివిని భోజరాజు కాళిదాసుఁడు సామాన్య మనుష్యుఁడు కాఁడనియు, లీలామానుషస్వరూపుఁడనియు నమ్మి మిక్కిలి గౌరవించెను. పిమ్మట భోజరాజు సరిగా నిద్రపోవుచు నాకలిగలిగి భుజించుచు శుక్ల పక్ష చంద్రుఁడువోలె దినదినప్రవర్ధమానుఁడై యెప్పటియారోగ్యస్థితిఁజెందెను.

## చంద్రబింబ వర్ణనము

ఒకనాఁడు భోజుఁడు వేఁటకై వనమునకరిగి మిక్కిలి యాయాస పడి యొక చెఱువుగట్టునఁగూర్చుండి యచ్చటిచెట్ల చల్లగాలి ననుభవిచు చుండెను. అంతటఁ గ్రమక్రమముగా సాయంకాలమగుడు భానుఁడు పశ్చిమాద్రిశృంగము నలంకరించెను. వెన్నముద్దవలెఁ జందమామ యాకాశమున నుదయించెను. పండువెన్నెల కాయఁజొచ్చెను. మిక్కిలి చల్లనై పరమానందజనకమైన యా వెన్నెలను విడిచిపెట్టలేక భోజుఁ డచ్చటనే యా రాత్రిఁగడుప నిశ్చయించి సుఖనిద్రఁ జెంది తెల్లవాఱు నప్పుడు మేల్కాని పడమటికొండవైపున వ్రేలుచున్న చంద్రునిఁజూచి ప్రకృతి సౌందర్యమునకు మిక్కిలి సంతసించి మరల నగరమునకరిగి సభాసీనుఁడై పండితుల కీక్రిందిసమస్య నిచ్చెను—

శ్లో॥ "చరమగిరినితంబే చంద్రబింబం లలంబే"

అప్పుడు దండి యీ క్రిందిపాదము జేర్చెను,

'చలతి శిశిరవాతే మందమందం ప్రభాతే'

అప్పుడు కాళిదా సిట్లు పూరించెను,

'యువతిజనకదంబే నాథముక్తోష్ఠబింబే,
చరమగిరినితంబే చంద్రబింబం లలంబే'

తా॥ పడమటికొండ కటిప్రదేశమునఁ జంద్రుడు వ్రేలాడు చుండెను. ప్రభాతమునందు మెల్లమెల్లగా చల్లగాలి వీచుచుండెను. (దండి పూరించినది) పడుచు పడఁతుల యధరోష్ఠములను భర్తలు విడుచుచుండఁగా, (కాళిదాసుఁడు పూరించినది)

కాళిదాసుని వర్ణనము దండి వర్ణనముకన్న మిన్నగనున్నకతమున రాజు దాసునకే యెక్కువ బహుమానమిచ్చెను.

## ఱాతి పలక

నర్మదానదిలో బెస్తవాండ్రు చేఁపలుపట్టుచుండఁగా వారికొక ఱాతిపలక దొరకెను. దానిమీఁద నేదో వ్రాఁతయుండెను, అందుఁ గొన్ని యక్షరములు చెరిగిపోయి కనఁబడ కుండెను కొన్నిమాత్రమే కనఁబడుచుండెను. అది వ్రాఁతయున్న శిలా ఫలకమగుటచేత జాలరులు దానిని బాఱవేయనొల్లక మహారాజునకిచ్చుట మంచిదనితలంచి దానిం గొనిపోయి భోజునకు సమర్పించిరి. భోజుఁడా ఫలకమును జక్కఁగాఁ బరీక్షించి దానిమీఁద లక్కముద్రలు వేయింపఁగా నొకశ్లోకములో సగముభాగము దొరకెను అందీవిధముగా నుండెను,

శ్లో॥ అయి ఖలు విషమః పురాకృతానాం
భవతిహి జంతుషు కర్మణాం విపాకః

తా॥ జంతువులయందు పురాకృతములైన కర్మలయొక్క విపాకము విషమమై యుండునుగదా,

ఆ శ్లోకార్థము గ్రహించి భోజభూపాలుఁ డాత్మగతమున నిట్లు వితర్కించెను: "సముద్రములో వ్రాఁతయున్న శిలాఫలకము దొరకుటకుఁ గారణమేమి ? ఇందునకొక హేతు వుండవచ్చును. పూర్వము భగవానుఁ డగు నాంజనేయుఁడు వాల్మీకిరామాయణము సరిగానుండ లేదని తానొక రామాయణము రచియించి దానిని ఱాతిపలకలమీఁద వ్రాసి శ్రీరామునకు వినిపించెను. రఘురాముఁడు దాని నామూలాగ్రముగ విని, చిఱునవ్వు నవ్వి 'హనుమంతుఁడా ! నీపుస్తకములో నీప్రజ్ఞ లెక్కువ చెప్పుకొన్నావే' యని పలికెననియు, రాముఁడు మెచ్చని గ్రంథ ముండఁగూడదని, హనుమంతుఁడు దానిని మహాసముద్రములోఁ బాఱవైచె ననియుఁ బెద్దలు చెప్పుదురు. హనుమద్రామాయణమునందలి యొకపలక యిదియైయుండ వచ్చును. ఈపలకమీఁద గనఁబడుచున్న రెండుపంక్తులు హనుమద్రామాయణములోని యొక శ్లోకముయొక్క పూర్వార్థమై యుండవచ్చును. తక్కిన రెండుపాదములు సరిగా నెవరైనఁ బూరించినఁ జాలునుగదా" అని తలపోసి సభామంటపమునకుఁబోయి శ్లోక పూర్వార్థమిచ్చి యుత్తరార్థము పూరింపుమని భవభూతికిచ్చెను. భవభూతి యిట్లు చెప్పెను—

క్వ ను కుల మకలంక మాయతాక్ష్యాః
క్వ చ రజనీచరసంగమాపవాదః.

తా॥ సీతాదేవియొక్క నిష్కళంకమైన వంశమెక్కడ ? రావణ సంగమమయ్యెనను నపవాదమెక్కడ ?

భవభూతి విరచితమైన శ్లోకముయొక్క భావము భోజరాజునకు నచ్చకపోవుటచేఁ దానుగూడ మహాకవీశ్వరుఁడగుటచే నీక్రిందివిధముగా శ్లోకార్థము రచియించెను,

క్వ జనకతనయా క్వ రామజాయా
క్వ చ దశకంధరమందిరే నివాసః

తా॥ జనకుని కూఁతురు, రాముని భార్యయున్న సీతయొక్క శి? రావణుని మందిరమందు నివాసమెక్కడ?

తన రచనకూడ భోజమహీపాలునకు గుచింపకేసుంటుటచే నది కవిహృదయముకాదని సంశయించి కాళిదాసు విడిచి శేషించిన రెండు పాదములు పూరింపుమని యడిగెను. అతఁడు శ్లోకము నిట్లు సమగ్రము జేసెను :

శివశిరసి శిరాంసి యాని రేజుః
శివ శివ తాని లుఠంతి గృధ్రపాదైః,
"అయి ఖలు విషమః పురాకృతానాం
భవతి హి జంతుషు కర్మణాం విపాకః"

తా॥ ఏ తలలు శివుని శిరస్సునందు ప్రకాశించెనో యా తలలు, గ్రద్దల పాదములతో నేఁడు శివశివ నేల దొర్లుచున్నవిగదా.

అదివిని భోజమహారాజు కవిహృదయ మట్లే యుండునని నిశ్చయించెను. కాని, కాళిదాసునెడ నసూయగలపండితుఁడు "హనుమంతుని యుద్దేశ మదికా"దని వాదింప సంశయనివారణార్థమై యా శిలాఫలకము మీఁద మరల లక్కపోత బోయించి మిక్కిలి కష్టముమీఁద తక్కిన రెండుపాదములు స్పష్టముచేసి చదువఁగా శ్రీ కాళిదాసకవి పూరించి టె యుండుండెను. అప్పుడు భోజుఁడు సభాసదులు మితిలేని యానందము నొంది కాళిదాసుం గొనియాడిరి.

## బ్రహ్మరాక్షసుడు

భోజక్షితిపాలుఁడు రమణీయమైన తన యుద్యానవనమందు విలాసార్థముగా నొక దివ్యగృహమును గట్టించెను. గృహప్రవేశ సమయమునకుముందే యొక బ్రహ్మరాక్షసుఁడు గృహ

ప్రవేశముచేసి కూర్చుండెను. ఆ రాక్షసుఁడు రాత్రికాలమున నాగృహమున నెవ్వఁడువసించునో వానికడకుఁబోయి పాణినిరచియించిన వ్యాకరణశాస్త్రమునందలి సూత్రములు నాలుగు జాములకు నాలుగు చదివి వానికిఁ దగిన సమాధాన మిమ్మనికోరును. అతను కోరినప్రకారము సమాధానము చెప్పలేనివారిని జంపి భక్షించుచుండును. రాజు మంత్రశాస్త్రప్రవీణులైన యుత్తమబ్రాహ్మణులను బిలిపించి రాక్షసోచ్చాటనము కొఱకు బహుప్రయత్నము చేసెను. ఆ రక్కసుఁడు మంత్రింపవచ్చిన మహాబ్రాహ్మణులను సయితము భక్షించి కడుపు నిండినతరువాత మునుపు దనకువచ్చియుండిన శ్లోకములంజదువుకొనుచుఁ గూర్చుండును. చిట్టచివరకాయిల్లు భోజుఁడు వదలివేయవలసివచ్చెను. కడపటి ప్రయత్నము చేయుదమని కాళిదాసును బిలిచి యీ వృత్తాంతమతనితోఁ జెప్పెను. కాళిదాసుఁ డదివిని "రాజా! ఈ బ్రహ్మరాక్షసుఁడు సకలశాస్త్ర పండితుఁడు పైగా సత్కవి. ఎట్లైనను వానిని సంతోషపఱచి నే నీ గృహమునుండి వానిని వెడలఁగొట్టెదను. ఆ మాంత్రికులను బంపివేయుఁడు. నా మంత్రముఁ జిత్తగింపుఁడు" అని మనవిచేసి యా రాత్రి తా నా మందిరమున కరిగి పండుకొనెను.

రాక్షసుఁడు యథాప్రకారముగాఁ గాళిదాసున్నచోటికిఁబోయి మొదటిజామున పాణినీవ్యాకరణములోని "సర్వస్యద్వే" యను సూత్రమును జదివెను. కాళిదాసుఁడు వెంటనే "సుమతీకుమతీ సంపదాపత్తి హేతూ" అని యా పాదముఁ బూరించెను. రక్కసుఁడు రెండవ జామున మరల వచ్చి "వృద్ధో యూనా" యను సూత్రము పఠించెను. తత్క్షణమే కాళిదాసుఁడు "సహ పరిచయాత్ త్యజ్యతే కామినీభిః" అని పూర్తిచేసెను. మూఁడవజామున నా దైత్యుఁడు వెండియు వచ్చి "ఏకో గోత్రే" యను సూత్రమును జదివెను. అనంతరము మహాకవి "ప్రభవతి పుమాన్ యః కుటుంబం బిభర్తి" అని పాదము సమగ్రము

జేసెను. నాల్గవజామున దానవుఁడు తిరిగివచ్చి "స్త్రీపుంవచ్చ" యను సూత్రమును బఠించెను. కవిసార్వభౌముఁడు "ప్రచరతి గృహే తద్ధిగేహం వినష్టం" అని పూరించెను. నాల్గుజాములయందును దన యభిప్రాయము కాళిదాసుఁడు సరిగాఁ జెప్పుటచేత రాక్షసుఁడు మిక్కిలి సంతసించి ప్రభాతసమయమునఁ గాళిదాసును గౌఁగలించుకొని "మిత్రుఁడా! నీ బుద్ధివిశేషమునకు నేను మెచ్చితిని. కావలసిన వరమునిచ్చెద కోరుము" అని సాదరముగఁ బలికెను. నావుడు కాళిదాసుఁడిట్లనియె, "నీ వరములు నా కక్కఱలేదు. రాజుగారెంతో మనసుపడి యీ గృహమును గట్టించుకొన్నారు. దీనిని నీవు విడిచిపోయితివా వేయివరములిచ్చినట్లే" యని బదులు చెప్పెను. రాక్షసుఁడు మంచిదని యీ భవనమును విడిచి పోయెను. రాజు మహానందభరితచేతస్కుఁడై లోకోత్తర చరిత్రుఁడగు కాళిదాసును మిక్కిలి గౌరవించెను

శ్లోకము పూర్తియైనతరువాత నీ క్రిందివిధముగానున్నది—

శ్లో॥ 'సర్వస్య ద్వే' సుమతికుమతీ సంపదాపత్తిహేతూ
'వృద్ధో యూనా' సహ పరిచయాత్ త్యజ్యతే కామినీభిః
'ఏకో గోత్రే' ప్రభవతి పుమాన్ యః కుటుంబంబిభర్తి
'స్త్రీ పుంవచ్చ' ప్రచరతి గృహే తద్ధిగేహం వినష్టమ్.

ఇందులో మొదటి నాలుగుసూత్రములకు వ్యాకరణసంబంధమైన యర్థము వేఱు. వాటికే లోకసంబంధమైనయర్థములు గలవు. ఈ రెండవ యర్థము నుబట్టియే కాళిదాసుఁడు పాదపూరణము చేసెను.

తా॥ అందఱికి సంపదకు హేతువైన మంచిబుద్ధియు, నాపదకు హేతువైన చెడ్డబుద్ధియునని రెండుండును. పడుచువారితోఁ బరిచయము గలిగిన స్త్రీచేత వృద్ధుఁడు విడువఁబడును. ఏ పురుషుఁడు కుటుంబమును భరించి పోషించునో యతఁడొక్కఁడే గోత్రమందుఁ బుట్టినవాఁడు. ఏ స్త్రీ మగవానివలె సంచరించునో యీ గృహము నశించును.

## కుంపటి

ఉత్తర దేశమున శీతకాలమునఁ జలి మిక్కుటముగా నుండును. భోజుఁ డొకనాఁడు కుంపటి దగ్గఱ పెట్టుకొని చలిఁ బోఁగొట్టుకొనుచుండెను. అది యినుపకుంపటి, దానికి రెండు చక్రములుగూడ నుండెను. అప్పుడు కాళిదాసు మహారాజునుజూడ వచ్చెను. రాజు కవికులగురువైన కాళిదాసును జూచి యా కుంపటిని వర్ణింపుమని కోరెను. రాజు కోరిన ప్రకారము కాళిదాసిట్లు వర్ణించెను :

శ్లో॥ కవిమతి రివ బహులోహా సుఘటితచక్రా ప్రభాతవే ళేవ,
హరమూర్తి రివ హసంతీ భాతి విధూమానలోపేతా.

ఈ శ్లోకమునకు రెండర్థములు గలవు.

తా॥ కవియొక్క మనస్సువలె మిక్కిలియూహలుకలది (మంచియినుముతోఁ జేయఁబడినది) ప్రభాతవేళవలెఁ గూర్పఁబడిన చక్రవాకపక్షులు గలది, (రెండు చక్రములు కలది) శివునిమూర్తివలె చంద్రుఁడు, పార్వతి, నిప్పును గలది (పొగ లేని నిప్పుగలది) యై కుంపటి ప్రకాశించుచున్నది.

## అల్లాళ రాజు

ఒకనాఁడు భోజుఁడు కొలువుదీర్చి యుండ ద్వారపాలకుఁడు వచ్చి "దేవా! శ్రీశైలమునుండి యొక బ్రహ్మచారి వచ్చె" నని మనవిచేసెను. వెంటనే వానిని బ్రవేశపెట్టుమని రాజాన తిచ్చెను. అతఁడు ప్రవేశించి "చిరంజీవి" యని భోజునిదీవించి కూర్చుండ నతఁడు వానికిట్లనియె-"మహాత్మా! బాల్యమునందే కలికాలవిరుద్ధమైన యీ దుష్కరవ్రత మేల పూనితివి? ప్రతిదినోపవాసములచేత నీవు కృశించుచుంటివి. నీవు గృహస్థాశ్రమమును స్వీకరింపఁదలచితివేని యీ పట్టణమందలి బ్రాహ్మణులలో నెవరినైన నొడంబఱచి పిల్లనిప్పించి

పెండ్లి చేయుదును " అనవుఁడు బ్రహ్మచారి యిట్లనియె, "రాజా ! నీవు ప్రభువవు. నీ కసాధ్యమేమున్నది ? అయినను నిది వినుము;

శ్లో॥ సారంగాః సుహృదో, గృహం గిరిగృహా, శాంతిః ప్రియా గేహినీ,
వృత్తి ర్వన్యలతాఫలై, ర్నివసనం శ్రేష్ఠం తరూణాం త్వచః,
సద్వాక్యామృతపూరమగ్నమనసాం యేషా మియం నిర్వృతిః
స్తేషా మిందుకళావతంసయమినాం మోక్షేఽపి నో నస్పృహా.

తా॥ ఏ మహామునులకు జింకలు మిత్రములో, గృహము పర్వతగృహమో, ప్రియభార్య శాంతియో, జీవనము వనలతాఫలములో, వస్త్రము చెట్లయొక్క పట్టలో, అట్టి ప్రియవాక్యామృతముగల యోగులకు మోక్షముమీఁద సైతము కాంక్ష లేదు.

మేము నట్టియోగుల మేకనుక మాకు ధనకనకవస్తువాహనములకై కాంక్ష లేదు. కాని, మి మ్మొక్కకోరిక కోరుచున్నాను. నేను వారణాసి పోవలెననియున్నది. మీ యాస్థానపండితుల నందఱను నా వెంటఁబంపఁ గోరుచున్నాను. పండితగోష్ఠి చేసికొనుచుఁ బ్రయాణము చేయుట మిక్కిలి సుఖప్రదము " అనెను.

అదివిని రాజు భక్తితత్పరుఁడై యతనిపాదములకు నమస్కరించి తన యాస్థానకవులను, పండితులను వానివెంటఁ బొమ్మని యానతిచ్చెను. కవిపండితులందఱు వాని వెంటఁ జనిరి.

కాళిదాసుఁడు మాత్రము వెళ్ళలేదు. ఎందుకు వెళ్ళలేదని రాజాతని నడిగెను. కాళిదాసుఁడిట్లు బదులుచెప్పెను, " మీరు సర్వజ్ఞులు మీకే తెలియును—

శ్లో॥ తే యాంతి తీర్థేషు బుధా యే శంభో ర్దూరవర్తినః,
యస్య గౌరీశ్వర శ్చిత్తే తీర్థం భోజ పరం హి సః"

తా॥ రాజా ! ఎవరు శంభునకు దూరస్థులో, వారే తీర్థయాత్రలకుఁ బోదురు. ఎవని మనస్సునందు గౌరీపతియుండునో వాఁడే యుత్తమతీర్థము.

తీర్థయాత్రలు నిష్ఫలము లనీ పై శ్లోకముచే గాళిదాసు చెప్పి నందున రాజు మనంబునఁ గినిసి తన యాజ్ఞానుసార మతఁడు కాశికిఁ బోవలేదని కోపించి నిరంతర వేశ్యాలోలుఁడగు నాతని మునుపటివలె గౌరవింపక సావమానముగాఁ జూచెను. రాజాగ్రహము తన పై మునుపటివలె లేదని కాళిదాసు విచారించి యాతని యాస్థానమును విడిచి యల్లాళ దేశమునకుఁ బోయి దాని పరిపాలకుని జూచి :—" రాజా! మాళవేంద్రుఁడైన భోజుని యాస్థానకవిని నా పేరు కాళిదాసుఁడు. అతఁడనాదరణము చేయుటచే మీ యాస్థానముఁ జూడ వచ్చితిని " అని విన్నవించెను. అనవు డల్లాళరాజు " సుకవీ! భోజసభనుండివచ్చిన పండితుల వలన నీ కీర్తి పలుసారులు వింటిని. నీవు సరస్వతీదేవియొక్క యపరావతారమవఁట. నీ నోటనుండి యేదేని వినఁగోరుచున్నాను " అనిపలికెను. కాళిదాసుఁడు వాని ప్రతాపము నీ క్రిందిశ్లోకముతో వర్ణించెను,

శ్లో॥ అల్లాళక్షోణిపాల త్వదహితనగరే సంచరంతీ కిరాతీ
కీర్ణా న్యాదాయ రత్నా న్యురుతరఖదిరాంగారశంకాకులాంగీ
క్షిప్త్వా శ్రీఖండఖండం తదుపరి ముకుళీభూతనేత్రా ధమన్తీ
శ్వాసామోదానుయాతైర్మధుకరనికరై ర్ధూమశంకాం బిభర్తి.

తా॥ ఓ యల్లాళరాజా! నీవు నాశనముచేసిన శత్రురాజ పట్టణమందు చెంచుపడఁతియొకటి తిరుగుచు నక్కడక్కడఁ బడియున్న రత్నములను ప్రోగుచేసి యవి యెఱ్ఱనిచండ్రనిప్పులనుకొని మంటచేయుటకై వానిపై మంచిగంధపుపేళ్లువైచి కన్నులుమూసికొని యూదుచుండెను. దాని శ్వాసయొక్క సుగంధమునకై యచ్చటఁజేరిన తుమ్మెదగుంపు పొగవలె నుండెను.

ఆ శ్లోకమునిని యల్లాళరాజు వానికక్షరలక్షలిచ్చెను. బహువిధ శ్లోక రచనలచేత నా రాజును సంతోషపెట్టుచు, కాళిదా సచ్చటనే కొంతకాలముండఁగా, భోజరాజు కవిలోకసార్వభౌముఁడగు కాళిదాసుని

వియోగము సహింపఁజాలక మరల రమ్మని బ్రతిమాలుచు వానికడకు దూతలనంపి తనకడకు రప్పించుకొనెను.

## మరణవర్ణనము

భోజకాళిదాసు లొకనాఁడు పువ్వులతోఁటలో గూర్చుండి యిష్టాగోష్ఠిమై వర్తిల్లుచుండ రాజు కవింజూచి యిట్లనియె—"మిత్రుఁడా! నన్ను స్తోత్రముచేయుచు, నాకీర్తి వర్ణించుచు నీవనేకశ్లోకములు చెప్పితివి. అవన్నియు నాకు మిక్కిలి ప్రీతిగావించినవి నాకొకకోరిక కలదు కాదనక నీ వది తీర్పవలయును. నేను మరణమొందినతరువాత ధారానగర మెట్లుండునో నీనోట వినవలెనని యున్నది. అది చెప్పి నన్ను ధన్యుని జేయుము" అన వెంటనే కాళిదాసుఁడు కోపించి "రాజా! ఇది యేటి కోరిక. కుడిచి గూర్చుండలేక మరణవర్ణనము కోరఁదగునా? నీ యన్నముఁదినుచు నీవు జీవించియుండఁగా నీ మరణము వర్ణనము చేయుటకు నాకు నోరెట్లాడును? నే నట్లు చేయఁజాల" నని బదులు చెప్పెను. అప్పుడు రాజు మహాగ్రహము గలిగి కాళిదాసు నావలకుఁ బొమ్మనెను ఆ మహాకవి తానుంచుకొన్న విలాసవతి యను వేశ్యతోఁ గలసి యేకశిలానగరమునకుఁబోయి యచ్చట నివసించెను

భోజుఁడు తన మనోరథ మీరడేలేదని విచారించి కాళిదాసుఁ డున్నచోటు తాను చారులవలన నెఱిఁగి కాపాలికవేషముఁ దాలిచి యేకశిలాపురమున కరిగి రాత్రివేళఁ గాళిదాసుఁడున్న గృహమునకుఁ బోయి శంఖశాస్త్రోక్తమైనప్రకారము శంఖమును బూరించెను. "శాస్త్రోక్తముగా శంఖనాదము చేసినవాఁ డెవఁ" డని కాళిదాసుఁడు వీధిగుమ్మము లోనికి వచ్చి యడుగ నతఁడు కంఠమునుమార్చి "స్వామీ! నేను కాపాలికుఁడను. ధారానగరవాసుఁడ" నని చెప్పెను. "భోజరాజు పరిపాలించుచుండఁగా ధారానగరవాసులు బిచ్చమెత్తుకొనవలసిన యవసర

మెట్లుగలిగె" నని కాళిదాసు ప్రశ్నించెను. ఆ ప్రశ్న కుత్తరముగాఁ గాపాలికుఁడు "దేవా ! ఏమని విన్నవింతును. కొలఁదిదినములక్రిందటనే భోజరాజు స్వర్గస్థుఁడయ్యె" నని గద్గదస్వరముతోఁ బలికెను. అదివిని కాళిదాసుఁడు మూర్ఛిల్లి కొంతవడికిఁ దెలివి తెచ్చుకొని "హా! భోజరాజా! హా! మధ్యమలోకమందారమా, హా! కవిజనకల్పకమా, హా! పండితజన పారిజాతమా, నీకు మరణమాసన్నమగుటచేతనే నీమరణము వర్ణింపుమని నన్నుఁగోరితివి. "వినాశకాలె విపరీతబుద్ధిః" అనుమాట నిజమైనది" యని విచారించి తక్షణమే యీ క్రిందిశ్లోకము రచియించి చదివెను :

శ్లో॥ అద్య ధారా నిరాధారా, నిరాలంబా సరస్వతీ,
పండితాః ఖండితాః సర్వే, భోజరాజే దివం గతే.

తా॥ భోజరాజు స్వర్గస్థుఁడగుటచేత నేఁడు ధారాపట్టణము నిరాధారము. సరస్వతి యాలంబము లేనిదయ్యెను. పండితుల యాశలు భగ్నము లయ్యెను.

ఆ శ్లోకము కవినోటినుండి రాఁగానే కాపాలికుఁడు నిశ్చేష్టితుఁడై నేలఁబడియెను. అది చూచి కాళిదాసుఁ డక్కజపడి దీపముఁ దెప్పించి చూడ నతఁడు భోజరాజయ్యెను. "అయ్యో! పండితవాక్యము రిత్తవోవ దన్నమాట నిజము. భోజరాజు మృతుఁడయ్యెనని నానోట వెడలుటచే నతఁడు నిష్కారణముగా మృతుఁడయ్యెనే! అయ్యో! నాపోషకుఁడైన మహారాజును నేనే చంపుకొంటినే" యని విచారించి వెంటనే శ్లోకము మార్చి యిట్లు చదివెను,

శ్లో॥ అద్యధారా సదాధారా, సదాలంబా సరస్వతీ,
పండితా మండితాః సర్వే, భోజరాజే భువం గతే.

తా॥ భోజరాజు భూమినిఁ బాలించుటచే నేఁడు ధారానగరము మంచి యాధారము గలది. సరస్వతి మంచి యాలంబము కలది. పండితు లందఱు గౌరవింపఁబడుచున్నారు.

ఈ శ్లోకము చదువఁగానే కాపాలికుఁడు చైతన్యముగలిగి దిగ్గున లేచి నిలిచి కాళిదాసునకు నమస్కరించెను. కాళిదాసు వానిం గౌఁగలించుకొని "రాజా! యెంతపనిచేసితివి. నీ మరణవర్ణనము నానోట వినఁగోరి యీవేషము వైచుకొని వచ్చితివా? చాలుచాలు. దైవయోగమున మరల బ్రదికితివి" యని మందలించెను. భోజుఁడు కాళిదాసుని వెంటఁబెట్టుకొని ధారానగరమునకుఁ బోయెను.

## కాకికూతకు భయపడినస్త్రీ

భోజుఁడు ప్రచ్ఛన్నుఁడై దేశమందు దిరుగుచు నొకనాఁడు నర్మదానదీతీరమునం దున్న యొకగ్రామముఁ జేరి మధ్యాహ్నకాలమున నొకబ్రాహ్మణుని యరుగుమీఁదఁ గూర్చుండెను. ఆ బ్రాహ్మణుఁడు వృద్ధుఁడు, నియమవంతుఁడు. మధ్యాహ్నకాలమున నతఁడు వైశ్వదేవము చేసికొని కాకుల కన్నము వైచెను. అన్నము జూచినతోడనే 'కావుకావు'మని యనేకకాకులక్కడ జేరెను. కొన్నికాకులు శ్రుతికటువుగా నరచెను. పూర్ణయౌవనములో నున్న బ్రాహ్మణునిభార్య కాకులకూతవిని చెవులు మూసికొని "అమ్మో" యని గుండెచఱచుకొని నేలఁగూర్చుండెను. "భయకారణ మేమి" యని భర్త యడిగెను. "అయ్యో! కాకికూతలు కర్ణకఠోరముగా నున్నవి. నేను వాటినివిని సహింపఁజాలను. భయము వేయుచున్నది. ఊరక చూచు చున్నారేమి? వచ్చి నన్నుఁ గౌఁగలించుకొనుఁడు" అని భార్యపలికెను. పాపము భార్య భయపడుచున్నదని యావృద్ధబ్రాహ్మణుఁడు భార్యవీపుపైఁ దట్టి గట్టిగాఁ గౌఁగలించుకొనెను. ఇదియంతయు భోజరాజు కనిపెట్టి తనలో నిట్లనుకొనెను—"ప్రపంచమునం దింతమంది యాఁడువాండ్రను జూచితినిగాని యీమెవంటిదానిని జూడలేదు. ఈ బ్రాహ్మణుఁడు పట్టి

నెట్టివాఁడు. కాకికూతకు భార్య నిజముగా జడిసినదని వగచుచున్నాఁడు. ఈమె యెంతకైనను సాహసురాలని తోఁచుచున్నది. ఈ రాత్రి యిచ్చటనే యుండి యీ మెచర్యలఁ గనిపెట్టెద" నని నిశ్చయించుకొని యా రాత్రి యచ్చటనే యుండెను.

ఆ యిల్లాలు రాత్రి భర్తకు భోజనముపెట్టి పండుకొనఁబెట్టి నిద్రపట్టినదాఁక పాదములొత్తి తరువాతఁ దలుపులువైచి తన దూతికను బిలుచుకొని వచ్చి దానిచేతఁ గొంతమాంసముఁ దెప్పించి నర్మదానది యొద్దనకుఁబోయి యొక తెప్పపై నెక్కి మొసళ్లు మొదలైనవి తనమీఁదికి రాకుండ దూతిక తెచ్చిన మాంసఖండములు వానికెఱవైచి దూతికతోఁ గూడి నది కావలియొద్దుననున్న తన మనోహరునిఁ గలసికొని యారాత్రి యతనితో సుఖముగాఁ గాలక్షేపముచేయుటకుఁబోయి తెల్లవారు జామున నదేవిధముగాఁ మరల నిల్లుజేరెను.

ఈ సంగతినంతయు భోజరాజు కనిపెట్టి ధారానగరమునకు వచ్చినతరువాత నాస్థానకవులం జూచి "దివా కాకరుతా ద్భీతా" (పగలు కాకికి భయపడుచున్నది) యనుసమస్యనిచ్చి పూరింపుమనెను. తక్కినకవులు సందర్భము తెలియక యూరకుండిరి. కాళిదాసుఁడు "రాత్రౌ తరతి నర్మదాం" అని (రాత్రి నర్మదను దాఁటుచున్నది) రెండవపాదమును పూరించెను. సంతోషించి రాజు "తత్ర సంతి జలే గ్రాహాః" (ఆ నీటిలో మొసళ్లున్నవి) అని మూఁడవపాదము తాను పూరించెను. అప్పుడు కాళిదాసుఁడు "మర్మజ్ఞా సైవ సుందరీ" (ఆ సుందరాంగి దానికిఁదగిన యుపాయ మెఱుఁగును) యని నాలవ పాదము పూరించెను. మొత్తముమీఁద శ్లోక మిది;

శ్లో॥ దివా కాకరుతా ద్భీతా, రాత్రౌ తరతి నర్మదాం
తత్ర సంతి జలే గ్రాహాః; మర్మజ్ఞా సైవ సుందరీ.

## బాల వితంతువు

ధారానగరమున నొక బాల వితంతు వుండెను. ఆ యూర నొక సన్యాసి భిక్షాటనముచేత జీవించుచు నీ వితంతువుయొక్క గృహమందు బసచేసెను. ఆమె సన్యాసివలన మొట్టమొదట వేదాంతము వినఁగోరి యాతని శుశ్రూష చేసెను. క్రమక్రమముగా శుశ్రూష మైత్రిగాఁ బరిణమించెను. ఆమైత్రి వారిని వివాహముకానిదంపతులనుగామార్చెను. ఆ వార్త పట్టణమంతట పొక్కెను. జనులు విపరీతముగాఁ జెప్పుకొనఁ జొచ్చిరి. ఆనోటినుండియానోటఁబడి యామాట భోజభూపాలుని చెవింబడెను తన పట్టణమం దట్టియకార్యకరణము జరుగుచున్నదని విని రాజు కోపించి యా కపట పరివ్రాజకుని దేశమునుండి పాఱదోలెను. అతఁడు గోదావరీతీరమునకుఁ బోయెను. ఆతని వియోగము సహింపక యా బాలవితంతు విట్లు ప్రతిదినము విచారింపఁజొచ్చెను :

"నా కనుల చందమామ నారాయణా<br>
నన్నెడబాసెనోయి నారాయణా<br>
నాకింక గతియేమి నారాయణా<br>
సన్యాసిని జూపవోయి నారాయణా<br>
నా ప్రాణములు నిలుపవోయి నారాయణా<br>
నన్ను రక్షింపవోయి నారాయణా<br>
నా కాతఁడే దిక్కు నారాయణా"

అని సన్యాసిమీఁది ప్రేమచేతనై నను నిత్యము నారాయణస్మరణ చేయుచుండెను.

భోజుఁడు ప్రచ్ఛన్నవేషముతో నగరముఁ దిరుగుచు బాల వితంతువు వసించుచున్న వీధికిఁబోయి యామె యేడుపు విని మఱునాఁడు సభామంటపమునఁ గూర్చుండి "నారాయణా, నారాయణా" యను సమస్యనిచ్చి కవులం బూరింపుమనెను. కాళిదాసుఁ డిట్లు పూరించెను :

శ్లో॥ భిక్షా మట న్నత్ర తాగతః ప్రక్షాళయ న్నాశాస్మితైః
ఆదాయ మో మే మానసం గోదావరీతీరం గతః
సన్న్యాసినం భూయోపి తం ధన్యాకృతిం పశ్యామిచేత్
సారాదశా వై తంతపి నారాయణా, నారాయణా.

తా॥ ఓనారాయణా! నారాయణా! ఏసన్న్యాసి బిచ్చమెత్తుకొనుచు వచ్చి అన చిఱునవ్వులచేత నలుదిక్కులను బ్రకాశింపజేసి నా మనస్సును వశపఱచుకొని గోదావరీతీరమునకుఁ బోయెనో, సుందరుఁడైన యా సన్న్యాసిని మరలఁ జూచెడుభాగ్యముగలిగెనేని నా వితంతుదశ శ్రేష్ఠమైన దగును.

ఆ శ్లోకము విని సభవారందఱుఁ బకబక నవ్విరి. శ్లోకసందర్భ మంతయు భోజరాజు సభ్యుల కెఱిఁగించెను.

## ఢక్కా కవి విజయం

ఒక మహాకవి సరస్వతీదేవి నారాధించి యామె యనుగ్రహమున నొక ఢక్కా సంపాదించెను. అది వాయింపఁగానే, యతనితో వాదమునకు వచ్చిన పండితులనోరు పడిపోవును. అందుచేత నతఁడు "ఢక్కాకవి" యని ప్రసిద్ధిజెందెను. దానితో నతఁడు బహుదేశములు సంచరించి సకల రాజాస్థానపండితుల జయించి ధారానగరమున భోజుని యాస్థానమున పుంభావసరస్వతియని పేరువడసిన కాళిదాసుఁడను నొక మహాకవి యున్నాఁడని విని, యతనిం జయింపవలెనని ధారాపురమునకుఁ బోయి యొక సత్రమున బసచేసెను. ఆ వార్త విని కాళిదాసుఁడు "పండితునితో వాదమునకుఁ బోయినయెడల నతఁడు ఢక్కా వాయించి వాగ్బంధనము చేయు" నని భయపడి కూలివానివేషము వేసికొని యా కవికడకుఁ బోయి కొంతసేపు మాటాడి "మహానుభావా! మీ కన్నిసంగతులు తెలియును. నాకొక సందేహమున్నది. మీరే

తీర్పవలయును. తెల్లవాఱుచున్నప్పుడు కాకులు 'కా కా' యని యేల యఱచునో చెప్పవలె''నని యడిగెను. ఆప్రశ్నమునువిని ఛక్కాకవి "తనకది తెలియ" దని చెప్పెను. అప్పుడు కాళిదాసుడు "పోనిండు బాబూ! నాకు తెలిసినది చెప్పెద వినండి" అని యీ క్రిందిశ్లోకముఁ జదివెను.

శ్లో॥ వయం కాకా వయం కాకాః కిం రటంతీతి వాయసాః
తిమిరారి స్తమోహంతి శంకయాతంకమానసాః.

తా॥ కాకులు కాకాయని యెందుకఱచుచున్నవనఁగా సూర్యుఁడు చీఁకటులను నాశనము చేయుచున్నాఁడు. మేముగూడ నల్లగా నుండుట చేతఁ జీఁకటులనుకొని మమ్ముఁగూడ నాశనముచేయునేమో యను భయమున 'మేము చీఁకటులముకాము. మేము కాకులము, కాకులము. మాజోలికి రావలదు' అని సూర్యునిఁగూర్చి మొఱవెట్టుకొనుచున్నవి

ఆ శ్లోకమువిని ఛక్కాకవి "ధారానగరమందలి కూలివాండ్రుసైత మట్టి పండితులైనప్పుడు కాళిదాసునివంటి మహాపండితునితో వాదము వేయుట దుర్లభ"మని రహస్యముగా నాయూరు విడచి స్వదేశమునకుఁ బోయి మరలశాస్త్రములన్నియు గట్టిగాఁజదువుకొని తప్పక కాళిదాసును జయింపవలెనని నిశ్చయించుకొని సరస్వతి నుపాసించి మరల ధారానగరమునకుఁ బోయెను. ఆ సంగతివిని కాళిదాసు వెనుకటియట్లే వచ్చినవేషముతో నతని నెదుర్కొనవలెనని గుడ్డములు కాయువాని వేషము వేసికొని తలమీఁద గడ్డిమోపువెట్టుకొని ఛక్కాకవి దర్శనమునకుఁ బోయి కూర్చుండ ఛక్కాకవి ప్రాతఃకాల వర్ణనము చేయఁదలఁచి య స్తమించుచున్న చంద్రునిగుఱించి యీ క్రింది శ్లోకభాగము రచించెను :

శ్లో॥ చరమగిరి కురంగీ శృంగ కండూయనేన
స్వపితి సుఖ మిదానీ మంతరిందోః కురంగః;

తా॥ చంద్రునిలోనున్న మగలేఁడి పడమటికొండమీఁదనున్న యాఁడుఁలేడికొమ్ములతోఁగోకుటచేతనిప్పుడు సుఖముగానిద్రించుచున్నది.

అదివిని కాళిదాసుఁడు నవ్వి "స్వామీ! మీరు గొప్పకవులే గాని చిన్న పొరబాటు వేసినారు. ఆఁడు లేడికిఁ గొమ్ములుండవు కాఁబట్టి శృంగశబ్దముఁదీసివైచి తుండశబ్దముఁ బెట్టుఁడు. తక్కిన రెండు పాదములు నేను పూరించితిని చిత్తగింపుఁడు:

శ్లో॥ పరిణతి రవిగర్భవ్యాకులా పౌరుహూతీ
దిగపి ఘనకపోతీ హుంకృతైః క్రందతీవ.

తా॥ సూర్యుఁడనుకొడుకు కడుపులో నుండుటచేత నిండు చూలాలై తూర్పుదిక్కనుకాంత పావురపుకూఁతలను నెపమున నొప్పులు పడుచున్నదో యనునట్లున్నది.

అని కాళిదాసుఁడు సూర్యోదయమును వర్ణించెను. ఢక్కాకవి చంద్రాస్తమయము వర్ణించెను. ఆ శ్లోకమందలికల్పన మిక్కిలి రమణీయముగా నుండుటచే ఢక్కాకవి మిక్కిలి యాశ్చర్యపడి "నీ వెవ్వఁడ" వని యడిగెను. "అయ్యా! నేను కాళిదాసుగారి గుఱ్ఱపువాఁడ" నని యతఁడు బదులుచెప్పెను. ఆ మహాకవియొక్క గుఱ్ఱపువాఁడే యట్టి కవిత్వము చెప్పఁగలిగినాఁడు; కాళిదాసెంత ప్రతిభాశాలి యైయుండునో యని భయపడి యా ఢక్కాకవి చల్లచల్లగా నాయూరువిడిచి పోయెను.

భా ధ తి
కాళిదాసున
కొకానొకప్పుడు

భోజునిప్పైఁ గోపముకాగా ధారానగరముఁబాసి బోయపల్లెకుఁబోయి యచ్చట నతఁడు పల్లకులుమోయుచుండెనఁట! కాళిదాసుని వియోగము సహింపలేక భోజుఁడు మిక్కిలి పరితపించి తన యాస్థానకవీశ్వరుఁడుగా నున్న మహాకవి కట్టి దుర్దశ వచ్చినందుకు విచారించి యాతని నెట్లైనఁ

బట్టుకొనవలెనని నిశ్చయించి నిరంతరము తాను పల్లకినెక్కి దేశముల వెంబడిఁ దిరుగఁజొచ్చెను. ఎన్నఁడైన దైవవశమునఁ గాళిదాసుఁడు బోయయై వచ్చి తనపల్లకి మోయునేమోయని శంకించి యతఁడు బోయఁగా నున్నను దన మాటకుఁ బ్రత్యుత్తర మీయకపోఁడని తెలుచుగా నీ క్రింది శ్లోకార్ధము బఠించుచుండును,

శ్లో॥ అయ మాందోళికాదండ స్తవ బాధతి కిం భుజౌ

తా॥ పల్లకిదండి నీ భుజములను బాధించుచున్నదా ? పల్లకి మోయు బోయలు సాధారణముగా విద్యావిహీనులే గావున రాజడిగిన యా ప్రశ్నమున కెవ్వరు నుత్తరమీయలేదు. దైవవశమున నొకనాఁడు కాళిదాసుఁడే రాజు పల్లకి మోయవలసిచ్చెను. భోజుఁడు యథాప్రకారముగా వెనుకటిప్రశ్నము బోయలనడిగెను. బోయగానున్న కాళిదాసుఁడు వెంటనే యిట్లుత్తరమిచ్చెను,

శ్లో॥ నాయ మాందోళికాదండ స్తవ బాధతి బాధతే.

తా॥ పల్లకిదండి నన్నంతగా బాధించుటలేదు. కాని, 'బాధతి' యని నీవుచేసిన తప్పుప్రయోగము నన్ను బాధించుచున్నది.

అక్కడి క్రియాపదము 'బాధతే' యని యుండవలయుఁగాని 'బాధతి' అని యుండఁగూడదు. అపశబ్దప్రయోగము కర్ణకఠోరమగుటచే మహాకవి యూరకుండఁజాలక ప్రత్యుత్తరమిచ్చెను. ఆ యుత్తరము విని బోయలలోఁ దప్పక కాళిదాసున్నాఁడని తెలిసికొని భోజుఁడు పల్లకినుండి దుమికి కాళిదాసుం బోల్చిచూచి పాదములపైఁబడి నమస్కరించి బ్రతిమాలి తనవెంటఁ గొనిపోయెను.

## పర్వము

భోజధారుణీశ్వరుఁ డొకనాఁడు

కాళిదాసుం జూచి భారతమును, చెఱుకుగడ్డను, సముద్రమును వర్ణింపుమని యీ క్రిందివిధముగా నడిగెను :

శ్లో॥ భారతం చేక్షుఖండంచ సముద్రమపి వర్ణయ,

తా॥ ఆ వర్ణించుటలో మూఁడింటియందుఁ గలవిశేషముల నొక్క మాటలోఁ జెప్పవలయు నని కోరెను. కాళిదాసుఁ డిట్లు వర్ణించెను :

పాదేనై కేన వక్ష్యామి ప్రతిపర్వారసోదయం.

తా॥ ఒక్క పాదములోనే చెప్పెదను. ప్రతి పర్వమునందు రసోదయము కలుగును.

అనఁగా భారతమునందలి ప్రతిపర్వమునందును రసమున్నది. పర్వ మనఁగా కణుపునకర్థమున్నది గనుక చెఱుకునఁ బ్రతిపర్వమున రసమున్నది. పర్వమనఁగా నమావాస్య, పున్నమి మొదలగువానికిఁగూడ నర్థమున్నది కనుక సముద్రమునఁ బ్రతిపర్వమునందు రసోదయము కలుగును. అనఁగా పొంగును. ఆ పర్వశబ్ద ప్రయోగముచేత భోజుఁడు మహానందభరితుఁడై కాళిదాసువంటి రసపుష్టి చేయఁగలకవి మఱియొకఁడు లేఁడని స్తుతించెను.

బీ బి

భోజరాజు తనదేశమునఁ గల ప్రజల సౌఖ్యము నరయుటకై గ్రామములవెంట సంచరించుచుండ నతని కొకసారి విశేషదాహమయ్యెను. సమీపముననున్న నదికడకుఁ బోయి యతఁడు దాహశాంతి చేసికొనెను. ఆ నదిలో నొకమూల చాకలి వాఁడు ఱాతిపై బట్టలుతుకుచు శ్రమనివారణార్థముగ నేదోయొకమాట ననుకొనుచుండవలెనని బీబీబీబీ యనుచుండెను. భోజుఁ డచ్చటఁ గొంతసేపు నిలువంబడి యీ శబ్దమువిని పట్టణమునకుఁబోయినతరువాతఁ గాళిదాసుని బిలిచి యీ క్రిందిసమస్య నిచ్చెను:—

బీబిబి బీబీబి బిబీబి బీబిః ”

అద్భుతమైన యీ సమస్యను సకలరహస్యవేది యైన కాళిదాసు డిట్లు పూరించెను :

శ్లో॥ మధ్యాహ్నకాలే మలినాంబరాణాం
ప్రక్షాళనార్థం రజకః కరాభ్యాం
పాషాణపృష్ఠేన కరోతి శబ్దం
బీబీబి బీబీబి బిబీబి బీబీ.

తా॥ చాకలిమడేలు మధ్యాహ్నకాలమున రాతిమీఁద బట్టలుతుకుచు "బీబీబి బీబీబి బిబీబి బీబి" యని ధ్వనిచేసెను.

అదివిని రాజు మిక్కిలి సంతసించెను.

## చంద్రహాసము

ఒకనాఁడు కాళిదాసకవిసమేతుఁడై భోజవసుంధరావల్లభుఁడు పున్నమనాఁటిరేయి, చలువలు వెదఁజల్లుచు నయనపర్వము చేయుచు విశ్వమంతయు వెండిపూఁత పూసినట్లు వెన్నెలఁ గాయుచున్న చంద్రమండలమును జూచి తానా జాబిల్లిలోని కళంకము నీ క్రింది విధమున వర్ణించెను :

శ్లో॥ అంకం కేపి శశంకిరే, జలనిధేః పంకం పరే మేనిరే
సారంగం కతిచిచ్చ సంజగదిరే, భూఛ్ఛాయమైచ్ఛన్ పరే.

అని రెండుపాదములుచెప్పి యుత్తరార్థమును సంపూర్తి చేయుమని కాళిదాసు నడిగెను. అప్పుడు కాళిదాసుఁ డిట్లుపూరించెను :

ఇందౌ య ద్దళితేంద్రనీలశకలశ్యామం దరీదృశ్యతే,
త త్సాంద్రం నిశి పీత మంధతమసం కుక్షిస్థ మాచక్ష్మహే.

తా॥ చంద్రునిలోని నలుపును గొందఱు మచ్చ యందురు. కొందఱు సముద్రమునుండి యంటుకొన్న బురదయందురు. కొందఱు లేడియందురు, మఱికొందఱు భూమియొక్క నీడయందురు (భోజుఁడు) నలగఁగొట్టఁబడిన యింద్రనీలమాణిక్యములతునుకలముద్దవలె నగుపడు

చున్న యీ నలుపును రాత్రియందు చంద్రుఁడు మ్రింగినైని కడుపులో నిల్చిన చీఁకటియని మేము తలంచెదము (కాళిదాసుఁడు)

ఉత్తరార్థ మతిమనోహరముగానుండుటచే భోజుఁడు సంతోషించి చంద్రునిఁ గళంకరహితునిఁగా వర్ణింపుమని యతనింగోరెను. కాళిదా సిట్లు వర్ణించెను:

శ్లో॥ లక్ష్మీక్రీడాతటాకో, ధవళరుచిగృహం, దర్పణం దిగ్వధూనాం,
పుష్పం శ్యామాలతాయా, స్త్రిభువనజయినో మన్మథ స్యాతపత్రం
పిండీభూతం హరస్యస్మిత, మమరధునీపుండరీకం, మృగాంకో
జ్యోత్స్నాపీయూషవాపీం జనయతి, నికర స్తారకాగోళకానాం.

తా॥ ఈ చంద్రమండలము లక్ష్మీదేవియొక్క క్రీడాసరస్సు. తెల్లని కాంతికి నిలయము, దిక్కులనెడు స్త్రీల యద్దము, రాత్రియనెడు తీగను బూసిన పువ్వు, ముజ్జగములను జయించునట్టి మన్మథుని గొడుగు, ముద్దగాఁ జేయబడిన శివుని నవ్వు, ఆకాశగంగలో మొలచిన తెల్ల దామరపువ్వు, చుక్కలనెడు గుండ్లయొక్క సమూహమునై వెన్నెల యనెడు నమృతపుబావిని గల్పించుచున్నది.

కవులు నిరంకుశులగుటచేత నేవస్తువునైనను మంచిదిగాను, చెడ్డదిగాను, వారి యిచ్ఛాప్రకారము వర్ణింపఁగలరు కనుకనే కాళిదాసుఁడు చంద్రునిఁ గళంకసహితునిగాను, కళంకరహితునిగాను వర్ణించి యున్నాఁడు. ఆ రెండు వర్ణనలు విని రాజు పరమహర్షమునొంది గొప్ప బహుమానము చేసెను.

## పండిత ప్రయోగము

కాళిదాసుమీఁద భోజమహారాజునకు మిక్కిలి యనురాగము గలిగి యుండుటచే విద్వద్బృంద మా కవిమీఁద నసూయబూని యతని కెట్లయిన నపకారము సేయఁ దలంచిరి. రాజుయొక్క యంతఃరపు

సేవకురాలగు తరంగవతి యనుదానిని వారు పిలిచి దానికిఁ దగిన బహుమానములిచ్చి ప్రతిమాలి కాళిదాసు నెట్టిన దేశమునుండి వెడలఁ గొట్టునట్టి యుపాయముబన్ని రాజున కతనిపై ద్వేషము కలిగింపుమని చెప్పిరి. "నాకొక ముత్యాలహారము మీరిచ్చినపక్షమున నే నీ పనిఁ దప్పక చేసెద" నని యా తాంబూలవాహిని ప్రత్యుత్తర మిచ్చెను. బండితు లెట్లో మౌక్తికహారము సంపాదించి దానికిచ్చిరి. అది సంతోషించి సమయముకొఱకు నిరీక్షించుచుండెను.

ఒకనాఁడు రాజు పండుకొనియుండ తాంబూలవాహినియగు తరంగవతి నరపాలునకు బాదములొత్తి తనకు నిద్రవచ్చినట్లు నటించి మంచముక్రిందఁ బండుకొని తెలిసియుండియే యిట్లు పలవరించెను, "ఓసీ! మదనమాలినీ, దుర్మార్గుఁడైన యా కాళిదాసు దాసీవేషముతో నంతఃపురముఁ బ్రవేశించి లీలావతీదేవితో రమించుచున్నాఁడు" రాజునకు సరిగా నిద్రపట్టకపోవుటచే నామాటలు విని యదరిపడి లేచి "తరంగవతీ! మేలుకొన్నావఁటే" యని యడిగెను. అది గాఢనిద్రపోవునట్లు నటించి ప్రత్యుత్తర మీయకపోయెను. అప్పుడు రాజు తనలో నిట్లువితర్కించెను– "ఈ తరంగవతి నిద్రయందు కలగని మును పెఱిగినదగుటచే దేవియొక్క దుశ్చరితమును బలవరించుచున్నది. కాళిదాసు స్త్రీవేషముతో నంతఃపురముఁ బ్రవేశించుచున్నాఁడన్నమాట నమ్మఁదగినది. అఁదు వాండ్ర గుట్టు నెవ్వఁ డెఱుఁగఁగలఁడు ?" అట్లు వితర్కించి రాజు మఱునాఁడు తనకు జ్వరము వచ్చినదని పండుకొని కాళిదాసును బిలిపించి యతఁడు వచ్చినతరువాత లీలావతీదేవినిగూడ బిలిపించి "దేవీ! ఇప్పుడు నాకు పథ్యము దెప్పింపు" మని పలికెను. మంచిదని దేవి లోనికరిగి పథ్యముఁ దెప్పించి వెండిపాత్రలో నన్నము పెసరపప్పు వడ్డించెను. వారి యభిప్రాయములఁ దెలిసికొనవలెనని రాజొక శ్లోకములో రెండుపాదములు రచించి యిట్లు చదివెను :—

శ్లో॥ ముద్గదాళీ గదవ్యాళీ కవీంద్ర వితుషా కథం,

తా॥ కవిశేఖరా! రోగమునకు సర్పమువంటిదైన పెసరపప్పు పొట్టులేకున్న దేమి?

దేవి సమీపమందున్నను సరకుసేయక కాళిదాసుఁడు పై శ్లోకము యొక్క యుత్తరార్థ మిట్లు పూరించెను,

అంధోవల్లభసంయోగే జాతా విగతకంచుకా.

తా॥ అన్నమను భర్తను గూడుచున్నదిగనుక పెసరపప్పు ఱవికను దీసివైచెను.

లీలావతీదేవి యపరశారదవలె విద్వాంసురాలగుటచే శ్లోకార్థమును గ్రహించి మందహాసముచేసి తలవంచుకొని ప్రక్కగా నిలిచెను. అది కనిపెట్టి రాజు తన మనంబున నిట్లు విచారించెను. "ఈమె కాళిదాసుతో నిశ్చయముగా మైత్రికలిగియున్నది. అందుచేతనే యీమె సమీపమందున్నదనియైన శంకింపక యితఁడు మోటమాటలతో శ్లోకార్థము పూరించెను ఈమెగూడ నామాటలు విని సిగ్గుపడక చిఱునవ్వునవ్వినది. స్త్రీలచరిత్ర మెవ్వఁడెఱుఁగును?

శ్లో॥ అశ్వప్లుతం, వాసవగర్జితంచ, స్త్రీణాంచచిత్తం, పురుషస్యభాగ్యం
అవర్షణం చా, ప్యతివర్షణంచ, దేవో నజానాతి; కుతో మనుష్యః.

తా॥ గుఱ్ఱపు నడక, మేఘ గర్జనము, స్త్రీలయొక్క చిత్తము, పురుషుని భాగ్యము, అతివృష్టి, అనావృష్టి దేవతలైనను దెలిసికొనలేదు. ఇంక మనుష్యులకుఁ దెలియునా?

ఈతఁడు బ్రాహ్మణుఁడు కావున దారుణాపరాధము చేసినను వీనిం జంపఁగూడదు. అదియునుఁగాక యితఁడు సరస్వతీదేవియొక్క యవతారము" అని విచారించి మహారాజు కాళిదాసునుజూచి "ఓ కవీ! నీ విఁక నా దేశమునందుండవలదు. మాఱువలుకక వెంటనే లేచిపొ"మ్మని యానతిచ్చెను. తక్షణమే కాళిదాసుఁడు లేచి రాజు సన్నిధిని విడిచి నిజవేశ్యాగృహంబునకుఁ జని దానితో నిట్లనియె——

"ఓ ప్రియురాలా! నాకనుజ్ఞ యిమ్ము. భోజునకు నామీఁద మహాకోపము వచ్చినది. తనదేశమునుండి నన్నుఁబొమ్మని సెలవిచ్చెను. ఇఁక నేనిచ్చట నాలస్యము చేయరాదు. ఇదియంతయు నామీఁద నీర్ష్య వహించిన పండితుల దౌర్జన్యమని తోఁచుచున్నది. కానున్నది కాక మానదుగదా! బలహీనులైనను బదిమందిచేరి యాలోచించినచో వారిని గెలుచుట కష్టము గడ్డిపోఁచలు పేని వెంటిగాఁ జేసినపక్షమున నది యేనుఁగులనైన బంధించునుగదా"

ఆ పలుకులు విని వేశ్యయైన విలాసవతి కాళిదాసున కిట్లనియె—"ఓనాథా! నేను బ్రదికియుండఁగా మీకు రాజుతోఁబనియేమి? రాజుగా రిచ్చినధనము మీ కక్కఱలేదు. మీరు నాయింటనే యెవ్వరికిఁ గనఁబడ కుండ లోపలిభాగములో నుండుఁడు కాని దేశములపాలై పోవలదు" ఆ ప్రియురాలి యుపదేశము ప్రకారము కాళిదాసుఁడు దానిగృహముననే యుండి యెవ్వరికిం గనఁబడకుండఁ గాలక్షేపము చేయుచుండెను.

కాళిదాసుఁడు రాజగృహము వెడలిపోయినతరువాత లీలావతీ దేవి యిట్లనియె, "దేవా! కాళిదాస మహాకవితో మీకు గాఢమైత్రి కలదుగదా! అట్టి చిరమిత్రుని మీరేల దేశమునుండి వెడలఁగొట్టిరి? ఈ యనుచితకార్య మేల చేయవలసె? చెఱుకుగడ్డ కణుపుగణుపునకు దియ్యగా నుండునట్లు సజ్జనమైత్రి సర్వదా హితము చేయుచుండును. దుర్జనులమైత్రి దీనికి విపరీతముగా నుండును.

శ్లో॥ శోకారాతిపరిత్రాణాం, ప్రీతివిశ్రంభభాజనం,
కేన రత్న మిదం సృష్టం మిత్ర మిత్యక్షరద్వయం.

తా॥ దుఃఖమనెడి శత్రువునుండి రక్షించునది, విశ్వాసమునకుఁ బాత్రమైనది, శ్రేష్ఠమైనది యైన 'మిత్ర' మను పదమునందలి రెండక్షరముల నెవఁడు కల్పించెనోగదా?"

దేవి యట్లడుగ భోజుఁడు తనమనంబునంగల యానవృత్తాంతము నామెతోఁ జెప్పెను. తనమీఁది యనుమానముచేత నే భర్త కాళిదాసును వెడలఁగొట్టెనని విని దేవి యాశ్చర్యపడి యిట్లనియె-" దేవా! మీవంటి భర్త దొరకుటచే నిశ్చయముగా నేను ధన్యురాలను. మీ సహవాస మింతకాలము చేసినతరువాత నా మనస్సు పరునిమీఁది కెట్లుపోవును? మీ చక్కదనముచేత మీ రెల్లపడఁతుల మనసులందు నుండదగినవారు. నేను పతివ్రతనో కానో మీరిప్పుడు నిర్ణయింపకపోయినపక్షమున మరణించెదను" అనవుడు రాజు మంచిది యట్లేచేసెదనని త్రాచుపామూతో నున్న కుండను, నెఱ్ఱగాఁగాలిన యినుపగుండును, బాణమెక్కు పెట్టఁబడిన విల్లును దెప్పించెను. అప్పుడు దేవి స్నానముచేసి తన పాతివ్రత్యమహాగ్ని చేత దేదీప్యమానముగా వెలుఁగుచు సూర్యమండల కభిముఖియై "ఓ జగన్మిత్రమా! భగవానుఁడా! సూర్యుఁడా! నీవు సర్వసాక్షివి. మేలుకొన్నప్పుడు, నిద్రించునప్పుడు, కలగన్నప్పుడు సయితము భోజుఁడే నాకు భర్త. నా మనసునం దన్యపురుషుని నిలిపియెఱుఁగ" నని గంభీరముగాఁబలికి త్రాచుపామును ముద్దు పెట్టుకొని, కాలిన యినుపగుండు చేతఁబట్టుకొని, బాణ మెక్కు పెట్టిన విల్లుతోఁ దన్ను గొట్టుకొనెను. ఆమెను సర్పము కఱువలేదు, అగ్నిహోత్రుఁ డామెచేతిని గాల్పలేదు, బాణఘాతమున నామెకుఁ గాయముకాలేదు. అట్లు దివ్యప్రమాణములను మూఁడింటిని జేసి చెక్కుచెదరక ఘటము పెట్టిన పుత్తడిబొమ్మవలె నిలిచి యున్న లీలావతీదేవిని జూచి రాజు సిగ్గుపడి పశ్చాత్తాపమునొంది నిష్కారణముగా మహాకవిని వెడలఁగొట్టినందుకు మిక్కిలి విచారించెను. కాళిదాసు విరహమును సహింపలేక నిద్రాహారములు మాని యెప్పటి యట్ల మంత్రిసామంతులతో మాటలాడక రాజ్యవ్యాపారములను జూచుకొనక చింతిల్లుచుండెను.

## పలాయనము

భోజభూపాలుని సభ కాళిదాసుడు లేక పోవుటచే చంద్రుడు లేని రాత్రివలె, సూర్యుడు లేని దినమువలె భర్తృ వియోగము జెందిన కాంతవలె; నింద్రుడు లేని దేవసభవలె, కళాహీనమై యుండెను. అది మొదలుకొని యెవనినోటను సరసమైనశ్లోకము వెడల లేదు. ఎవనిముఖమున రసవంతమైనకావ్యము జనింపలేదు. వినోదకరము లైన సంభాషణములు లేవు చమత్కారములుగల సమస్యలు లేవు. అట్లు కొన్నిదినములు గతించినపిదప రాజొకనాటిరేయి పూర్ణచంద్రమండల మును జూచి లీలావతీదేవియొక్క ముఖబింబమునుజూచి యిట్లు ప్రాకృత భాషలో పలికెను :

"తుళ్ళణం అఃఖ అణుసరఇ గ్లా ముహచందస్ససోహ్మ ఏదాఏ"

తా॥ పూర్ణచంద్రమండలమునకు నేత్రములెక్కడివి ? మాట లెక్కడివి ? అనగా చందమామ దేవిముఖమును నొకవేళ బోలి యున్నను, దేవికున్నట్లు కన్నులులేవు. సరసమైనమాటలులేవు. అందు చేత దేవిముఖమే చంద్రమండలముకంటె శోభావంతమైనదని భావము.

అతడు మఱునాడు యుదయమునను గాలకృత్యములం దీర్చికొని సభకేగి యీ సమస్యను బూరింపుమని విద్వద్బృందమునకిచ్చి "ఈ సమస్యను మీరు పూరింపజాలనిపక్షమున నా దేశమును విడిచి పోవలయును" అని కఠినముగా బలికెను. కవులు సమస్యను దీసికొని భీతచేతస్కులై తమతమ గృహముల కరిగిరి.

దాని యర్థము దెలిసికొనుటకై వారు చాలసేపు విచారించిరి గాని, బోధపడలేదు అందఱుగలసి యేదో యాలోచనచేసి బాణుని రాజుకడకుబంపిరి. అతడు రాజును సమీపించి వారముదినములు గడు వియ్యవలసినదనియు, గడువులోపల సమస్య పూరింపనియెడల దేశము విడిచిపెట్టి తాము పోవనిశ్చయింపబడినదనియు జెప్పెను. రాజందుకు. సమ్మతించెను. ఎనిమిదిదినములు గడచెను. ఎనిమిదవనాటి రాత్రి

కవులు సమావేశమైరి. అప్పుడు బాణుఁడు వారితో నిట్లనియె-"మనము యౌవనమదముచేతను, రాజసన్మానమదముచేతను, స్వల్పవిద్యామదము చేతను, కాళిదాసును వెడలఁగొట్టించితిమి. సామాన్య విషయములో మనమందఱము కవులమే. విషమస్థితి వచ్చినప్పు డతఁడొక్కఁడే కవి. అతనిని వెడలఁగొట్టించినఫలము మనమిప్పు డనుభవించుచున్నాము. సామాన్య బ్రాహ్మణుని ద్వేషించిన వంశనాశనమగును. కాళీస్వరూపుని ద్వేషించిన విద్వత్కులమే నాశనమగును" అని బాణుఁడు పలుక వా రొండొరులతోఁ గలహించిరి. మయూరుఁడు వారి కలహము వారించి యిట్లుపలికెను—"నేఁటితో మనకు గడువు ముగిసినది. కాళిదాసు లేఁడుగనుక సమస్యాపూరణమునకు సమర్థులులేరు. కాఁబట్టి మనము నేఁటి రేయి చంద్రాస్తమయము కాఁగానే పట్టణము విడిచి పోవుదము. పోకపోతిమా రాజసేవకులు బలవంతముగా మనలను మెడబట్టి గెంటి పంపివేయుదురు. కాఁబట్టి యీశరీరములతో మెల్లగా నావలకుదాఁటుట మంచిది. మీ కిష్టమైనయెడల నిట్లు చేయుదము" అతని యుపదేశ మంద ఱంగీకరించి గృహములకుఁబోయి సామాను లెడ్లబండ్లమీఁద వైచి యర్ధరాత్రి మూరువిడిచి పోయిరి.

కాళిదాసుఁడు విలాసవతీ మందిరముయొక్క యుద్యానవనమం దుండి పాఱిపోవుచున్న యీ కవుల కంఠధ్వనుల గుర్తుపట్టి పరిచారికం బిలిచి వారెవ్వరో కనుఁగొనిరమ్మని పంపెను. అది వారింజూచి పోయి "బాణమయూరాదులు పలాయితు లగుచున్నా"రని తెలిపెను. ఆమాటలు విని కాళిదాసుఁడు వారి నెట్లయిన రక్షింపవలెనని బట్టలు తెమ్మని పరిచారిక కాజ్ఞాపించెను. అది తెచ్చియిచ్చుటయు, నతఁడు చారణవేషముధరించి ఖడ్గము చేతఁబూని యుత్తరముఖముగా బైలుదేఱి యర్ధక్రోసుదూరము నడచి వారిం గలసికొని చారణభాషతో వారి కిట్లనియె—"ఓ విద్యాసముద్రులారా! భోజసభయందుఁ గడుగౌరవము

సంపాదించి బృహస్పతి సమానులైరి. మీ కందఱకు క్షేమమా! మహారాజుగారు కుశలముగ నున్నారా? నేను భోజరాజదర్శనముకొఱకు ధనకాంక్షినై కాశీనుండి వచ్చియుంటిని. నేను బట్టు వాఁడను" ఆ మాటలువిని వారందఱునవ్వి బైలుదేరిరి. అందులో నొక పండితుఁడు వానిమాట కుత్తరము చెప్పఁదలఁచి తమకు రాజు సమస్యనిచ్చుటయు, నది తాము పూరింపలేకపోవుటయు, నా కారణమున రాజాజ్ఞచే దేశభ్రష్టులగుటయుఁ జెప్పెను. సమస్య యేమిటని చారణుఁ డడుగ నా విద్వాంసుఁ డది చదివెను. అదివిని చారణుఁడు దాని యుత్తరార్థ మిట్లు పూరించెను:

"అణు ఇది బంణయది, కహం అణుకిది తస్సప్పడిపడి చందస్స?"

సమస్యాపూరణము మిక్కిలి చమత్కారముగానున్నదని సంతసించి వారందఱు చారణునకు నమస్కరించి పాఱిపోననవసరములేదని బండ్లు వెనుకకుఁ ద్రోలించుకొని మరల నిండ్లకుఁబోయి మఱునాఁడు రాజసభ కరిగి స్వస్తివాక్యములుపలికి యుచితాసనములపైఁ గూర్చుండిరి. అప్పుడు బాణుఁ డిట్లనియె—"దేవా! సర్వజ్ఞులైన మీ మాట నీశ్వరుఁ డొక్కఁడే యెఱుఁగఁగలఁడు. కుక్షింభరులమైన మే మెఱుఁగు టెట్లు? అయినను దోఁచినట్లు సమస్యాపూరణము చేసినాము చిత్తగింపుఁడు:

"తులణాం అణు అణుసరఇ గ్లా ముహాచందస్స సోహవదావ

అణు ఇది బంణ యది, కహం అణుకిది తస్సప్పడిపడిచందస్స?"

తా॥ పూర్ణచంద్రుఁ డీ మొముఖమును బోలవచ్చును. కాని వానికి నేత్రములు లేవు. వచోవిలాసములు లేవు. నిశ్చయముగా సరిపోలునని చెప్పుచున్నారు కాని, పాడ్యమినాఁటి చంద్రుఁ డా మెమొగము నెట్లుపోలును?

అదివిని భోజుఁడు తన యభిప్రాయము సంపూర్ణముగా వచ్చినదని సంతసించి యది కాళిదాసుఁడే పూరించియుండవచ్చునని భావించి యాతఁ డొకపూటప్రయాణదూరములో నుండవచ్చునని యూహించి

బాణునికి గొప్ప బహుమానము చేసెను. పండితులందఱుc దమతమ గృహములకరిగిరి. బాణుcడా బహుమానధనము తక్కిన పండితులకుc బంచిపెట్టక తానొక్కcడే గ్రహించుటచేత విద్వాంసులు మత్సరము పూని యీ సంగతి రాజుతో విన్నవింపcబోయిరి. రాజు వారి మొఱ నాలకించి సమస్యాపూరణ మెట్లు జరిగినదని వారి నడిగి చారణు వలన నది పూరింపcబడినదని తెలిసికొని కాళిదాసుcడు చారణవేషముతో సమీపముననున్నాcడని యూహించి సతని నెట్లైనc బట్టుకొమ్మని సేవకుల కానతిచ్చెను. వారు పట్టణమంతయు వెదకి వేసారి యెందు నతనిc గనుc గొనలేకపోయిరి. ఎట్టకేల కడుగులజాడలcబట్టి విలాసవతీ గృహంబున నున్నాcడని యెఱింగి రాజు సపరివారముగా దాని గృహమున కరిగెను. అక్కడ భోజుcడు కాళిదాసుం గనుంగొనెను. వారు చిరవిరహతాపము శమించునట్లు పరస్పర గాఢాలింగనము చేసికొనిరి. ఉభయుల నేత్రముల నుండి యానందబాష్పములు స్రవించెను. కాళిదాసుని బాష్పముల భోజమహారాజు స్వహస్తములc దుడిచెను. ఆ కవిశేఖరుని నృపాలుcడు తన గుఱ్ఱముమీcద నెక్కించుకొని సపరివారముగా సభామందిరమునకుc బోయి యానందసముద్రమున నోలలాడెను.

ఆనాcడు సంతోషాతిశయమున భోజక్ష్మావల్లభుcడు పండిత మండలి కీ క్రిందిసమస్య నిచ్చెను :

శ్లో॥ పరిపతతి పయోనిధౌ పతంగః,

రెండవపాదమును బాణుcడిట్లు పూరించెను :

సరసిరుహో ముదరేషు మత్తభృంగః

మహేశ్వరకవి యిట్లు చదివెను .

ఉపవనతరుకోటరే విహంగః

కాళిదాసుc డిట్లు పూరించెను :

యువతి జనేషు శనై శ్శనై రనంగః.

తా॥ సూర్యుఁడు సముద్రములోఁ బడుచున్నాఁడు, పద్మగర్భములలో మదించినతుమ్మెద పడుచున్నది, ఉద్యానవనమందలి చెట్లతోఁటలలో పక్షులు ప్రవేశించుచున్నవి. పడుచుపడఁతులయందు మెల్లమెల్లగా మన్మథుఁడు ప్రవేశించుచున్నాఁడు.

## సన్యాసము

భోజుని యాస్థానమందు చిరకాలము నుండి కవిత్వము జెప్పుచు పేరు ప్రఖ్యాతులు గాంచిన దండి భవభూతి శంకరుల కంటె వారితరువాత నెంతోకాలమునకువచ్చిన కాళిదాసున కఖండ గౌరవము, రాజానుగ్రహము, పలుకుబడి కలుగుటచేత నా మువ్వురు కవులు చూపోపక కాళిదాసు నెట్లయినఁ జెరుపవలెనని బహుప్రయత్నములు చేసిరిగాని యవి సఫలముగాకపోయెను. అందుచేత వారు గుమిగూడి యాలోచించిరి. అందు శంకరుఁ డిట్లనియె,

"కాళిదాసును రాజసన్నిధానమునుండి పాఱఁదోలుటకు మనముఁ చేసినయత్నము లన్నియు వ్యర్థములైనవి. మనకు గత్యంతరము కనఁబడ లేదు. అతని నీ రాజసదనమునుండి వెడలఁగొట్టుటకు నాకొక్క యుపాయము తోఁచుచున్నది. అతఁడు, మనము కలిసి సన్యసించి దేశాంతరమునకుఁ బోవుదము. ఇందువలన మన క్షేమలాభమని మీ రాలోచింపవద్దు. అతనికి లేకపోవుటయే మనకుండుట, లేదా వానిం జంపి మనము చావవలయు. ఈ రెండుపాయములకన్న వేఱుపాయములు లేవు" అని శంకరకవి పలుకఁ దక్కినవారిద్దఱు "వానిం జంపి తాముఁ జచ్చుటకంటె నందఱు సన్యాసులైపోవుటయే యుభయలోకతారక" మని యంగీకరించిరి. అట్లు కృతనిశ్చయులై వారు కాళిదాసుకడకుఁ

బోయి యీ విషయమై ప్రసంగింప మొదలుపెట్టిరి. అందు శంకరకవి కాళిదాసునితో నిట్లనియె,

"మిత్రుఁడా! మన మీ మహారాజును జిరకాలమునుండి యాశ్రయించియున్నాము. లోకమునందు నిరుపమానమైన ప్రతిష్ఠ సంపాదించినాము. సమస్తగ్రంథములఁ జదివినాము. ఈ శృంగార సమస్యలు పూరించుటలోను మనుష్యమాత్రుఁడైన యీరాజును స్తవము చేయుటలోను వాని యనుగ్రహము సంపాదించుటకుఁ బ్రయత్నము చేయుటలోను కాలముగడుపుచుంటిమి గాని సకలభువనేశ్వరుఁడగు బరమేశ్వరుని సేవలలో మనము కాలము గడుపుటలేదు. రాజులమాటలు నీళ్లలోనిమూటలు, వారి యనుగ్రహములు మెఱుపుతీఁగలవలె జంచలములు. వారొసంగు నైశ్వర్యములస్థిరములు. అనుగ్రహము వచ్చినప్పుడు కనకాభిషేకము చేయుదురు. ఆగ్రహము వచ్చినప్పుడు శునకమును గొట్టినట్లు కొట్టుదురు. కావున మనమీభూమీశ్వరుని సేవ విడిచి జగదీశ్వరుఁడైన పరమేశ్వరుని సేవింతము మనము నలుగురము సన్యసింతము. మహారాజుగారికడకుఁబోయి మేము విరాగులమైతిమి, పోవుటకు మాకు సెలవిండని యడుగుదము. ఇది నీ కిష్టమగునా కాదా?"

ఆ మాటలు వినఁగానే గాళిదాసుడు వారియందు విశ్వాసము లేనివాఁడగుటచే తననిమిత్తము వారేదోగోయిత్రవ్వుచున్నారేమో యని యనుమానించి యిట్లు తలంచెను, "వీరు నన్నుఁ జెఱుపుటకై నిశ్చయించి యీ పన్నుగడఁబన్నినారు. 'శ్యామేత్ ప్రత్యపకారేణ నోపకారేణ దుర్జనః' మన కపకారముచేసినవారికి మరల నపకారము చేసినప్పుడే వారు లొంగుదురుగాని, యుపకారమువలనలొంగరు. మాసినబట్ట చౌడుతోనే యుదుకవలయును. మోసగానిని మోసముతోనే జయింపవలయును. నేను త్రవ్వుకొనినగోతిలో వీరినే బడఁద్రోసెద"నని నిశ్చయించి తానుగూడ సన్యాసము స్వీకరింప సిద్ధముగనున్నట్లు వారితోఁ బలికెను.

అందఱు మఱునాఁడు రాజునొద్ద సెలవుగైకొననిశ్చయించిరి. మఱునాఁడు భోజమహారాజు మంత్రిసామంత కవిగాయక పరివారసమన్వితుండై పేరోలగంబున్న సమయంబున శంకరకవి లేచి "తాము, కాళిదాసుఁడు సన్యసించి కాశి, సాకేతము, బృందావనం, మొదలగు క్షేత్రములందు నివసింపఁదలఁచుకొంటి మనియు, సెలవొసంగవలయు ననియు వేఁడు కొనెను. అట్లు చేయవలదని రాజు వారిని బహువిధముల బ్రతిమాలు కొనెను. వారు పట్టినపట్టు విడువకపోవుటచే నెట్టకేలకు మహారా జంగీకరించి మీమీకోరికలఁ జెప్పుమని యెను. అందు ముందుగా దండి తనకోరిక నిట్లు విన్నవించెను :

శ్లో॥ కదా వారాణస్యా మమరతటినీరోధసి వసన్
వసానః కౌపీనం శిరసి నిదధానోంజలిపుటం
అయే గౌరీనాథ ! త్రిపురహర ! శంభో ! త్రినయన
ప్రసీదేతి క్రోశ న్నిమిషమివ నేష్యామి దివసాన్.

తా॥ వారణాసిలో నాకాశగంగాతీరమున నిలిచి గోచి పెట్టుకొని శిరస్సుపై నంజలిఘటించి 'ఓ శంభూ ! ఓ గౌరీనాథ ! ఓ త్రిపురహర ! ఓ త్రినయన ! అనుగ్రహింపుము' అని మొఱపెట్టుచు దినములను నిముష ములవలె నే నెన్నఁడు గడుపుదునోగదా !

అదివిని భోజుఁడు "సరే ! నీవు కాశికిఁబొమ్ము" అని యాన తిచ్చెను. అనంతరము భవభూతి తనమనోరథ మిట్లు విన్నవించెను :

శ్లో॥ కదావా సాకేతే విమలసరయూతీరపులినే
వసానః కౌపీనం శిరసి నిదధానోంజలిపుటం
అహో ! రామస్వామిన్ జనకతనయావల్లభవిభో !
ప్రసీదేతి క్రోశన్ నిముషమివ నేష్యామి దివసాన్.

తా॥ అయోధ్యాపురమున నిర్మలమైన సరయూనదీపులినతల మందు కౌపీనము ధరించి శిరసుమీఁద నంజలిపుటముగూర్చి 'ఓ రామ

స్వామీ! జనకకన్యావల్లభా! ఓ ప్రభువా! అనుగ్రహింపుము' అని మొఱవెట్టుచు దినముల నెన్నడు నిముషములవలెఁ గడుపుదునో గదా!

అది విని మహారాజు "నీవయోధ్యాపురమునకుఁ బొ" మ్మని యానతిచ్చెను. పిమ్మట శంకరకవి తనకోరిక నిట్లు తెలిపెను:

శ్లో॥ కదా బృందారణ్యే విపులయమునాతీరపులినే
చరంతం గోవిందం హలధరసుదామాదిసహితం
అహో! కృష్ణస్వామిన్ మధురమురళీమోహనవిభో
ప్రసీదేతి క్రోశ న్నిమిషమివ నేష్యామి దివసాన్.

తా॥ బృందావనమందు విశాలమైన యమునానదియొక్క యిసుకతిన్నె మీఁద బలరామాదులతోఁ గూడి చరించుచున్న గోవిందుని దలంచుకొని "యో కృష్ణస్వామీ! మధురమురళీమోహనవిభుఁడా! అనుగ్రహింపుము" అని వేఁడుకొనుచు దినములను నిమిషమువలె నే నెప్పుడు గడుపుదునో గదా?

అది యాకర్ణించి రాజు "నీవు విరాగివై బృందావనమునకు బొ" మ్మని యానతిచ్చెను. పదపడి కాళిదాసుఁడు సంతోషవికసితముఖాంభోజుఁడై భోజుని కభిముఖుఁడై యిట్లనియె:

శ్లో॥ కదా కాంతాగారే పరిమళమిళత్పుష్పశయనే!
శయానః శ్యామాయాః కుచయుగ మహం వక్షసివహన్
అయే స్నిగ్ధే ముగ్ధే చటులనయనే! చంద్రవదనే!
ప్రసీదేతి క్రోశ న్నిమిషమివ నేష్యామి దివసాన్.

తా॥ ప్రియురాలి మందిరమందు ఘుమఘుమను పరిమళించుచున్న పూలపానుపుమీఁదఁ బండుకొని ప్రియురాలిం గౌఁగలించుకొని "యో కల్యాణీ! యో ముగ్ధా! యో చంచలనయనా! యో చంద్రముఖీ! యనుగ్రహింపవే" యని వేఁడుకొనుచు దినములను నిముసమువలె నే నెప్పుడు గడుపుదునో కదా!

ఆ శ్లోకము విని రాజు చిఱునవ్వునవ్వి కాళిదాసుఁడు కవిత్రయమును జక్కఁగా వంచించినాఁడని తెలిసికొని "సరే! నీ కోరికప్రకారము నీ వుండవచ్చునని యానతిచ్చెను. కాళిదాసుయొక్క తెలివితేటలకు, సమయోచితబుద్ధికి, సభాసగులు సంతసించిరి. దండి భవభూతిశంకరులు తామంతకుమున్ను కాళిదాసునకుఁ జేసిన మహాపకారములఫలము దైవవశమునఁ దా మిప్పు డనుభవింపవలసివచ్చె నని తమ్ముఁదామే నిందించుకొనుచు నెప్పటి కేని రావలయునో యది రాకమానదని రాజసభవిడిచి ధారానగరము విడచి విరాగులై పోయిరి.

## నక్షత్రము శ్లోకము

గర్భదరిద్రుఁడైన యొక బ్రాహ్మణుఁడు కాళిదాసదర్శనము చేసి తనదారిద్ర్యదుఃఖము తీఱునట్లు భోజమహారాజుచేత నేమైన నిప్పింపుమని యతనిం గోరెను. నీ వేమైనఁ జదువుకొంటివా యని కాళిదా సతని నడుగ "మహాత్మా! నాకు వారముల పేర్లు, తిధులపేర్లు, మాసములపేర్లు, నక్షత్రములపేర్లు మాత్రము వచ్చును అంతకన్న నేవిద్యయు నాకు దెలియదు నీవే నాపాలిటిదైవము. నిన్నే నమ్ముకొనివచ్చితిని. నాకు కడుపెడుపిల్లలు. నన్ను రక్షింపుము. పాలముంచినను నీటముంచినను నీదేభారము" అనిపలికెను. కాళిదాసుఁడు వానిదురవస్థకు మిక్కిలి కనికరముగలిగి మహారాజుచేత నేమైన నతని కిప్పింపవలెనని నిశ్చయించి వానిని వెంటఁబెట్టికొని యరిగి రాజద్వారముకడ నతనిని నిలిపి రాజు నమస్కరించినప్పుడు నీకు దోఁచిన నక్షత్రములపేర్లు నాల్గు చెప్పుమని యుపదేశించి తాను రాజసభలోఁ బ్రవేశించి కృపాళుఁడైన నన్నృపాలునితో గొప్పపండితుఁడు వచ్చెనని చెప్పెను. ఆ పండితుని సభాప్రవేశము చేయింపుమని రాజానతియ్యఁ గాళిదాసుఁ డతనిని రావించెను. రాజు

బ్రాహ్మణునకు నమస్కరించెను. ఆశీర్వచనము చేయుటకు మాఱుఁగాఁ గాళిదాసు చెప్పినట్లు 'అశ్విని, పునర్వసు, కృత్తికా, రేవతి' యని నాలుగునక్షత్రములపేరులు చెప్పి యూరకుండెను ఆశీర్వాదమైనఁ జేయలేదేమని రాజు కాళిదాసునడిగెను. సభాస్తారులుగూడ దెల్లబోయి చూచిరి. అప్పుడు కాళిదాసుఁడు రాజుతో "దేవా! ఆ నక్షత్రముల లోనే యాశీర్వచనము గర్భితమైయున్నది. అది సామాన్యులు గ్రహింపఁజాలరు. చిత్తగింపుఁడు. విన్నవించెద" నని యీ క్రిందిశ్లోక మాశుధారగా రచియించి చదివెను.

శ్లో॥ అశ్వనీ భవతు తేతుమందురా
మందిరే భవతు తేపునర్వసు
కృత్తికాతనయ విక్రమోస్తు తే
రేవతీపతి కనిష్ఠ సేవయా.

తా॥ రాజా! రేవతీపతియైన బలరామునితమ్ముఁడగు శ్రీకృష్ణుని సేవచేత నీ గుఱ్ఱపుసాల యశ్విని యగుఁగాక! అనఁగా ననేకాశ్వములు కలదగుఁగాక. నీ మందిరమందు మాటిమాటికి వసు (అనఁగా బంగారము) చేరుఁగాక! కృత్తికాతనయుఁడైన కుమారస్వామి కున్నంత ప్రతాపము నీకుఁ గలుగుఁగాక!

ఆ పండితునిభావ మెట్లున్నను వానిమాటలను మిక్కిలి చమత్కారముగ సమర్థించి రసభూయిష్ఠమైన శ్లోకముగా రచించినందుకు రాజు సంతసించి కాళిదాసునకు గొప్పబహుమానము చేసెను. ఆ మహాకవి యా బహుమానమందుకొని తా నేమియు నందులో గ్రహింపక యదియంతయుఁ బరమదరిద్రుఁడైన యా బ్రాహ్మణునకిచ్చె. బ్రాహ్మణుఁడు పరమాశ్చర్యభరితుఁడై దారిద్ర్యబాధ తొలగించుకొనియె.

## రోఁకలి

ఒకనాఁడు

నిశాసమయమున భోజమహారాజు పురజనుల కష్టనిష్ఠురముల నెఱుఁగుటకై ప్రచ్ఛన్నుఁడై సంచరించుచుండ నెలజవ్వని యొకర్తు తన హస్తపల్లవమున రోఁకలి బట్టుకొని ధాన్యము దంచుచుండెను. ఆమె మిక్కిలి చక్కనిది. నెల జవ్వనంబున వెలయుచుండెను. ఆమె సౌందర్యమును, లావణ్యమును, తారుణ్యమును, వీక్షించి తన మనంబున రోఁకలిను ద్దేశించి "ఓరోఁకలీ! చిగురువంటి యీయామె చేతి సంపర్కముచేతనైన నీవు చిగురింప లేవుకదా? నీవు వట్టికొయ్యవే" యను యర్థమువచ్చునట్లు యీ క్రింది సంస్కృత పదముల ననుకొనెను :

"ముసల కిసలయం తే తత్క్షణా ద్యన్న జాతం"

అని తలంచి దానినే యొక శ్లోకముయొక్క కడపటిపాదముగాఁ గూర్చి యీ సమస్యను బూరింపుమని కాళిదాసున కిచ్చెను. ఆ కవిసార్వ భౌముఁడు తక్కిన మూఁడుచరణముల నిట్లుపూరించెను :

శ్లో॥ జగతి విదితి మేతత్, కాష్టమే వాసి నూనం;
తదపిచ కిల సత్యం, కాననే వర్ధితోఽసి
నవకువలయ నేత్రా పాణిసంగోత్సవేఽస్మిన్
ముసల ? కిసలయం తే తత్క్షణా ద్యన్న జాతం.

తా॥ ఓ రోఁకలీ! క్రొత్తకలువలవంటి కన్నులుగల యీకల్యాణి హస్తస్పర్శమహోత్సవముచేతఁగూడ నీవు చిగురింపనికారణమున నీ వడవిలోఁ గొంతకాలము వృద్ధిపొందినప్పటికి నీవు వట్టి కొయ్యవే!

ఆ శ్లోకసారస్యముగ్రహించి రసికాగ్రేసరుఁడైన భోజభూపతి కాళిదాసునకు గొప్ప పారితోషిక మిచ్చెను.

## కత్తెర బోను

భోజరాజు తన యాస్థానకవులను నాలుశాస్త్రములయందు, నఱువదినాల్గుకళలయందుఁ బరీక్ష యిమ్మని కోరెను పండితులందఱు నఱువదిమూఁడుకళలయందుమాత్రము పరీక్ష నిచ్చి మిగిలినదియగు జారత్వకళయందుమాత్రము పరీక్షనీయక యుండిరి. ఆ కళయందుఁ బరీక్షయిచ్చుటయనఁగా జారత్వమునందు బుద్ధికుశలత చూపుటయగును. కావున నది దోషభూయిష్టమైనదనియు, నపకీర్తికరం బనియు, నరకహేతువనియు, విశేషించి ప్రాణాపాయముఁ దెచ్చుననియు, నందుచేత నది పరీక్షనిచ్చుటకు వీలైనది కాదనియు వారుచెప్పిరి. కాని యందులోఁగూడ నొక పండితుఁడైనఁ బరీక్షనియ్యవలసినదని రాజు నిర్బంధించుటచే వా రొడంబడి తమలో నసాధారణబుద్ధిసంపన్నతచేతనే గాక యగణ్యతారుణ్యలావణ్యములచేత నవమన్మథుఁడని పేరువడసిన భవభూతింబిలిచి జారత్వ శాస్త్రమునందు రాజునకు నచ్చునట్లు పరీక్ష యిమ్మని నియోగించిరి. భవభూతి తనకట్టికార్య మిష్టము లేకపోయినను రాజనిర్బంధముచేతను దనమిత్రుని నిర్బంధముచేతను, నెట్టకేల కొడం బడియెను. అట్లు కొంతకాలము గతించెను.

ఒకనాఁడు భవభూతి, పూర్వము శివునికంటిమంటచే బూడిదయైన మన్మథుఁడు మరల భూమిమీఁద నవతరించెనోయని జనులు భ్రమపడు నట్టి సుందరాకారముగలిగి రాజమందిరసమీపముననుండి పోవుచుండ రాజునకు దగ్గఱచుట్టమైన యొక లావణ్యవతి యా భవభూతిని గని మోహించి తనచెలిమిచేయుమని యాతనికడకు దూతికగాఁ దనదాసి నంపెను. ఆ కళ్యాణి భువనైకసుందరి యగుటచే నామె సహవాసము చేత "నేకక్రియా ద్వ్యర్థకరీ" యన్నట్లు జారత్వశాస్త్రమందుఁ బరీక్ష నిచ్చుటయు, నింద్రియసుఖానుభూతియు నను రెండుపనులు జరుగునని

నిశ్చయించి యామె నెయ్యమున కియ్యకొనియెను. కాని, విచ్చుకత్తులు బూనిన కావలివాండ్రుగలిగి యున్నతములైన కోటగోడలుగలిగి దుర్భేద్యమైన రాజాంతఃపురముఁ బ్రవేశించుట దుర్ఘట మగుటచే నా పడఁతుక తనమందిరముననుండి భవభూతిగృహంబువఱకు నొక సొరంగము ద్రవ్వించి యందుండి తనమందిరముఁబ్రవేశింపుమని వానింగోరెను. భవభూతి యట్లేయని ప్రతిదిన మర్ధరాత్రమున సొరంగముదారినుండి యా పడఁతియంతికముఁజేరి సుఖించుచుండెను. కొన్నినెలలు గడచు నప్పటి కా యెలనాఁగ గర్భవతియయ్యెను. చెలికత్తెలు తమ తల మీఁదికి వచ్చునేమోయని మహారాజునకారహస్యము విన్నవించిరి. నరపాలుఁ డావార్త తన యాంతరంగికులైన బుద్ధిమంతులతోఁ జెప్పి "నిర్భయముగా నిశీథసమయమున రాజాంతఃపురముఁ బ్రవేశించి యట్టి దుష్కార్య మాచరించిన ముష్కరునిఁ బట్టుకొవలయు" నని చెప్పెను.

అప్పుడు వారిలో నొకఁడా మెమందిరముఁ బ్రవేశించి తన బుద్ధి కుశలతచేత గోడలో సొరంగముండుటఁగనిపెట్టి దానిలో నొక కత్తెరబోను నమర్చెను. ఆ బాలిక యా రహస్య మెఱుంగదు. భవభూతియు నది యెఱుంగక యెప్పటియట్లుసొరంగముఁజొచ్చి కటికచీఁకటిలో దానిఁగనలేక కత్తెరబోనులోఁజిక్కుకొని కంఠమెత్తి వగచుటకైన వీలులేక యుత్తరింపఁ బడుచున్న తన కుత్తుకనుండి వచ్చు క్రొన్నెత్తురుతో గోడమీఁద నీ క్రిందివిధమున శ్లోకములో నర్ధభాగమును వ్రాసి ప్రాణము విడిచెను.

శ్లో॥ కేవా న సంతి భువి వారిరుహావతంసా

హంసావళీవలయినో జలసన్నివేశాః,

తా॥ ఈ వసుంధరలోఁ దామరపువ్వులు శిరోభూషణములుగా, గలిగినట్టియు, హంసలసమూహములు కంకణములుగాఁ గలిగినట్టియుఁ సరస్సు లేన్ని లేవు !

తన మనోహరుఁ డెప్పటియట్ల రాకపోవుటచే నాబాలిక వానికై నిరీక్షించుచు నెట్టకేలకు సొరంగమునుజొచ్చి చచ్చి పడియున్న ప్రియుం

గనుంగొని మిక్కిలి దుఃఖించెను. పరిచారికముఖమున నది గ్రహించి రాజు వానియాంతరంగికులు నచ్చోటికిఁబోయి చచ్చిపడియున్న భవభూతి శవముంజూచి రాజు తనవల్లనే యట్టిఘోరకృత్యము జరిగినదని విచారించి యట్టి ప్రమాదకరమైన శాస్త్రమునందుఁ బరీక్షయిమ్మని యడుగుటలోఁ దాను గొప్ప తప్పుచేసెనని తలంచి పశ్చాత్తాపపడి శ్లోకార్థమును రచియించిన భవభూతి యభిప్రాయమేమో తెలియఁగోరి మఱునాఁ డాస్థానకవులం బిలిపించి యది సమస్యగా నిచ్చెను. ఆ సమస్య యితరుల కసాధ్యమగుటచేఁ కాళిదాసుఁ డిట్లు పూరించెను :

కిం చాతకః ఫల మపేక్ష్య సవ్రజపాతాం
పౌరందరీం కలయతే నవవారిధారాం.

తా॥ చాతకపక్షి యేమిఫల మపేక్షించి పిడుగులపాటుతోఁ గూడికొనినట్టి మేఘుధారను గోరుచున్నది; అనఁగా లోకమునందుఁ జక్కదనంపుటిక్కలగు లావణ్యవతు లెందఱోయుండఁగా వారితో సుఖింపలేక నరుఁ డనేకాపాయములతోఁగూడిన స్థలములకేగి యచట నున్న కాంతల నేల గోరవలయు నని భావము.

ఈ సమస్యాపూరణమునకు రాజు మిక్కిలి సంతోషించెను. పండితులు మత్సరగ్రస్తులగుటచే భవభూతి యభిప్రాయమది యైయుండ దని వాదించిరి. అప్పుడు కాళిదాసుఁడు తోటికవులందఱుఁ దనపై నీర్ష్య వలన నట్లనుచున్నారని తెలిసి వారి మాత్సర్యమును, దన సామర్థ్యమును రాజునకుఁ జూపఁదలఁచి తన కిష్టదేవతయై పలుసారులు బహువరంబు లిచ్చి కాపాడిన భువనేశ్వరిని ధ్యానించి భవభూతిని బ్రతికింపుమని ప్రార్థించి యాతనితలయు మొండెము నొకటిగాఁగూర్చెను. అప్పుడు దేవీవరప్రసాదమున భవభూతి చైతన్యముగలిగి బ్రతికెను. అంతటఁ గాళిదాసు భవభూతింజూచి నీవు గోడపై శ్లోకార్థముమాత్రమే వ్రాసితివి. నీ హృదయము మాకుఁ దెలియలేదు శ్లోకములోఁ దక్కిన సగము

బఠింపుమనికోరెను. అప్పుడా తఁడు కాళిదాసుపఠించిన రెండుచరణములనే చదివెను. భవభూతిహృదయమది కాదని వాదించిన పండితులు సిగ్గుపడిరి. భవభూతి బ్రదికినందుకు కాళిదాసుని ప్రజ్ఞావిశేషము మఱింత స్థిరపడి నందుకు మహారాజు మిక్కిలి సంతసించి బహుమానమిచ్చెను. అది మొదలుకొని జాత్యవిద్య యుండెన్నఁడుఁ బరీక్షింపఁగూడదని రాజు నిశ్చయించుకొని యొకకన్యను భవభూతికిచ్చి వివాహము చేసెను.

## తేనె టీఁగ

ఒకనాఁడు భోజకాళిదాసు లిరువురుఁ గూర్చుండి విద్యాగోష్ఠి వినోదంబులతోఁ గాలక్షేపము చేయుచుండ నొక తేనెటీఁగ యచ్చోటికివచ్చి యనేకభూపాలుర కిరీటమాణిక్యములచేత నీరాజితములైన యా రాజపాదములచెంతను, నడతెగని దాన భోగములచేత సలంకరింపఁబడిన యాతని హస్తములచెంతను, 'ఝంఝం' మని మొఱయుచుఁ బోచ్చెను వింజామరములు నట్టిపరిచారక వ్యాపారములతో దాని నెంతదోలినను నది వదలక యచ్చటనే గానముచేయుచుండెను. అదిచూచి రాజేంద్రుఁడు కవీంద్రునిఁ బిలిచి "కవిసార్వభౌమా! ఎన్నిసార్లు తోలినను నీ తేనెటీఁగ నా చేతులను, గాళ్లను విడిచిపెట్టక యిట్లు మొఱయుటకుఁ గారణమేమి?" యనియడిగెను. ఆ ప్రశ్నకు త్వరగముగా నమ్మహాకవి రమ్యార్థగర్భితమైన యీ శ్లోకము రచియించి చదివెను.

శ్లో॥ దేయం భోజ ధనం ధనం సుకృతిభిర్నోసంచితవ్యం కదా
కర్ణస్యాపి బలేశ్చ విక్రమపతే రద్యాపి కీర్తి స్థిరా
అస్మాకం మధు దానభోగరహితం నష్టం చిరాత్సంచితం
తే నేయం తవపాణిపాదయుగళం కర్షత్యహో మక్షికా.

తా॥ ఓ భోజమహారాజా! సత్పురుషులకు విశేషముగా ధనము దానమియ్యవలయును. ధనమెన్నఁడు దాఁచిపెట్టఁగూడదు. అట్లు

వెనుకముందుఁ జూడకుండ దానమిచ్చుటచేతనే కర్ణునియొక్కయు, బలిచక్రవర్తియొక్కయు, విక్రమార్కునియొక్కయుఁ గీర్తి యీ లోకమున స్థిరమయియున్నది. మేము దానగుణ మెఱుఁగకపోవుటచేత చిరకాలమునుండి సంపాదింపఁబడిన మా తేనె దానభోగరహితమై నశించుచున్నది. ఇట్లు మీ చేతులు పట్టుకొని, కాళ్లుబట్టుకొని యీ తేనెటీఁగ మీతో మనవి చేయుచున్నది.

హృదయరంజకమయిన యీ శ్లోకమువిని సహృదయుఁడైన భోజ మేదినీశ్వరుఁడు సంతోషించి మనుష్యుల మనోభావములనేగాక, కాళిదాసుఁడు తిర్యగ్జంతువులయొక్కయు, కీటకసరీసృపములయొక్కయు భావములసహితము గ్రహింపగలశక్తి గలవాఁడయ్యెనని యానందించి వానికి విశేషమయిన బహుమానముచేసి యట్టికవి తన యాస్థానమం దుండినందుల కానందించెను.

## మత్స్యములు

కాళిదాసుని మీఁద
నీర్ష్యగల పండితులు

రాజుకడకుఁబోయి యమ్మహాకవి సకలశాస్త్రపండితుఁడయ్యు మత్స్య భక్షణ చేయుచున్నాఁడని పలుమాఱు రాజుం జేరి కొండెములుచెప్పిరి. రాజు కాళిదాసుంబిలిచి యిందేమయిన సత్యమున్నదా యనియడిగెను. తాను మాత్స్యభక్షకుఁడ గానని యతఁడు నిర్భయముగా రాజుతో మనవి చేసెను రాజాతనిమాటలయందు విశ్వాసముంచి ప్రత్యక్షముగాఁ దన కన్నులతోఁ దాను చూచినంగాని కాళిదాసునిపైఁ వేయఁబడిన దోషారోపణలను నమ్ముటకుఁ దన మనసొప్పదని భూధవుఁడు కవులతోఁ జెప్పెను. రంధ్రాన్వేషణపరులైన యా పండితులు సమయము వచ్చి నప్పుడు పట్టియిచ్చి యా కవిమీఁద రాజునకు ద్వేషము కలిగించుటకే ప్రయత్నము చేయుచుండిరి.

అట్లుండ నొకనాఁడు కాళిదాసుఁడు జాలరులయొద్ద కొన్ని చేఁపలను గ్రయమునకుఁ దీసికొని వాటి నొక గుడ్డలో మూటగట్టి చంకయం దిడుకొని మెల్ల మెల్లగా నింటికిఁ బోవుచుండెను. నిరంతరము వానియందలి దోషములఁ బట్టుకొనుటకై వేఁటకుక్కలవలె నతనిం గాచుకొనియున్న పండితులా సమాచారము మహారాజున కెఱిఁగించిరి. వెంటనే మహారాజు బైలుదేఱివచ్చి కాళిదాసుని మార్గమధ్యమునం గలసికొని, చంకనున్న మూటనుగుఱించి వానిని గొన్నిప్రశ్నము లడిగెను. ఆ ప్రశ్నోత్తరము లీ క్రిందిశ్లోకములయ్యెను.

శ్లో॥ కక్షే కిం తవ ? పుస్తకం, కిముదకం ? కావ్యార్థసారోదకం,
గంధః కిం ? ఘన రామరావణ మహాసంగ్రామరంగోద్భవః,
పుచ్ఛః కిం ? ఘన తాళపత్రలిఖితం, కిం పుస్తకం ? హేకవే!
రాజ న్భూసురదైవతైశ్చపఠితం రామాయణం పుస్తకం.

రాజు : హేకవే ! కక్షే కిం తవ?=కాళిదాసుఁడా ! నీ చంకలోని దేమిటి ?

కాళిదాసు : పుస్తకం=పుస్తకము.

రాజు : కిముదకం ?=నీళ్లేమిటి ?

కాళి : కావ్యార్థసారోదకం=కావ్యార్థరసము.

రాజు : గంధః కిం ?=వాసనయేమిటి ?

కాళి : ఘనరామరావణమహాసంగ్రామరంగోద్భవః=గొప్పదగు రామరావణయుద్ధమువలనఁ బుట్టినవాసన.

రాజు . పుచ్ఛః కిమ్ ?=తోఁకయేమిటి ?

కాళి : ఘనతాళపత్రలిఖితం=తాటియాకుల పుస్తకము

రాజు : కిం పుస్తకం ?=ఏమి పుస్తకము !

కాళి : రాజ న్భూసురదైవతైశ్చ పఠితమ్= బ్రాహ్మణులు, దేవతలు చదువునట్టి రామాయణగ్రంథము.

అప్పటికి నమ్మక మేదీ చూపుమని రాజడుగ కాళిదాసుఁడు తన కిష్టదేవతయైన దేవిని ధ్యానించి మూట బైటికిఁదీయఁగా నది రామాయణ మయ్యెను. కాళిదాసుని జట్టియిచ్చితిమని సంతోషించిన పండితులు లజ్జావనతశిరస్కులైరి. మాఱుమాటాడక గృహంబులకుఁ బోయిరి.

అప్రశిఖ.

భోజరాజు మాళవదేశమును బాలించుకాలమున నర్మదానదీతీరమందలి యొక గ్రామమున నిద్దఱు బ్రాహ్మణ బాలకులు సంస్కృతభాష నభ్యసించుచుండిరి. అందొకఁడు మేధాశాలి. రెండవాఁడు కొంచెము మందబుద్ధి. ఇరువురు నిరుగు పొరుగువారగుటచేతను, నొక్కగురువువద్దనే యధ్యయనము చేయు చుండుటచేతను, మిక్కిలి మైత్రి గలిగి యన్నదమ్ములవలె మెలఁగు చుండిరి. ఇద్దఱుఁగలిసి చదువుదురు. ఇద్దఱుఁగలసి నదిలో స్నానము చేయుదురు. ఇద్దఱుఁగలిసి విహరింతురు అట్లు కొంతకాలము స్వగ్రామ మున నధ్యయనముచేసి తర్కవ్యాకరణాదిశాస్త్రములు విద్యాపీఠమైన కాశికానగరమునఁ జదువఁదలఁచి తలిదండ్రులయొద్ద సెలవుగైకొని పోయిరి. వారణాసిఁజేరి వారొకగురువు నాశ్రయించి తర్కమునందు బాధాంతమువఱకును, వ్యాకరణమునందు మహాభాష్యాంతమువఱకును జదివి శాంతి జెప్పిరి.

మేధాశాలియైన యాబ్రాహ్మణకుమారుఁడు నేర్చినవిద్యయంతయు జిహ్వాగ్రముననున్నదో యనునట్లుగా నెట్టి పండితు లెట్టిప్రశ్న లడిగినను వెంటనే యుత్తరమిచ్చుచువచ్చెను. మందబుద్ధియైన విప్రకుమారుని చదువు గుట్టుపుమేత మరల నెమరువేయుటకు వీలులేనియట్లే సమయము నకు జ్ఞాపకమునకు రాకపోయెను. అందుచేత మేధాశాలికి మంచికీర్తియు దానివలన ధనము చేకూఱుచుండెను. అతఁడు కొన్నిరాజసభలకుఁబోయి యష్టావధానములు మొదలైనవి చేసియు, నాశుకవిత్వముఁజెప్పియు,

విద్వాంసులతో వాదములుచేసియు, వేయివరహాలు సంపాదించెను. రెండవ విప్రకుమారుఁడు నూఱువరాలు సంపాదించునప్పటికే తల ప్రాణము తోఁకకు వచ్చెను. మేధాశాలి తలిదండ్రులయెడ భక్తిగలవాఁడగుటచే, తానార్జించినధనము తలిదండ్రులకిచ్చి వారి దర్శనము చేసి వారి దీవనలు బడసి వివాహమాడవలెనని స్వగ్రామమునకు బైలుదేఱెను. రెండవవాఁడును వానివెంటనే బైలుదేఱెను. మేధాశాలి యశోధనముల నార్జించుటచేత మందబుద్ధి వానియెడల నసూయ గలిగి యెట్టకేలకు నడిదారిలో నొంటిగనున్నప్పుడు వానింగడతేర్చి యాధనము తాను స్వీకరింపవలెనని నిశ్చయించుకొనెను

ఆహా! ఓర్వలేనితనము, ధనకాంక్ష మనుష్యునిచేత నెట్టి దుష్కార్యములనైనఁ జేయించునుగదా? అట్లుకానిచో నిరపరాధుఁడును నిరుపమానపాండిత్యప్రకర్ష గలవాఁడును నైన మేధావి నీ.మందబుద్ధి చంపదలచునా? ధనకాంక్ష సామాన్యమైనదికాదుగదా! 'నానాగుణాః కాంచన మాశ్రయంతే' అన్నిగుణములు బంగారము నాశ్రయించును. అట్లుమందబుద్ధి కృతనిశ్చయుఁడై సమయముకొఱకు నిరీక్షించుచుండెను. ఒకనాఁడు సాయంకాలము వారు మార్గాయాసముచేత మిక్కిలి యలసి యేగ్రామమును జేరలేక యడవిలో నొక చెట్టుక్రిందఁ బండుకొనిరి. పూర్వకాలము దూరప్రయాణములు చేయువారు చోరులచేతను దుష్టమృగములచేతను బాధగలుగునని శంకించి ఖడ్గములఁదాల్చి పోవుచుండెడివారు. అందుచేత మందబుద్ధికడ నొక ఖడ్గముండెను. మేధాశాలి దూరము నడచుటచే మిక్కిలిడస్సి గుఱ్ఱుపెట్టి నిద్రపోయెను. ఆ సమయమున దురాత్ముఁడైన యా మందబుద్ధి ఖడ్గముతో నాతనిఁగొట్టెను. అదరిపడి మేధాశాలి లేచి గాయమునుండి బొటబొట నెత్తురు గారుచుండ ఖడ్గపాణియై తనయెదుట నిలిచియున్న మిత్రుని మొగము వెన్నెల వెలుఁగునఁ జూచి "ఏమిరా! దురాత్మా! నన్నుఁ జంపుచున్నావు? ధనము కావలసియున్న యెడల నాదగ్గఱనున్న వేయివరాలు నీవే పుచ్చు

కొనుము. నన్నుమాత్రము బ్రతుకని”మ్మని వేఁడుకొనెను. అందుకు మందబుద్ధి యిట్లనియె—“నాకు ధనము కావలెను. నీవిప్పుడు వేయి వరాలు నాకిచ్చినను బిమ్మట నేనాసొమ్ము హరించినానని నీవు గ్రామమునఁ జెప్పకపోవు. కాఁబట్టి నిన్నుఁజంపకమాన. మీవారికేమయిన నీవు చెప్పఁదలచినచోఁ జెప్పుము” అనప్పుడు నా మరణబాధపడుచునే మేధాశాలి యొకశ్లోకము రచియించి యది వానికిఁ జెప్పినచో దానియర్థము గ్రహించి వాఁడు తనవారికది యెఱిఁగింపఁడనిశంకించి శ్లోకముయొక్క నాలుగుపాదములలోని మొదటియక్షరముల నొకమాటగా “అప్రశిఖ” యని కూర్చి యీమాట తనవారితోఁ జెప్పుమనిజెప్పెను. దాని యర్థము సామాన్యులకు దెలియకపోయినను దేవతా వరప్రసాదముగల మహా పండితులకుఁ దెలియవచ్చునని వాని యభిప్రాయము. అప్రశిఖ యను నామాటను గ్రహించి మందబుద్ధి ఖడ్గముతోఁ వానిశిరస్సుచ్ఛేదించి వానియొద్దనున్న ధనమంతయు సంగ్రహించి మూటగట్టుకొని యింటికిఁ బోయి ధనమంతయు జననీజనకుల కిచ్చి మెల్లగా మేధాశాలి యింటికిఁ జని వాని తల్లిదండ్రుల కిట్లనియె—

“అయ్యో! నేనును మీవాఁడును నన్నదమ్ములవలె నుంటిమి. కాశీనుండి బైలుదేఱి వచ్చుచుండఁగా మార్గమధ్యమున దారుణమైన సన్నిపాతజ్వరముచేత నతఁడు వారము దినములు బాధపడి ప్రాణములు విడచెను. ఆ సంధిలో నెన్నోసార్లు తల్లిదండ్రులను దలఁచికొనెను. జననీజనకులకు నమస్కారములను జెప్పుమనెను. అయ్యో! నాకన్నుల చందమామ పోయినది. నా పంచప్రాణములలో నొకటి గతించినది. నా కుడిచేయి పడిపోయినది. అటువంటి మిత్రుఁడు నాకీ జన్మమున దొరకునా? నేను మందభాగ్యుఁడను. దేవుఁడు మందబుద్ధినైన నన్నైనఁ జంపుకొనిపోక కుశాగ్రబుద్ధియై సత్కీర్తిసంపాదించిన నా మిత్రు నేల గొంపోవలె? నా ఖర్మము అయినను నేనే మీ కొమారుఁడుగా నుండెద.

విచారింపకుఁడు ” అని యెన్నో యబద్ధములు చెప్పి కల్లబొల్లి యేడుపు లేడ్చి యూరందఱుఁ దన్నూఱడింప నూఱడిల్లినట్లు నటించెను. “నాయనా! కడసారి మా బిడ్డ మా కేమి చెప్పఁమనియె” నని వాని తల్లిదండ్రులడుగ “అప్రశిఖ” యని చెప్పఁమనియె నని యాహంతకుఁడు పలికెను. దాని యర్థము బోధపడక వారు పలుతావుల కరిగి బహు పండితుల నడిగిరి. వారు తమ కేమియుఁ దెలియదనిపలికి జ్వరపీడితుఁడైన యాతులుఁడు సంధిలో నట్లు ప్రేలియుండునుగాని దానికర్థముగిర్థము లేదనిచెప్పిరి. అతి మేధాశాలియైన తమ కుమారుఁడు నిరర్థకమైనశబ్దము తమకుఁ గడపటి వర్తమానముగాఁ బంపఁడని నిశ్చయించి వారు ధారా పురమునకుఁబోయి కాళిదాసున కా శబ్దము దెలిపి యర్థము జెప్పఁమని వేఁడుకొనిరి. అతఁడు కొంతతడ వాలోచించి వారితో నిట్లు చెప్పెను: “మీ కుమారుఁడు తన మిత్రునిచే నిద్రలో ఖడ్గముచేఁ జంపఁబడెను. ఆ సంగతి మీవాఁడొకశ్లోకముగా రచించి యా శ్లోక మతనికీయక నాలుగుపాదముల మొదటియక్షరములను “అప్రశిఖ” యనుశబ్దముగాఁ గూర్చి వానిచే మీ కంపెను. అతఁడు జ్వరపీడితుఁడై చచ్చియుండఁడు. మీవాఁడు రచించినశ్లోక మిట్లుండవచ్చును:

శ్లో॥ అనేన తవపుత్రస్య
ప్రసుప్తస్య వనాంతరే
శిఖా మాక్రమ్య పాదేన
ఖడ్గే నాభిహతం శిరః

తా॥ ఇతఁడు వినములో నిద్రపోవుచున్న మీ కుమారునియొక్క శిఖను పాదముతోఁద్రొక్కి ఖడ్గముతో శిరస్సు ఖండించెను.

ఆ శ్లోకార్థము వినఁగానే తలిదండ్రులు గుండెబాదుకొని మహాదుఃఖభరితులైరి. పురజనులందఱు వాని దౌర్జన్యమున కాశ్చర్య మొందిరి. రాజా మందబుద్ధిని పిలిపించి దండింపఁదలఁచెను. కాళిదాస శత్రువులగు విద్వాంసులు దానియర్థ మదికాదనియుఁ గాళిదాసుఁడు డంబమునిమిత్తమై మృతినొందినవాని యాశయమదియని చెప్పెననియు

వాదించిరి. అదివిని రాజు మందబుద్ధిని బిలిపించి జరిగినది జరిగినట్లు చెప్పుమని యానతిచ్చెను. వాఁడు గడగడవడఁకుచు నట్టడవిలో నడిరేయి జరిగినయుదంత మంతయుఁ దేటతెల్లముగ దండధరసమానుఁడైన యా రాజచంద్రునకు విన్నవించెను. అప్పుడు సైతము విద్వజ్జనులు శాంతినొందక చనిపోయినవాని యభిప్రాయ మది కాదని వాదించిరి. అప్పుడు భోజరాజు "మహాకవీ! దీనికి నీ వేమందు" వని యడిగెను. అప్పుడు కాళిదాసుఁడు "దేవా! మృతినొందిన బాలకుని తలయు, మొండెముఁ దెప్పింపుఁడు" అని మనవిచేసెను. రాజు మందబుద్ధికిఁ గొందఱు సేవకులను సహాయమిచ్చి యచ్చోటికిఁబంపి మేధాశాలియొక్క శిరస్సును మొండెమును దెప్పించెను. కాళిదాసుఁడు తన యిలవేలుపై కల్పవృక్షముపగిది తన మనోరథములనెల్ల నీడేర్చుచున్న లోకమాతయైన భువనేశ్వరిని ధ్యానించి యామె పాదారవిందములను దన హృదయపద్మమున నిలిపి నవనవస్తోత్రములనెడు పువ్వులతోఁ బూజించి రాజసభాంతరాళమునఁ దన క్రప్రతిష్ఠ రాకుండఁ గాపాడుమని వేఁడుకొనెను. భక్తవత్సలయు, గృపాసముద్రయు నైన భువనేశ్వరి యాతని కోరికప్రకారము మేధాశాలిని బ్రదికించెను. అతఁడు లేచి కూర్చుండి "అప్రశిఖ" యని పలికెను. "నీ యభిప్రాయమే"మని సభాసదులు వాని నడుగఁగా జరిగిన వృత్తాంతమంతయు జెప్పి తుచ తప్పకుండఁ గాళిదాసు చెప్పినట్లే తాను రచించిన శ్లోకమును జదివెను.

అదివిని ధారానగరవాసులందఱు విస్మితులైరి. సభాసదులు తెల్లబోయిరి. విద్వాంసులు తలలు వంచుకొనిరి. రాజు సంతోషవారిధిం దేలి కాళిదాసుపైఁ గనకవర్షము గురిపించెను.

## విచిత్ర శ్రాద్ధము

ధారాపురమున నొక బ్రాహ్మణుఁడు శతవర్షంబులుఁ జీవించి కాళిదాసు ప్రభావ మెఱిఁగినవాఁడగుటచే మరణసమయంబునఁ

దన కుమారునిం బిలిచి "నాయనా! నా శ్రాద్ధసమయమున మహాకవి యగు కాళిదాసును భోక్తగాఁజేసి పితృయజ్ఞము చేసితివేని నా కుత్తమ గతులు గలుగును. ఊరూరు సంభావనలకుఁదిరిగి నీరుకాసులు పట్టి ప్రతివానిచేతఁ గాళ్లు గడిగించుకొని తిలదానములు నగ్న ప్రచ్ఛాదనములు మొదలైన దుర్దానములం బట్టునట్టి బ్రాహ్మణులం బిలువవద్దు. అదియుఁ గాళిదాసువంటివాఁడు దొరకకపోయినను నతనినిమాత్రము బిలిచి శ్రాద్ధకర్మ చేయుమని చెప్పి కాలధర్మమొందెను.

కాళిదాసుఁడు వేశ్యాలోలుఁడై నిరంతరము దానిగృహమునందే కాలము గడుపుచుండుటచేతను సదాచారపరాయణులగు బ్రాహ్మణులవలె నతఁడు నిష్ఠాగరిష్ఠుఁడు కాకపోవుటచేతను, బ్రాహ్మణకుమారుఁడు కాళిదాసునియందు సహజముగా నిష్టములేనివాఁడయ్యు జనకునియందలి భక్తిచేత నతనికడపటి యాజ్ఞ పరిపాలింపవలయునని కాళిదాసుని భోక్తగా నిమంత్రించెను. ఆ దినమునఁ గాళిదాసుఁడు ప్రొద్దెక్కి నిదురలేచి కాల కృత్యములం దీర్చికొని స్నానముచేయక రుద్రాక్షమాలకుమారుగాఁ బుష్పహారములు వైచుకొని విభూతికిమారుగా మేన మంచిగంధ మలందుకొని సిగను జాజిపూలదండ చుట్టి లలాటమున బొగముది దిద్దిన కస్తూరితిలకము మెఱయుచుండఁ గర్పూరవిడ్యము నమలుచు నత్తరువు పన్నీరు సువాసనలతో గుమగుమలాడు చాకింటిమడతలు గట్టుకొని వీధులవెంట విహారముచేయవచ్చిన కామదేవుఁడో యనునట్లు బ్రాహ్మణ కుమారు నింటికిఁ బోయెను. బ్రాహ్మణకుమారుఁడును దక్కిన బ్రాహ్మణులును వానినిజూచి "అయ్యా! పరమపవిత్రమైన పితృకర్మకు నీవీ యపవిత్రవేషముతో వచ్చుట ధర్మమా? కావున నీ వేషము దీసి మడిగట్టుకొని శుచివై రమ్మని చెప్పిరి. అప్పుడు కాళిదాసుఁడు మందహాసము చేసి "ఓయీ! నాకన్న శుచియైన బ్రాహ్మణుఁ డెవ్వఁడు? ఒక్కముక్కకైన నర్థము తెలియకుండ గోడ్డుగేదె యఱచినట్లు వేదములు వల్లించు నీ బ్రాహ్మణులు నాకన్నఁ బవిత్రులా? అట్లయిన

నీవంట యపవిత్రము. ఈ నూతిలోనినీళ్లపవిత్రము. ఈ శ్రాద్ధమపవిత్రము. నేనిప్పుడు పరిశుభ్రమైనజలముఁ దెప్పించెద. దానితో వంటచేయింపుము" అని యాకాశగంగ నీ విధముగా స్తవము జేసెను :

శ్లో॥ గంగాం వందే జగద్వంద్యాం, క్షీరసాగరకామినీం,
భగీరథసమానీతాం, విష్ణుపాదసముద్భవాం.

అట్లు స్తవము చేయఁగానే కుంభవృష్టిగా వర్షము గురిసినట్లు దివ్యగంగ యాకాశమునుండి దిగి వానియింట ప్రవహించెను. ఆ జలములో నందఱను స్నానములు చేయించి వంట దానితోఁ జేయించి శ్రాద్ధము జరిపింపుమని కాళిదాసుఁడు చెప్పెను. అప్పుడు కాళిదాసుని ప్రభావముచేతఁ బితృదేవతలు పితృలోకమునుండి ప్రత్యక్షముగా దిగివచ్చి భోక్తల ముఖమునఁగాకుండ స్వయముగా భుజించిరి. కాళిదాస ప్రభావమునకుఁ దక్కిన భోక్తలు, చుట్టములు, బ్రాహ్మణకుమారుఁడు మిక్కిలి యాశ్చర్యమునొంది యతఁడు సాక్షాత్పరమేశ్వరుఁడే యని స్తవముచేసి యాతనిప్రభావముఁ దెలియక మొదటనాడిన దురూక్తులను సైరింపుమని పాదములపైఁబడి ప్రార్థించిరి.

## పుట్టుమచ్చ

మిక్కిలి నేర్పరియైన యొక చిత్రలేఖకుఁడు భోజమహారాజు దర్శనము చేసి తన ప్రజ్ఞావిశేషము నిట్లు చెప్పుకొనెను :

" దేవా ! చిత్రలేఖనమునందు నేనద్వితీయుఁడను ఆత్మస్తుతి యనుచితమైనను నరుఁడు తన్నెఱుఁగనివారితోటులఁ దన ప్రజ్ఞాదికముఁ జెప్పుకొనవలసియుండును. లోకమునందలి విచిత్రకారులెవ్వరుఁ దాము చిత్తరువు వ్రాయవలసిన మనుష్యుని విగ్రహమును గనులారఁజూచిగాని వ్రాయఁజాలరు నేనో, యట్టి మనుష్యరూపమును జూడనక్కఱలేక యే తలవెండ్రుకనుజూచి, దానింబట్టి యచ్చముగనున్న రూపు వ్రాయఁగలను.

దేవరవారు నాలేఖనముఁ జిత్రించి పరీక్షించి యనుగ్రహింపవలయునని ప్రార్థించుచున్నాను. ఈనడకు నేననేక మహారాజుల యాస్థానములకరిగి నా ప్రజ్ఞావిశేషములు వారికిఁ జూపి మెప్పులు వడసి యున్నవాఁడను. శారదానృత్యమునకు రంగస్థలంబైన మీ యాస్థానమునఁగూడ మెప్పు వడయ వచ్చినాఁడ" అని విన్నవింప రాజు వాని ప్రజ్ఞను శోధింపఁదలచి యొక పరిచారికంబిలిచి లీలావతీదేవియొక్క తలవెంట్రుక నొకదానిని దెప్పించి చిత్రకారునకిచ్చి తన పట్టమహిషియగు లీలావతీదేవి చిత్తరువు నిర్మింపుమని యానతిచ్చెను. వల్లెయని చిత్రకారుఁడు స్వల్పకాలములోనే చిత్తరువు వ్రాసి సంపూర్ణము చేసి కస్తూరితో నాబొమ్మనుదుట బొట్టు వెట్టెను. వెంటనే యా తిలకము మొగమున నిలువక తొడపైఁబడెను. మరల నతఁడు మృగనాభితో లలాటమునఁ దిలకముదిద్ద నదియు నట్లే విగ్రహముయొక్క యుత్సంగముమీఁద బడెను ఎన్నిసారులు ప్రయత్నించినను నట్లే యయ్యెను చిత్రకారుఁడు తన కవసానము గలుగు నట్టి కాలము సమీపించినదని మిక్కిలి విచారించి యేమియుం దోఁచక తిరుగులాడుచు దైవవశమున నొకానొకప్పుడు కాళిదాసుం గలసికొని యా వృత్తాంత మంతని కెఱింగించెను. అతఁడు చిత్రకారునితో నిట్లనియె: "ఓయీ! లీలావతీదేవి పద్మినీజాతిస్త్రీ. ఆజాతిస్త్రీలకు తప్పక తొడ మీఁదఁ బుట్టుమచ్చయుండును. ఆ పుట్టుమచ్చ నీవు వేయుట మఱచితివి గావున మొగముమీఁద నీవు పెట్టిన కస్తూరితిలకము తొడమీఁదఁబడి పుట్టుమచ్చ యగుచున్నది. ఈ పర్యాయము మరల విగ్రహముయొక్క నుదుటను నీవు కస్తూరితిలకము వెట్టుము. అది తొడమీఁదఁ బడును. తొడమీఁదనుండి దానిని దుడిచివేయక కస్తూరితిలకము మరల లలాటమునఁ బెట్టుము. అది పడిపోవక నిలుచును" అని యుపదేశింపఁ జిత్రకారుఁడు మిక్కిలి సంతోషించి కాళిదాస మహాకవి చెప్పినట్లు వేసినతోడనే బొమ్మయొక్క ఫాలభాగమునందుఁ దిలకము నిలిచెను. నిలిచినతోడనే చిత్రకారుఁడు తనజన్మము సఫలమయినదని, తనవిద్య

వన్నె కెక్కు కాలము వచ్చినదని, తనకు స్థిరయశస్సు గలుగు సమయము వచ్చినదని సంతసించి భోజమహారాజున కా చిత్తరువును సమర్పించెను. మహారాజు దానిం జూచి "ఆహాహా! ఎంత చక్కఁగా వ్రాసితివి. కలకల నవ్వినట్లు కనులు దెఱచి చూచునట్లు, నోరు దెఱచి మాటాడుచున్నట్లు, వేయేల జీవకళ యుట్టిపడునట్లులిఖించితివి. ఈవఱకెందఱనో చిత్రకారులఁ జూచియుంటినిగాని, తలవెండ్రుకనుబట్టి చిత్తరువులిఖింపఁగల యసాధారణ ప్రజ్ఞాశాలినిఁ జూడలేదు సరిగదా యట్టివాఁ డున్నవాఁడని విననైనలేదు. కాని, తొడమీఁద నల్లమచ్చ వైచితివెందుచేత?" నని యడిగెను. "దేవిగారి కచ్చట నొక పుట్టుమచ్చ యున్నది. దానిం జూపుటకై కస్తూరితో నక్కడ నొకచుక్క బెట్టితి" నని చిత్రకారుఁడు బదులుచెప్పెను. "అక్కడ పుట్టుమచ్చ యున్నదని నీ వెట్లెఱిఁగితి" వని రాజడిగెను. "కాళిదాసుఁడు చెప్పె" నని చిత్రకారుఁ డుత్తరమిచ్చెను.

ఆక్షణమే రాజు కాళిదాసునిఁ బిలిపించి "దేవీ కుత్సంగతలమున నొక పుట్టుమచ్చ యున్నమాట నీ వెట్లెఱిఁగితి" వని యడిగెను. అప్పుడు కాళిదాసు తత్తఱపడక వినయంబుగదుర నిట్లుత్తరము చెప్పెను–"దేవా! ఆగ్రహింపక చిత్తగింపుఁడు. పద్మినీజాతిస్త్రీలకు నుత్సంగతలమున నట్టి పుట్టుమచ్చ యుండును. ఈ విషయము సాముద్రిక శాస్త్రవేత్తలకుఁ దెలియును. ఆ శాస్త్రమునుగూడ నేను చదివినవాఁడ నగుటచే నేనిట్లు చెప్పితిని. మీఁద దేవర వారిచిత్తము" అని చిత్తరువుయొక్క మొగము మీఁది తిలకము తొడమీఁదఁ బడుట మొదలగు వృత్తాంతమంతయుఁ జిత్రకారుఁడు తనతోఁ జెప్పిన ప్రకారము రాజుతోఁ గాళిదాసుఁడు చెప్పెను. చిత్రకారుఁ డదియంతయు నిజమని పలికెను.

మహారాజునకుఁ గాళిదాసునిపై ననుమానము కలిగెను. ఆతఁ డంతఃపురద్రోహియని నిశ్చయించి రాజు తనదేశమునుండి వెడలిపొమ్మని యానతిచ్చెను. కాళిదాసుఁడు పంచిదని నిర్విచారముగ విలాసవతీ గృహంబునకుఁబోయి యచ్చటఁ దలదాచుకొని కాలక్షేపము సేయఁ జొచ్చెను.

# కాళిదాసుని మరణము

కాళిదాసుఁడు నిర్దోషియయ్యు భోజరాజునకనిష్టుఁడై విలాసవతీమందిరంబునఁ గొన్నిదినములు కాలక్షేపము సేయునప్పటికి భోజమహారాజునకు వెండియు మనంబునఁ బశ్చాత్తాప ముదయించెను. ఉదయించినతోడనే దేశమందలి నానాభాగములకుఁ దనసేవకులఁబంపి వెదకింపఁజొచ్చెను. ఎచ్చటను గానఁబడలేదు. విలాసవతీగృహంబుననె డాఁగియున్నాఁడని కొందఱు వక్కాణించిరి. ఆమెయింట లేఁడుగాని యనుదినమును రాత్రులయం దామెగృహంబునకు వచ్చి పోవుచుండునని కొందఱనిరి. రాజాస్థానము రోసి, ముక్తిప్రదాయకములైన పుణ్యతీర్థములను సేవించుటకై దేశాంతరముబోయెనని కొందఱు చెప్పిరి. పలువురు పలుతెఱంగులఁ బల్కుచుండుటచే నెద్దియుం దోఁచక భోజభూపాలుఁడు కృపాళుఁడై కాళిదాసువియోగ దుఃఖ మతిశయ మగుటచే నతఁడు తప్పక వేశ్యాగృహంబునకు వచ్చి పోవుచుండు నని నిశ్చయించి సపరివారముగా దాని గృహంబునకుంజని కాళిదా సెచ్చటనున్నవాఁడని యడిగెను. "దేవా! యాతనిజాడ నాకుఁ దెలియ"దని యా వెలయా లుత్తరము చెప్పెను. దాని మాటయందు విశ్వాసములేక రాజు తనలో నిట్లు తలంచెను—

"కాళిదాసుఁడు బ్రతికియున్నవాఁడని నాకు నమ్మకము. బ్రతికియున్న పక్షమున దీనియింటికి రాకపోఁడు. దీనియందతఁడు బద్ధానురాగుఁడు. కావున దీని లోపలిగది గోడమీఁద నేనొక శ్లోకములో సగముభాగము వ్రాసి పోయెద. అది చూచినపక్షమున దానికిఁ బ్రత్యుత్తరముగా నతఁడు తక్కిన సగముశ్లోకమును బూరింపక పోఁడు. సమస్యాపూరణమునం దతనికి నిరుపమానమైన ప్రజ్ఞ కలదు. గావున నీ సమస్య నతఁడే గాని పూరింపలేఁడు గావున నతఁడు తప్పక బైలుపడును. ఇంతకన్న నిరపాయమైన

యుపాయములేదు " అని యీక్రిందిశ్లోకార్థము నావెలయాలి మంచము ప్రక్కనున్న గోడమీఁద స్వహస్తముతో లిఖించెను.

శ్లో॥ కుసుమే కుసుమోత్పత్తి శ్శ్రూయతే నచ దృశ్యతే,

తా॥ పువ్వునందుఁ బువ్వుపుట్టుట వినలేదు, కనలేదు.

అనివ్రాసి యీసమస్య నెవ్వఁడుపూరించునో వానికర్ధరాజ్యమును భోజుఁ డిచ్చుచున్నాఁ డనికూడ దానిక్రింద సంస్కృతములో వ్రాసి వేశ్యాగృహమును విడిచి నిజమందిరమున కరిగెను.

ఆరాత్రి భోజనృపాలుఁ డూహించినట్లే కాళిదాస మహాకవి వెలవెలఁది యింటికిఁ బోయి రాజు తననిమిత్తమై వచ్చిన వృత్తాంతముఁ బ్రియురాలు చెప్పఁగా విని యతనికి వెండియుఁ బశ్చాత్తాపము జనించి నందుకు సంతసించి యతని మనోరధసిద్ధి చేయఁదలంచి సమస్య నీక్రింది విధముగాఁ బూరించెను,

" బాలే ! తవముఖాంభోజే దృష్ట మిందీవరద్వయం "

తా॥ ఓ బాలా ! ( ఓ ప్రియురాలా ! ) నీ ముఖమనెడు తామర పువ్వునందు నల్లకలువపూవులజంట కనఁబడుచున్నది. అనఁగాఁ బూవు లోఁ బువ్వుపుట్టుట లోకమునం దెచ్చటను లేకపోయినను నేఁటికాలమున కది కనఁబడుచున్నది. ఎట్లన, నీ మొగమనెడి తమ్మిపూవునందుఁ గన్ను లనెడు రెండు కలువపూవులు మొలచినవి. పుష్పమందుఁ బుష్పము పుట్టుట యసంభవ మైనను నీయందు నిజమైన దని భావము.

'బాలే' యనుమాట బోగముదానినిగూర్చి కాళిదాసు చెప్పెను. దానియందలి ప్రేమాతిశయముచే దాని నే యించు వర్ణించెను. శ్లోక మతి రమణీయముగా నుండుటచేత వేశ్యకు దుర్బుద్ధి పుట్టెను. కాళిదాసుఁడు సమస్యను బూరించినాఁడని విన్నపక్షమున రాజు వాని కర్ధరాజ్యము తప్పక తన వాగ్దానము ప్రకార మిచ్చివేయునని దురాశాప్రేరితురాలై యా గణిక కాళిదాసుం జంపి యా సమస్య తానే పూరించినట్లు

రాజుతోఁ జెప్పి యర్ధరాజ్యము తానే గ్రహింపవలెనని సంకల్పించెను. ఆహాహా! చూచితిరా దాని దౌర్జన్యము. తన్ను నమ్మి చిరకాలము తన సహవాసముచేసి తన్ను సుఖపెట్టి మహారాజిచ్చిన బహుమానములన్నియుఁ దనకే యిచ్చి తన్ను స్వభార్యగాఁ గాళిదాసుఁడాదరించినను వేశ్య విశ్వాసములేక పాపభీతి లేక యాశాపిశాచగ్రస్థయై మహాపండితుఁడై, నిరుపమానకవియై, లోకోత్తరప్రభావుఁడై, యద్వితీయ ప్రతిష్ఠాసంపాదకుఁడై, విశేషించి బ్రాహ్మణుఁడైన యా కాళిదాసును గాఢనిద్రాసమయమున ఖడ్గముతో నొక్కవ్రేటునఁ దెగనేసి చంపెను. చంపి కాళిదాసుఁడు పూరించిన శ్లోకభాగములోఁ దనను ద్దేశించి చెప్పఁబడిన 'బాలే' యనుమాట దీసివైచి భోజరాజు నుద్దేశించి తాను జెప్పవలెనని 'రాజన్' అనుటకుబదులుగా 'రాజే' యనుమాట జేర్చి "రాజే! తవ ముఖాంభోజే దృష్ట మిందీవరద్వయ"మ్మని వ్రాసెను.

మఱునాఁడుదయమునఁ గాళిదాసునిశవమున్నగదికి గట్టితాళము వైచి భూర్జపత్రముమీఁద నా శ్లోకము వ్రాసికొని కొలువుదీర్చియున్న మహారాజు దర్శనము జేసి "దేవా! దేవరవారిచ్చిన సమస్య నేను పూరించితిని. మీఁద దేవరవారిచిత్తము" అని విన్నవించి శ్లోకము జదివెను. అది వినఁగానే మహారాజున కనుమానము గలుగ నతఁడిట్లు వితర్కించెను—"ఉపమాన మా కాళిదాసునిదై యున్నది. లలితపద ప్రయోగమా యమ్మహాకవిదే. సమస్య నతఁడే పూరించియుండును. ఇంత చమత్కారముగా దానిం బూరించువారు ప్రపంచమున లేరు. ఈ పణ్యాంగనకింత తెలివితేట లెక్కడివి? అనన్యసాధ్యమైన యిట్టికల్పన దీని నోటినుండి రాఁగలదా? కాని! కాళిదాసే పూరించినపక్షమున 'రాజే' యను తప్పుశబ్ద మతఁడు ప్రయోగించియుండునా? ఈ స్వల్ప శబ్దదోషమా మహాకవికిఁ దెలియదా? పౌర్వాపర్యములు విచారింపఁగా సమస్య కాళిదాసుఁడే పూరించియుండుననియు, నీవేశ్య శ్లోకకర్తృత్వము

దన కారోపించుకొని నావలన నర్ధరాజ్యముఁ బుచ్చుకొనవలె నని కాళిదాసు సమ్మతిమీఁదనో, వానిని వంచించియో యిది గ్రహించి కాళిదాసు ప్రయోగించిన శబ్ద మేదో తుడిచివైచి దానికి బదులుగా 'రాజే' యనుశబ్దమును జేర్చియుండవచ్చును" అని మనంబున వితర్కించి విలాసవతింజూచి "ఓసీ! యిది నీ కవిత్వముగాదు. కవిత్వమునకును నీకును నూఱామడదూరము. కవనమెన్నఁడు నీవఱకు నీవు చెప్పియుండ లేదు. ఇది కాళిదాసు కవిత్వమని యూకల్పనమే చెప్పుచున్నది. కాళిదా సెక్కడ నున్నాఁడు? వానికేదేని ద్రోహము గావించి యీ శ్లోకముఁ దెచ్చితివా? లేక వాని సమ్మతిమీఁదఁ దెచ్చితివా వెంటనే చెప్పుము? చెప్పవేని నిన్నిప్పుడే భయంకరములైన దండనలపాలు చేసెద" నని భయంకరముగా రూక్షనిరీక్షణుఁడై యడుగ విలాసవతి గడగడవడఁకుచు సాక్షాద్యమధర్మరాజువలె నున్న యా మహారాజు పాదములపైఁబడి యేడ్చుచు నిట్లనియె—"మహాప్రభూ! అర్థరాజ్యము నేను గ్రహింప వలెనని దురాశ చేఁ గాళిదాసుని నిన్న రాత్రి చంపితిని. నేను పాపాత్మురాలను. 'బాలే తవముఖాంభోజే' యని యతఁడు సమస్యనుబూరించెను. 'బాలే' యనుమాట దీచివైచి 'రాజే' యని నేను చేర్చితిని. నేను పాడుముండను. పాడుపనిచేసితిని. నన్ను మీ చిత్తమువచ్చినశిక్ష వేయింపుఁడు"

కర్ణకఠోరమైన యావార్త పిడుగుపాటువలెఁ జెవి సోఁకినతోడనే రాజు సింహాసనముమీఁదనే మూర్ఛిల్లెను. సభాసదు లందఱుఁ గన్నీరు సోనలై పాఱ దుఃఖించిరి. ఆహా! 'స్త్రీబుద్ధిః ప్రళయాంతకః' అనుమాట నిజమయ్యెనని కొందఱుపలికిరి. ఈ దురాత్మురాలిని ముక్కముక్కలుగాఁ గోసి కాకులకు గ్రద్దలకు నెఱవేయుఁడని మఱికొందఱు భాషించిరి. పరిచారకులు చల్లనినీరు, పన్నీరు మొగమునఁజల్లి శైత్యోపచారములు చేయుటవలన రాజు మూర్ఛనుండి తేఱి యిట్లు విలపించెను. "హా! మహాపండిత, హా! లోకైకమహాకవి, హా! దేవీవరప్రసాద, హా!

సమస్యాపూరణచక్రవర్తి, హా ! సాహితీ కవితాసార్వభౌమ, హా ! ఆగతానాగతవర్తమానవేది, హా ! అష్టభాషాశబ్దశాసన, హా ! ఉమా సరస్వతీ, హా! శారదావతార, హా! లోకోత్తరచరిత్ర, నీవంటిమహాకవిని గోలుపోయిన నాకీ లోక మెందుకు ? రాజ్యమెందుకు ? పురమెందుకు, నంతిపురమెందుకు ? కిరీటమెందుకు ? సింహాసనమెందుకు ? నేను నీతో వచ్చెద. ఇంక లోకమున సత్కవిత్వము చచ్చినది. పాండిత్యము భగ్నమైనది. విద్యలు విచ్చుమొగ్గయినవి. సమస్య లడుగంటినవి. సరస్వతి నేఁడు దిక్కులేనిదైనది. కవితాకన్యక నేఁడనాథమైనది. సరసకవిచంద్రుం డస్తమించినాఁడు ఇఁక జగ మంధకారమైనది. నా సభాలంకారము తొలఁగిపోయినది. ధారానగరము పండితశూన్యమైనది. ఇంక నేను జీవింపఁజాల '' నని వగచి వగచి మఱల మూర్ఛవోయెను. మూర్ఛానంతరమున నతనికిఁ బూర్వజన్మవృత్తాంతము స్మరణకు రాఁగాఁ గాళిదాసుఁడు పోయిన యేడుగడియలకే తనకు మరణ మున్నదని గ్రహించి దానికి వలయు ప్రయత్నములఁ జేయించెను.

## భోజుని మరణము

**కా**ళిదాసు మరణించె ననియు భోజుఁడుఁగూడ బలవన్మరణము నొందుచున్నాఁడనియు వినినతోడనే ధారానగరమంతటను హాహాకారములు చెలఁగెను. భోజమహారాజు ప్రజలకుఁ దండ్రివంటివాఁడై భూమి పాలించినందున నెల్లవారును దమయాప్తబంధువుఁ డెవఁడో మృతి నొందుచున్నట్లు మహాదుఃఖభరితులైరి. అంతఃపురమంతయు హాహాకారములతోఁ బ్రతిధ్వనించెను. సభయంతయుఁ గవిపండితామాత్య ప్రముఖుల బాష్పధారలచే వర్షము గురిసినట్లుండెను. మహారాజునాజ్ఞచే

మంచిగంధపుఁ గట్టెలతో నొక చితి సిద్ధముచేయఁబడెను. త్వరగా నాహుతియగుటకు, నగ్నిహోత్రుని ప్రీతికొఱకు నేతికడవలు ప్రక్కన సిద్ధము చేయఁబడెను. "రాజ్యాంతే నరకం ధ్రువ" మ్మను లోకోక్తిని బట్టి రా జెంత సత్పరిపాలనము జేసినను నెఱిఁగియు నెఱుఁగకయు ననేక పాపములం జేయును. గావున నామాట జ్ఞప్తికిఁ దెచ్చుకొని భోజ భూపాలుఁడు సకలపాప నివృత్తికొఱకును, శాశ్వత మోక్షపదప్రాప్తి కొఱకును, రామకథాసుధారసము ప్రబంధరూపముగా వెలయింపవలె నని యాశుకవిత్వముగా 'చంపూ రామాయణము' రచియించి యేఁడు గడియ లగునప్పటికి సుందరకాండము ముగించెను. తరువాతఁ దనకు గడువు లేదని యుద్ధకాండము ముగింపకయే మరణకాంక్షియై చితి నారోహించెను సహగమనము చేయఁదలచి పట్టమహిషి యగు లీలావతీదేవియు భర్తతోడిదేలోకమని మున్నె మెత్తని హంసతూలికా తల్పముమీఁద నాతని ప్రక్కను బండుకొన్న తెఱఁగుననే చితిమీఁదఁ గూడ నాతని ప్రక్కను బండుకొనియెను. చితి దరికొల్పఁబడెను. అబ్బా యనక నమ్మా యనక సుఖవిలాసము మార్పక యా దంపతులు నగ్నిహోత్రున కాహుతులైరి. తన జన్మమధ్యమునం దెన్నఁడు నటువంటి యాహుతి తనకు దొరకదు గావున లోకాతీతమైన యట్టియాహుతి సంప్రాప్తించినందుకు మహానందభరితుఁడై కాఁబోలు నగ్నిహోత్రుఁడు విజృంభించి సేవకులుపోయు నాజ్యమును గడుపాఱద్రావుచు దేదీప్యమాన ప్రభలతో వెలిఁగి యత్యల్పకాలమున దంపతులను భస్మావశిష్టులఁ జేసెను.

ఆవిధముగా సకల కవికులచక్రవర్తియగు కాళిదాసుఁ డస్తమింప రాజకులభూషణుఁడును, విద్వజ్జన కల్పవృక్షమును, విద్యావినోదియు, దానకర్ణుఁడును, దయామయస్వరూపుఁడును, పండితబాంధవుఁడును నైన భోజరాజు స్వర్గస్థుఁడై, మృతినొందియు జీవించియుండెను.

ఎందఱు రాజులు వసుంధర నేలియుండలేదు ? ఎందఱు భూపాలురు సింహాసనము నెక్కియుండలేదు ? ఎందఱు నవరత్నఖచిత కిరీటములు ధరించియుండలేదు? ఎందఱు విద్యావినోదులై యుండలేదు? ఎందఱగ్రహారములు, మాన్యములు కవిపండితుల కిచ్చియుండలేదు ? ఎందఱు పరాక్రమవంతులై మహాసైన్యసమేతులై పరదేశంబుల జయించియుండలేదు ? అందఱికి నిట్టికీర్తి కలిగెనే ! ఏ రాజు నామము స్మరించినమాత్రమున దారిద్ర్యదేవత కడుదూరమునకుఁ బాఱిపోవునో, యే భూపాలుని మొగము జూచినమాత్రమునఁ గవిత్వము మహాప్రవాహముగా మందమతికైనఁ బుట్టుచువచ్చెనో, యే రాజశేఖరలక్ష్మి లిచ్చి కవిపండితపారిజాతమని ప్రసిద్ధినడసెనో, యే రాజుసభామందిరము శారదాదేవి నృత్యముచేయుటకు రంగస్థలంబయ్యెనో, యెవ్వరి నివాసంబుకతంబున ధారానగరము ధన్యమయ్యెనో, మాళవదేశ మలంకరింపఁబడెనో, యట్టి భోజభూపాలుఁడు, సింధులరాజగర్భరత్నాకరసంపూర్ణచంద్రుఁడు, సావిత్రీగర్భశుక్తి ముక్తాఫలము, సంపాదించినయశస్సు, ప్రపంచమున నెంతకాలము సూర్యమండల మంధకారమునుబాపుచు వెలుఁగుచుండునో, యెంతకాలము చంద్రమండలము చలువలు వెదఁజల్లుచు నాకసంబున కలంకారమైయుండునో, యెంతకాలము నక్షత్రములు గగనమధ్యమునఁ దాపిన వజ్రములతీరున భాసిల్లుచుండునో, యెంతకాలము రత్నాకరములను పేరుతో సముద్రము లింకక యుండునో, యెంతకాల మీ భూదేవి సకలసస్యప్రదాయినియై భూతకోటిం దృప్తిపఱచుచుండునో, యెంతకాలము వాయువు ప్రసరించుచుండునో యంతకాలము నిర్మలమై నిశ్చలమై నిరుపమానమై నిర్దుష్టమై వెలయుఁగాత !

సంపూర్ణము.

రాజేశ్వరి ప్రెస్. రాజమహేంద్రవరం.